తెలుగు అకాడమి ప్రచురణ (బి. ఏ.)-106

# ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం - రాజకీయాలు

రచయిత

డా॥ ఎన్. ఇన్నయ్య

జర్నలిస్టు, ఆదర్శనగర్, హైదరాబాదు

సంపాదకుడు

డా॥ జి. రాంరెడ్డి

వైస్‌ఛాన్సలర్, ఓపెన్ యూనివర్సిటీ, హైదరాబాదు



తెలుగు అకాడమి

హైదరాబాదు

1983

# భూమిక

1968 లో స్థాపన జరిగిననాటినుంచి ఉన్నతస్థాయిలో బోధనా భాషగా తెలుగు కుదురుకోవటంలో తెలుగు అకాడమి నిర్వహిస్తున్న పాత్ర అందరికి విశదమైనదే. ఎన్నోరకాల ఇబ్బందులను అధిగమిస్తూ అత్యల్పవ్యవధానంలో విస్తృతంగా పాఠ్య, పఠనీయ, అనువాద, పరామర్శ గ్రంథాలను ప్రచురించి అకాడమి విద్యారంగానికి సముచితమైనసేవ చేయగలిగింది. అకాడమి ప్రచురణలు ఎన్నో పునర్ముద్రణకూడా పొందినవి. పునరభ్యసన గోష్ఠులద్వారాను, విద్యార్థులు, విద్యాధికులు, ఉపాధ్యాయులు ఆసక్తితోచేస్తున్న సూచనలద్వారాను ఎప్పటికప్పుడు ఈ గ్రంథాలను మెరుగుపరచటంలో కృషిజరుగుతూనే వచ్చింది. అయినా ఒకక్రమ పద్ధతిలో శాస్త్రీయదృష్టితో ఈ గ్రంథాలను గుణపరీక్ష చేయించి పరిష్కృత ముద్రణలను వెలువరించటానికి అకాడమి ఒక ప్రణాళికను చేపట్టింది. ఈ కార్యక్రమంలో విశ్వవిద్యాలయ ఆచార్యులు, కళాశాల ఉపాధ్యాయులు మాకు ఎంతగానో సహకరించినారు.

ఈ విధంగా ముద్రణలను వెలువరించటానికి వెనకఉన్న ఆశయాలు రెండు : మొదటిది- అప్పుడప్పుడు పాఠ్యప్రణాళికలో తీసుకొనివచ్చే మార్పులకు అనుగుణంగా పుస్తకాలను తీర్చిదిద్దటం; రెండవది – గ్రంథాలలో ఉన్న విషయానికి అవసరమయిన మేరకు సరికొత్త విషయాలు చేర్చటం.

పుస్తకంలో ఉపయోగించిన పారిభాషికపదాల పట్టికలను, సమానార్థకాలను పుస్తకం చివర మునుపు ఇవ్వటం జరిగింది. అయితే పారిభాషికపదాలను కూడా పరీక్ష చేయించి పరిష్కృత పదకోశాలను ఏ శాస్త్రానికి ఆ శాస్త్రంగా విడివిడిగా కాని, పరస్పర సన్నిహితత్వం ఉన్న శాస్త్రీయ వర్గంగాకాని వేరుగా ప్రకటిస్తున్నాము. ఈ కారణంచేత ప్రత్యేకించి ఆ పట్టికలను ఇప్పుడు పుస్తకంచివర ఇవ్వటంలేదు.

ఈ గ్రంథాన్ని ఇంతకంటె సమగ్రంగాను, సుందరంగాను తీర్చిదిద్దటానికి సూచనలిస్తే కృతజ్ఞతతో స్వీకరించగలము.

# ప్రవేశిక

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో బి. ఏ. విద్యార్థులకు, రాజకీయ శాస్త్ర విభాగం వారు నిర్దేశించిన పాఠ్యప్రణాళిక ననుసరించి ఈ గ్రంథం వ్రాయడం జరిగింది. ఆంధ్ర ప్రదేశ్ 1956 లో ఏర్పడినప్పటినుంచీ 1981 వరకూ జరిగిన వివిధ ఘట్టాలు ఇందులో ఉన్నాయి కేంద్రానికీ, రాష్ట్రానికీ, గల సంబంధాలు, రాష్ట్ర అధికారులు చర్చించడంతో బాటు, రాష్ట్రం ఏర్పడటానికి దారితీసిన పరిస్థితులుకూడా సంక్షిప్తంగా వివరించడమయింది. ఉభయ శాసన సభలూ, వాటి సంఘాలూ పనిచేసే తీరుతెన్నులు చర్చించడమయింది. శాసన సభలు పనిచేసే తీరుకు మచ్చుతునకగా 1981 నవంబరు 16 న శాసనసభ, శాసనమండలి కార్యక్రమ వివరణ ఇవ్వడమయింది. ప్రస్తుతం ఉన్న వివిధ రాజకీయ పార్టీల పరిస్థితిని కూడా క్లుప్తంగా ప్రస్తావించడం జరిగింది. ముఖ్యంగా కాంగ్రెసు, కమ్యూనిస్టు పార్టీలకు పెద్ద చరిత్ర ఉంది. అయితే పాఠ్యప్రణాళికలో చరిత్ర వ్రాసే ఉద్దేశం లేదు. కాబట్టి ఆ ప్రయత్నం చేయలేదు. సాధ్యమైనంతవరకు వివాదాస్పదమయిన విషయాలను ప్రస్తావించకుండా, కేవలం ప్రస్తుత స్థితిని మాత్రమే ప్రస్తావించడమైంది. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరవాత జరిగిన పెద్ద ఆందోళనలు రెండు చాలా విపులంగా పరిశీలించడమయింది. ఈ ఆందోళనకు అనుకూలంగానైతేనేమి, ప్రతికూలంగానైతేనేమి రాష్ట్రంలోని ప్రజలందరూ స్పందించినారు; ప్రభావితులైనారు. కాబట్టి వివరంగా సంఘటనలను వ్రాయడం సమకాలీన రాజకీయాలకు అవసరం అనిపించింది. ఈ సంఘటనలలోని మంచి-చెడ్డలనుగానీ, విలువలనుగాని చర్చించలేదు. వివాదాస్పదమయిన విషయం కాబట్టి ఆ నిర్ణయాన్ని పాఠకులకు వదలివేయడమయింది. 1983 లో జరిగిన ఎన్నికలు, తెలుగుదేశంపార్టీ అధికారంలోకి రావడంతోసహా ప్రస్తావన ఉన్నది.

# విషయసూచిక

# 1

# సమాఖ్యరాజ్యము - రాష్ట్రాల పరిస్థితి

మనది సమాఖ్య వ్యవస్థతో కూడిన రాజ్యము. మన రాజ్యాంగం లిఖిత పూర్వకమైంది. 1946లో రాజ్యాంగ సభ ఏర్పడి నాలుగు సంవత్సరాలపాటు కూలంకష చర్చచేసి రాజ్యాంగాన్ని రూపొందించింది. తదనుగుణంగా సమాఖ్య రాజ్యాన్ని భారత ప్రజలు ఆమోదించినారు. సమాఖ్యరాజ్యంలో రాష్ట్రాలు అన్నీ శాశ్వతమైన కలయికతో ఉంటాయి. వాటి ఇష్టం వచ్చినట్లు దేశం నుంచి విడిపోయే పద్ధతిని సమాఖ్య రాజ్యం అంగీకరించదు. రాజ్యాంగాన్ని అనురించి కేంద్రప్రభుత్వానికీ, రాష్ట్రప్రభుత్వానికి విడిగానూ, ఉమ్మడిగానూ అధికారాలు స్పష్టంగా నిర్దేశించడమైంది. సమాఖ్య రాజ్యంలో ప్రజలు సార్వభౌములు. కేంద్ర రాష్ట్ర శాసనసభలు వివిధ చట్టాలను ఆయాసందర్భాలలో రూపొందిస్తుంటాయి. భిన్న రాష్ట్రాల మధ్య ఐక్యత ఉండటం సమాఖ్య రాజ్యంలో ఒక విశిష్ట లక్షణము. ఈ విధమైన సమాఖ్యవాదం ఆధునిక కాలంలో అమెరికాలో ప్రారంభమై, ఇతర దేశాలకు వ్యాపించింది.

సమాఖ్యరాజ్య విషయమై రాజ్యాంగసభ క్షుణ్ణంగా చర్చించింది. భిన్నత్వాల మధ్య ఏకత్వాన్ని సాధించటానికి సమాఖ్య విధానం ఒక్కటే ఉత్తమ మార్గమని అంగీకరించినారు.

భారత రాజ్యాంగం ఫెడరల్ వ్యవస్థను సూచిస్తూంది. దేశం అంతటికీ ఒకే కేంద్ర ప్రభుత్వం, రాష్ట్రాలకు కొంతవరకూ స్వతంత్ర ప్రతిపత్తిగల ప్రభుత్వాలు, ఉన్నాయి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు విడిగానూ ఉమ్మడిగానూ అధికారాలు ఉన్నాయి. భారత రాజ్యాంగం లిఖితపూర్వకంగా సులభంగా మార్చడానికి వీలులేని వ్యవస్థను ఏర్పరచింది. రాజ్యాంగం అన్నిటి కంటె ఆధిక్యం గలది. దీని ననుసరించి కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వాలు ఏర్పడినాయి. రాజ్యాంగాన్ని సుప్రీంకోర్టు మాత్రమే వివరించి భాష్యం చెప్పగలదు. రాజ్యాంగాన్ని మార్చేహక్కు పార్లమెంటుకు ఉంది.

కేంద్ర ప్రభుత్వానికి రాజ్యాంగ పరంగా 97 విషయాలలో అధికారాలు ఉన్నాయి. ఇందులో ప్రధానంగా పేర్కొనదగినవి దేశరక్షణ, సైన్యం, అణుశక్తి, విదేశీ వ్యవహారాలు, రైల్వేలు, నౌకలు, తంతితపాలా శాఖలు మొదలైనవి. ఉమ్మడి జాబితాలో 47 విషయాలున్నాయి. ఇందులో న్యాయ పరిపాలన, వివాహాలు, విడాకులూ, శిక్షాస్మృతి, కార్మిక సంఘాలు మొదలైనవి

ఉన్నాయి. రాష్ట్రాలకు 66 విషయాలలో అధికారాలు ఉన్నాయి. శాంతి భద్రతలు, స్థానిక పరిపాలన, ప్రజారోగ్యం, వ్యవసాయం, నీటిపారుదల, అడవులు, జైళ్ళు మొదలైన అంశాలు ఇందులో ఉన్నాయి

దేశభద్రత నిమిత్తం ఒక ప్రాంతంలోగానీ, దేశం అంతటాగానీ, అత్యవసర పరిస్థితిని రాష్ట్రపతి విధించవచ్చు. అప్పుడు రాష్ట్రం అధికారాలు, స్వతంత్ర ప్రతిపత్తి, తాత్కాలికంగా కేంద్రం స్వీకరిస్తుంది. రాష్ట్రానికి సంబంధించిన శాసనాలన్నీ పార్లమెంట్ చేస్తుంది. ఆర్థికపరమైన వనరులు కూడా కేంద్రమే కేటాయిస్తుంది.

కొన్ని అధికారాలు రాజ్యాంగ పరంగా, కేంద్ర, రాష్ట్ర, ఉమ్మడి జాబితాలకు చెంది ఉన్నాయి. రెసిడ్యుఅరీ అధికారాలను కేంద్రం వినియోగించ గలిగితే, రాష్ట్రాలకంటె కేంద్రమే బలీయమైనదిగా భావించవచ్చు. అయితే రాష్ట్రాలకు కొన్ని నిబంధనలతోగాని, నిర్నిబంధంగాగానీ అధికారాలిచ్చే అధికారం రాష్ట్రపతికి ఉంది. రాష్ట్రాలు చట్టాలు సరిగా అమలు పరచవలసిన ఆవశ్యకతపై హెచ్చరించే అవకాశం కేంద్రానికి ఉంది. కేంద్రానికీ రాష్ట్రానికీ సంబంధాలను గురించి, వివిధ రాష్ట్రాల మధ్య సంబంధాల గురించి అభిప్రాయభేదాలూ, కలహాలూ పరిష్కరించటానికి అంతర్ రాష్ట్ర సమితినీ పార్లమెంట్ ఏర్పరచవచ్చు.

ఆర్థిక వనరుల విషయమై, పన్నులు విధించే తీరుపై, వాటిని పంపిణీ చేసే విధానంపై, రాజ్యాంగ పరంగా స్పష్టమైన సూచనలు ఉన్నాయి. కేంద్రం కార్పొరేషన్ పన్నులు, సుంకాలు, ఎగుమతి, దిగుమతి సుంకాలు, పొగాకు వంటి వాణిజ్యపంటలపై సుంకాలు, విదేశీ మార్పిడులు మొదలైన వాటిపై స్టాంపు డ్యూటీలు వేయవచ్చు. రైల్వే, పోస్టల్ రేట్లు నిర్ణయించడం, పొదుపు మొత్తాలు సేకరించడం, విదేశీరుణాలు స్వీకరించడం, కేంద్రం పరిమితిలో ఉన్నాయి. అయితే కొన్ని పన్నులు కేంద్రం వసూలు చేసినప్పటికీ రాష్ట్రాలకు పంపిణీ చేస్తుంది. వ్యవసాయ భూములు కాని ఆస్తులపై సుంకాలు ఎస్టేట్ డ్యూటీలు, రైలు ఛార్జీలు, సరకు రవాణాపై పన్ను, వార్తాపత్రికల అమ్మకంపై పన్ను ఇత్యాదులు వివిధ రాష్ట్రాలకు పంపిణీ చేస్తుంది. కార్పొరేషన్ పన్ను మాత్రం యూనియన్ ఉంచుకొంటుంది. కంపెనీలపై వచ్చే లాభాలపై విధించే సూపర్ టాక్స్‌ను కార్పొరేషన్ పన్ను అంటారు. రాష్ట్రాలకూ, కేంద్రానికీ పంపిణీ చేయవలసిన వసూళ్ళను గురించి ఆర్థిక సంఘం సిఫారసు చేస్తూ ఉంటుంది. కేంద్రం రాష్ట్రాలకు నిధులు యివ్వవచ్చు. రాష్ట్రాలనుంచి అప్పు స్వీకరించ వచ్చు. కేంద్ర-రాష్ట్రాల మధ్య సంబంధాలు శాసన బద్ధంగానూ, పరిపాలనా రీతులతోనూ, ఆర్థిక సంబంధాలతోనూ కూడి ఉన్నాయి.

కేంద్రంలోనూ, రాష్ట్రంలోనూ ఒకే పార్టీ పరిపాలిస్తున్నప్పుడు సర్వసాధారణంగా వ్యవహారాలన్నీ సక్రమంగా నేసాగిపోతూంటాయి. ఆంధ్రప్రదేశ్‌కు

సంబంధించినంత వరకూ ఒకే ఒక పర్యాయం రాష్ట్రపతి పరిపాలన విధించినారు. ప్రత్యేక ఆంధ్ర కోసం ఆందోళన జరిగిన ఫలితంగా 1973 జనవరి 17న పి.వి. నరసింహారావు మంత్రి వర్గం రాజీనామా చేయడం, అధ్యక్షుపాలన ప్రవేశపెట్టడం జరిగింది. అప్పుడు గవర్నరు సలహాదారులుగా శ్రీ వి.కె. రావు, శ్రీ హెచ్.సి. సరీన్‌లను నియమించినారు. రాష్ట్రంలో రాష్ట్రపతి పరిపాలన ఇంచుమించు ఒక సంవత్సరం పాటు సాగింది. 1973 డిసెంబరు 10న శ్రీ జలగం వెంగళరావు ముఖ్యమంత్రిగా రాష్ట్రమంత్రి వర్గాన్ని ఏర్పాటుచేసేటంత వరకూ ఈ పాలన ఉంది. రాష్ట్రపతి పాలన సాగుతుండగా ప్రత్యేక ఆంధ్ర ఆందోళనను దృష్టిలో పెట్టుకొని కేంద్రప్రభుత్వం ఆరుసూత్రాల పథకాన్ని ప్రకటించింది.

1977 లో కేంద్రంలో జనతాపార్టీ ప్రభుత్వం ఏర్పడగా రాష్ట్రంలో కాంగ్రెసు పరిపాలన ఉంది. అప్పుడు పౌరహక్కుల సంఘం వారు శ్రీ వి.ఎం. తార్కొండే అధ్యక్షతన దర్యాప్తుచేసి కేంద్రప్రభుత్వానికి ఒక నివేదిక సమర్పించినారు. రాష్ట్రంలో నక్సలైట్‌లను (సి.పి.ఎం.ఎల్) కొందిరిని సంఘర్షణల పేరిట పోలీసులు కాల్చి చంపివేసినారని, దీనిపై దర్యాప్తు జరపించవలెనని కోరినారు. కేంద్రప్రభుత్వం కోరికపై నాటి రాష్ట్రప్రభుత్వం ఈ విషయమై విచారణ జరపటానికి మాజీ న్యాయమూర్తి భార్గవాను కమిషన్‌గా నియమించింది. ఈ కమిషన్ విచారణ జరుపుతుండగా అటుకేంద్రంలోనూ, ఇటు రాష్ట్రంలోనూ ప్రభుత్వాలు మారినాయి. రాష్ట్రంలో డా॥ ఎం. చెన్నారెడ్డి నాయకత్వాన కాంగ్రెస్ (ఐ) పార్టీ అధికారంలోకి వచ్చింది. విచారణ రహస్యంగా జరపవలెనని రాష్ట్రప్రభుత్వం భార్గవా కమిషన్‌ను కోరింది. అందుకు కమిషన్ అంగీకరించినా, పౌరహక్కుల సంఘం పక్షాన న్యాయవాదులు ఒప్పుకోలేదు. ఈలోగా కమిషన్ కాలపరిమితి ముగిసింది. అంతకు ముందే విచారణ ఆపడంమంచిదని శ్రీ భార్గవా ప్రకటించినారు.(1978,జులై 2) కేంద్రంలో శ్రీ చరణ్‌సింగ్ నాయకత్వాన ఏర్పడిన ప్రభుత్వం శ్రీ భార్గవా కమిషన్‌ను కొనసాగించలేదు. ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు, అతని మంత్రివర్గ సహచరులు అధికార దుర్వినియోగం చేసినట్లు ఆరోపణలు చేస్తూ కొందరు శాసన సభ్యులు కేంద్రంలోని జనతా ప్రభుత్వానికి ఫిర్యాదు చేసినారు. కేంద్రప్రభుత్వం ఈ విషయాన్ని విచారించే నిమిత్తం మాజీ న్యాయమూర్తి విమద్‌లాల్‌ను విచారణ కమిషన్‌గా నియమించింది. ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు ఈ కమిషన్ ముందు సాక్ష్యం చెప్పినారు. విమద్‌లాల్ కమిషన్ 1978 మే 31 న తాత్కాలిక నివేదికను కేంద్రప్రభుత్వానికి సమర్పించింది. 1977 డిసెంబరు 26న రాష్ట్రంలో శ్రీ సంజయ్‌గాంధీకి ఇచ్చిన స్వాగతం, పరిపాలనా యుక్తమైన అనౌచిత్య చర్యల దృష్ట్యా కమిషన్ ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావును అభిశంసించింది. కమిషన్ చేసిన వ్యాఖ్యదృష్ట్యా అప్పుడు శాసనసభ్యుడుగా మాత్రమే ఉన్న శ్రీ వెంగళరావు 1977, జులై 22 న

తన శాసనసభా సభ్యత్వానికి రాజీనామా ఇచ్చినారు. కాని తుది నివేదిక 1978 డిసెంబరు 18 న ప్రకటించినప్పుడు శ్రీ వెంగళరావు పైన, ఆయన మంత్రివర్గ సహచరులపైన వచ్చిన ఆరోపణలు ఆధారరహితమైనవని కమిషన్ పేర్కొంది.

1978, డిసెంబరు 19న లోక్‌సభ అప్పటి మాజీ ప్రధాని ఇందిరాగాంధీకి జైలుశిక్ష విధిస్తూ తీర్మానం చేసింది. అంతేగాక ఆమెను లోక్‌సభ నుంచి బహిష్కరించింది. అప్పుడు కేంద్రంలో జనతా ప్రభుత్వం పరిపాలిస్తుండగా, రాష్ట్రంలో కాంగ్రెసు (ఐ) ప్రభుత్వం ఉంది. కేంద్ర చర్యకు నిరసన తెలియ జేస్తూ రాష్ట్రంలోని అధికార పక్షం బంద్‌లు, హర్తాళ్ళు జరిపింది. రాజకీయంగా భిన్న పార్టీలు కేంద్ర, రాష్ట్రాలలో ఉన్నప్పుడు ఇటువంటి విభేదాలు రావడం, ప్రజాజీవితంపై వాటి ప్రభావం కనిపించటం జరిగింది.

ఆర్థిక రంగంలో కూడా కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వాల మధ్య ఒకేపార్టీ ప్రభుత్వాలలో ఉన్నప్పుడూ, వేరువేరు పార్టీలు, ప్రభుత్వాలలో ఉన్నప్పుడూ ఇబ్బందులూ, చిక్కులూ వచ్చిన సందర్భాలు లేకపోలేదు. ఏడో ఫైనాన్స్ కమిషన్ సిఫారసుల ఫలితంగా ఆంధ్రప్రదేశ్ ఆదాయపుపన్ను వాటా 7.76 నుంచి 8.023 శాతానికి పెరిగింది. కాని ఎక్సయిజ్ డ్యూటీలలో 8.16 నుంచి 7.698 శాతానికి, అదనపు ఎక్సయిజ్ డ్యూటీలలో 8.39 నుంచి 5.245 శాతానికి తగ్గిపోయింది. రాష్ట్ర ప్రభుత్వం ఒక వాదన చేస్తూ ఎక్కువ వనరులను కేంద్రం పరిధినుంచి రాష్ట్రానికి మార్చవలెనని సూచన చేసింది. దీనికి శ్రీ జె.ఎన్. షలాత్ అధ్యక్షతన ఏర్పడిన 7వ ఫైనాన్స్ కమిషన్ అంగీకరించింది ప్రకృతి వైపరీత్యాల సందర్భంగా అందించవలసిన సహాయాన్ని గురించి రాష్ట్ర ప్రభుత్వం ఒక సూచన చేస్తూ, సాలీనా 8.58 కోట్లరూపాయలు బడ్జెట్‌లో ఇందు నిమిత్తం కేటాయించవలెనన్నారు. దీనికి కేంద్రం అంగీకరించింది.

ప్రాంతీయ తత్వంతోనూ, ప్రాంతీయ అవసరాల నిమిత్తం ఆందోళనలు జరిగినప్పుడు కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వాలలో ఒకేపార్టీ అధికారంలో ఉన్నప్పటికీ వాటిమధ్య సంబంధాలు అంత సామరస్యంగా ఉండవు. ఉదాహరణకు విశాఖ పట్టణంలో ఉక్కు ఫ్యాక్టరీ నిర్మించవలెనని రాష్ట్రవ్యాప్తంగా 1966-67 లో ఆందోళన జరిగింది. అప్పుడు శ్రీ బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రిగా రాష్ట్రంలో కాంగ్రెసు పార్టీ ప్రభుత్వంలో ఉన్నది. కేంద్రంలో కూడా కాంగ్రెసు పార్టీయే ప్రభుత్వంలో ఉంది. అంతేగాక ఈ రాష్ట్రం నుంచి ఎన్నికైన శ్రీ నీలం సంజీవరెడ్డి ఉక్కు పరిశ్రమల శాఖకు మంత్రిగా ఉన్నారు. అప్పుడు జరిగిన ఆందోళన ఫలితంగా శ్రీ నీలం సంజీవరెడ్డి కంచు విగ్రహాన్ని విజయవాడలో ఆందోళన కారులు పగులగొట్టి కాలువలో పడవేసినారు. ఆందోళన వెనక రాజకీయ కారణాలు ఎట్లా ఉన్నా, కేంద్రప్రభుత్వం ఉక్కు కర్మాగారాన్ని మంజూరు చేసింది. 1969 లో ప్రత్యేక తెలంగాణాకోసం, 1972 లో ప్రత్యేక ఆంధ్రకోసం ఆందోళన జరిగినప్పుడు రాష్ట్రంలోనూ, కేంద్రంలోనూ కాంగ్రెసు

పార్టీ అధికారంలో ఉంది. తెలంగాణా ఆందోళన ఫలితంగా ఎనిమిది సూత్రాల పథకం కేంద్రం రూపొందించింది. ఈ సూత్రాలలో ఆర్థిక, రాజకీయ సాంఘిక పరమైన పరిష్కార మార్గాలు ఉన్నాయి.

డా॥ చెన్నారెడ్డి 1978 లో ముఖ్యమంత్రి కాగానే రాష్ట్రప్రభుత్వ అనుమతిలేకుండా, కేంద్ర గూఢచారి శాఖవారు రాష్ట్రంలో ఎటువంటి సోదా చేయటానికి వీలులేదని నిర్ణయం తీసుకొన్నారు. అప్పుడు కేంద్రంలో జనతా పార్టీ ప్రభుత్వం ఉంది. దక్షిణాదిలో రాష్ట్రాల ముఖ్యమంత్రులు సమావేశమై, తమకు రావలసిన కేటాయింపు గురించి, కేంద్రం చేస్తున్న అన్యాయాల గురించి ప్రస్తావించినారు. ఈ విధంగా కేంద్ర-రాష్ట్ర సంబంధాలలో అనేక కారణాలవల్ల సామరస్యం దెబ్బతినటంకద్దు. రాష్ట్రాలకు ఎక్కువ అధికారాలు ఇవ్వవలెనని, ఎక్కువ డబ్బు కేటాయించవలెనని, రాష్ట్రప్రభుత్వాలు తరచు కోరుతున్నాయి.

వ్యవసాయ రంగంలో కూడా ధాన్యానికి గిట్టుబాటు ధర, మద్దతు ధరను ఇచ్చే విషయమై రాష్ట్రానికీ, కేంద్రానికీ అభిప్రాయ భేదాలు ఉన్నాయి. 1981 లో మన రాష్ట్రం ధాన్యానికి క్వింటాల్‌కు 150 రూపాయల ధరను నిర్ణయించడానికి అనుమతించ వలసిందిగా కేంద్రాన్ని కోరింది. కేంద్రం 115 రూపాయలు మాత్రమే అనుమతించింది.

# 2

# ఆంధ్రప్రదేశ్ అవతరణ

ఆంధ్రప్రదేశ్ తొలి భాషా రాష్ట్రంగా 1956, నవంబరు 1న రూపొందింది. అంతకు ముందు మద్రాసు నుంచి విడిపోయి ఆంధ్రగా 1953లో ఏర్పడిన ప్రాంతం, హైదరాబాదులోని తెలంగాణా ప్రాంతం కలిసి కొత్తరాష్ట్రంగా ఏర్పడింది. అత్యధిక సంఖ్యాకులు తెలుగు మాట్లాడేవారుగా ఉంటున్న ప్రాంతాన్ని ప్రాతిపదికగా స్వీకరించి రాష్ట్రాన్ని అవతరింపజేసినారు. ప్రత్యేక రాష్ట్రం కోసం ఆంధ్ర ప్రాంతంలో 1910 నుంచి ఆందోళన, 1913 నుంచి మహాసభల నిర్వహణ జరిగింది. అయితే, స్వాతంత్ర్యం వచ్చేవరకు ప్రత్యేక రాష్ట్రం ఏర్పడనేలేదు. స్వాతంత్ర్యానంతరం అన్నిపార్టీలవారూ, వివిధ ప్రాంతాలవారూ ప్రత్యేక ఆంధ్రకోసం పోరాటాన్ని తీవ్రతరంచేసినారు. వల్లభ్‌భాయిపటేల్, జవహర్‌లాల్ నెహ్రూ, పట్టాభిసీతారామయ్య భాషా రాష్ట్రాల ఏర్పాటుపై ఒక నివేదిక రూపొందించి సూత్రప్రాయంగా ఆంధ్ర రాష్ట్ర నిర్మాణాన్ని కూడా అంగీకరించినారు. 1951 లో గొల్లపూడి సీతారామశాస్త్రి 35 రోజులపాటు నిరాహారదీక్షపూని ప్రత్యేక రాష్ట్రవిషయమై అందరి దృష్టిని ఆకర్షించినాడు. 1952 లో పొట్టి శ్రీరాములు ప్రత్యేక ఆంధ్ర కావలెనని, మద్రాసు నగరం కూడా అందులో చేర్చవలెననీ, నిరాహార దీక్ష పూనినాడు. 58 రోజుల అనంతరం పొట్టిశ్రీరాములు మరణించినాడు. ఆంధ్రప్రాంతంలో హింసాకాండ చెలరేగింది. లోక్‌సభలో ప్రధాని జవహర్ లాల్‌నెహ్రూ ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం చేయటానికి అంగీకరించినట్లు ప్రకటించినారు. రాయలసీమలో కొందరు ప్రత్యేక ఆంధ్ర ఏర్పాటుపట్ల భయ సందేహాలు మొదటినుంచీ వ్యక్తపరుస్తూనే వచ్చినారు. ఇటువంటి సందేహాలకు తావులేకుండా చేసే నిమిత్తం మద్రాసులో కాశీనాథుని నాగేశ్వరరావుగారి ఇంట్లో నాయకులు సమావేశమై ఒక ఒడంబడిక చేసుకొన్నారు. 1938 లో జరిగిన ఈ ఒడంబడికను 'శ్రీ బాగ్ ఒడంబడిక' అంటారు. ('శ్రీబాగ్' నాగేశ్వర రావుగారి ఇంటికిగల పేరు.) ప్రాంతీయ అసమానతలు రాకుండా చూడటానికి ఈఒడంబడికను ఉద్దేశించినారు.

ఆంధ్రరాష్ట్రం 1953,అక్టోబరులో ఏర్పడింది.టంగుటూరి ప్రకాశంపంతులు గారు ముఖ్యమంత్రిగా, కర్నూలు, రాజధానిగా ప్రభుత్వం కొనసాగింది. మద్రాసునుంచి చీలివచ్చిన ఆంధ్రా హైకోర్టును గుంటూరులో ఏర్పరచినారు.

తెలంగాణా ప్రాంతంలో తెలుగుమాట్లాడేవారు ఒకటిగాఉండవలెననిఅభిప్రాయం ఆంధ్రమహాసభలలోనూ, గ్రంథాలయ సభలలోనూ 1930నుంచీ వ్యక్తమవుతూవచ్చింది. విశాలాంధ్రఏర్పరచాలని కమ్యూనిస్టులు తెలంగాణాలోబాగా ప్రచారంచేసినారు.ఆంధ్రప్రాంతంలో కలవకుండా, తెలంగాణా వేరుగా ఉండవలెనని ఒక అభిప్రాయం కొందరు నాయకులూ, ప్రముఖులూ వ్యక్తం చేసినారు. కేంద్రప్రభుత్వం ఫజల్ ఆలీ అధ్యక్షుడుగా ఏర్పరచిన సంఘం పర్యటించినపుడు భిన్న అభిప్రాయాలు వ్యక్తమయినాయి. మొత్తం మీద గమనిస్తే అత్యధిక సంఖ్యాకులు విశాలాంధ్ర నిర్మాణానికే మొగ్గు కనబరిచినారు. (హైదరాబాద్ రాష్ట్రాన్ని) భాషాప్రయుక్తంగా విభజించే విషయమై చేసిన సూచనలలో, విశాలాంధ్రను గురించి పై సంఘం ఇట్లా పేర్కొన్నది. హైదరాబాద్ రాష్ట్రాన్ని విభజించి, మరాఠీ, కన్నడం మాట్లాడే ప్రాంతాలను ఆయా రాష్ట్రాలలో చేర్చవలె. విశాలాంధ్ర ఏర్పరిస్తే శాశ్వత రాజధాని సమస్య పరిష్కారం అవుతుంది. హైదరాబాద్-సికిందరాబాద్ లలో రాజధాని ఏర్పరచవచ్చు. కృష్ణ, గోదావరి జిల్లాలను రాష్ట్రాభివృద్ధికివినియోగించుకోవచ్చు. ఆంధ్రప్రాంతంలో ఉన్న మిగులు ధాన్యాన్ని తెలంగాణాలో ఉన్న కొరతను తీర్చడంలో సర్దుబాటు చేయవచ్చు. ఆంధ్రప్రాంతానికి ఉన్న బొగ్గు కొరత సింగరేణి కాలరీస్ వల్ల తీరుతుంది. అయితే ప్రత్యేక తెలంగాణా రాష్ట్రవిషయాన్ని తేలికగా తోసిపుచ్చరాదు. తెలంగాణాతో పోల్చిచూస్తే ఆంధ్రలో తలసరి ఆదాయం తక్కువగా ఉంది. పరిపాలనారీత్యా అభ్యుదయ పంథాలో ఉన్న తెలంగాణా విశాల రాష్ట్రంలో అదనపుసౌకర్యాలను పొందలేకపోవచ్చు. ప్రణాళికలో కూడా తెలంగాణాకు తగినంత శ్రద్ధ చూపరేమో అని కొందరు ఆందోళన వ్యక్తపరచినారు. విద్యారంగంలో వెనకబడిన తెలంగాణావారు దోపిడికి గురికావచ్చునని కూడా నాయకులు భయపడినారు. ఆంధ్రా, తెలంగాణా కలయికలో తెలంగాణా వలసగా మారే అవకాశం ఉందని వారు భావించినారు. విశాలాంధ్ర నిర్మాణాన్ని లక్ష్యంగా పెట్టుకోవలెనని కమిషన్ సూచిస్తూ, 1961 ప్రాంతంలో, తెలంగాణా శాసనసభలోని సభ్యుల్లో మూడింట రెండు వంతుల మంది ఐక్యతను కోరితే అప్పుడు విశాలాంధ్ర ఏర్పరచవచ్చునని సూచించినారు. ప్రాంతంలోని వ్యతిరేకతను ఫజల్ ఆలీ సంఘం గమనించి అందుకు తగినట్లు కొన్ని సూచనలు చేసింది.

విశాలాంధ్ర ఏర్పరచడానికి కేంద్రప్రభుత్వం నిశ్చయించింది. ఆంధ్ర-తెలంగాణా శాసనసభా సభ్యులలో అత్యధిక బలంగల కాంగ్రెసు పార్టీ నాయకుడు ఎన్నిక కర్నూలులో జరిగింది. శ్రీయుతులు నీలం సంజీవరెడ్డి, బెజవాడ గోపాలరెడ్డిమధ్యజరిగిన నాయకత్వపోటీలో సంజీవరెడ్డికి బలంలభించింది. ఆయన ఆంధ్రప్రదేశ్‌కు తొలి ముఖ్యమంత్రి అయినాడు. రాష్ట్రానికి రాజధానిగా హైదరాబాద్‌ను నిశ్చయించినారు. గుంటూరులో ఉన్న హైకోర్టును, హైదరాబాదులో ఉన్న హైకోర్టును కలిపి ఒకే హైకోర్టుగా హైదరాబాదులో ఏర్పర

చినారు. తెలంగాణా ప్రాంతంలో ఉన్న భయాందోళనను తొలగించే నిమిత్తం ఉభయప్రాంతాల నాయకులు ఒక ఒప్పందాన్ని కుదుర్చుకొన్నారు. ఈ ఒప్పందం ప్రకారం పరిపాలన సాగితే ప్రాంతీయ అసమానతలు తొలుగుతాయని భావించినారు. ఒప్పందంపై సంతకాలు చేసినవారు : శ్రీయుతులు బెజవాడ గోపాలరెడ్డి, నీలం సంజీవరెడ్డి, గౌతులచ్చన్న, అల్లూరి సత్యనారాయణరాజు, బూర్గుల రామకృష్ణారావు, కొండా వెంకటరంగారెడ్డి, డా॥మర్రి చెన్నారెడ్డి, జె. వి. నరసింగరావు. 1956 ఫిబ్రవరి 26న ఈ పెద్దమనుషుల సంతకాలు జరిగినాయి.

## పెద్దమనుషుల ఒప్పందం

1. రాష్ట్రానికి సంబంధించిన కేంద్ర, సాధారణ పరిపాలనా వ్యయం ఆంధ్ర తెలంగాణా జనాభా నిష్పత్తి ప్రకారం భరించవలె. తెలంగాణాలో మిగులు ఆ ప్రాంతపు అభివృద్ధికి కేటాయించవలె. అయిదేళ్ళదాకా ఈ ఏర్పాటు ఉండవలె. అటు తరవాత తెలంగాణా శాసన సభ్యులు కోరిన పక్షంలో మరో అయిదేళ్ళు పొడిగించవచ్చు.

2. శాసన సభలో తెలంగాణా సభ్యులు ఏవిధంగా నిర్ణయిస్తే ఆవిధంగా మద్య నిషేధం అమలు జరపవలె.

3. తెలంగాణాలో ఉన్న విద్యాసౌకర్యాలు తెలంగాణా వారికే లభింపజేసి, ఇంకా అభివృద్ధి పరచవలె. లేకపోతే మొత్తం రాష్ట్రంలో, సాంకేతిక విద్యతోసహా, అన్ని విద్యాలయాలలోనూ మూడోవంతు తెలంగాణా విద్యార్థులకు కేటాయించవలె.

4. ఏకీకరణం కారణంగా కొన్ని ఉద్యోగాలు తగ్గించవలసివస్తే నిష్పత్తి ప్రకారం జరగవలె.

5. ముందు రాబోయే ఉద్యోగాలు, ఉభయ ప్రాంతాల జనాభా ప్రాతిపదిక మీద ఉండవలె.

6. అయిదేళ్ళపాటు, తెలంగాణాలో ఉంటున్న పరిపాలనా, న్యాయ శాఖలో ఉర్దూభాషకుగల స్థానం కొనసాగవలె. తరవాత ప్రాంతీయమండలి ఈ అంశం సమీక్షించి సవరించవచ్చు. ఉద్యోగాలలో చేర్చుకొనేముందు తెలుగు వచ్చితీరవలె అన్న నిబంధన ఉండరాదు. చేరిన రెండేళ్ళలోగా తెలుగు నేర్చుకోవలెనని నియమం ఉండవచ్చు.

7. తెలంగాణాలో నిష్పత్తి ప్రకారం నిర్ణయించిన ఉద్యోగాలలో ప్రవేశించడానికి అభ్యర్థులకు ఆ ప్రాంతంలో 12 సంవత్సరాల నివాసం ఉండవలె.

8. తెలంగాణా ప్రాంతంలో వ్యవసాయ భూముల అమ్మకం ప్రాంతీయ మండలి అధీనంలో ఉండవలె.

9. తెలంగాణా సర్వతోముఖాభివృద్ధి సాధించడానికి ఒక ప్రాంతీయ మండలి ఉండవలె.

10. ప్రాంతీయ మండలిలో 21 మంది సభ్యులు ఉండవలె. తెలంగాణా తొమ్మిది జిల్లాలకి ప్రతినిధులుగా తొమ్మండుగురు శాసనసభ్యులను శాసనసభ ఎన్నుకోవలె. శాసనసభలో తెలంగాణా సభ్యులు పార్లమెంటునుంచిగానీ శాసన సభనుంచిగాని ఆరుగుర్ని ఎన్నుకోవలె. శాసనసభ్యులు కాని అయిదుగుర్నికూడా శాసనసభ తెలంగాణా సభ్యులు ఎన్నుకోవలె. తెలంగాణా ప్రాంతపు మంత్రులందరూ ప్రాంతీయమండలి సభ్యులుగా ఉండవలె. ముఖ్యమంత్రిగాని, ఉపముఖ్యమంత్రిగాని ఎవరు తెలంగాణావారైతే వారు ప్రాంతీయమండలి అధ్యక్షులుగా ఉంటారు. ఇతర కేబినెట్ మంత్రులనుకూడా ప్రాంతీయమండలి సమావేశానికి ఆహ్వానించవచ్చు.

11. ప్రాంతీయమండలి చట్టబద్ధమైన సంస్థగా ఉంటుంది. ప్రణాళికా రచన, అభివృద్ధి వ్యవహారాలు, నీటి పారుదల, ఇతర వ్యవసాయ పథకాలు, పారిశ్రామికాభివృద్ధి, తెలంగాణా ఉద్యోగాలు, ప్రాంతీయమండలి పరిశీలించి నిర్ణయాలు తీసుకొంటుంది. రాష్ట్రప్రభుత్వానికీ మండలికీ మధ్య అభిప్రాయ భేదం వచ్చిన పరిస్థితిలో అంతిమ నిర్ణయంకోసం భారత ప్రభుత్వానికి నివేదించవలె.

ఈ ఏర్పాటు మధ్యలో మరో ఒప్పందం లేని పక్షాన, పది సంవత్సరాల తరవాత పునఃసమీక్ష చేయడం జరుగుతుంది

12. మంత్రివర్గంలో ఆంధ్రప్రాంతంనుంచి 60 శాతం, తెలంగాణా ప్రాంతంనుంచి 40 శాతం ఉండవలె. తెలంగాణా భాగంలో ఒక ముస్లింకూడా ఉండవలె.

13. ముఖ్యమంత్రి ఆంధ్ర ప్రాంతంవాడయితే ఉపముఖ్యమంత్రి తెలంగాణావ్యక్తి అయి ఉండవలె. ముఖ్యమంత్రి తెలంగాణా మనిషి అయితే ఉపముఖ్యమంత్రి ఆంధ్రప్రాంతం వాడుగా ఉండవలె. హోం, ఫైనాన్స్, రెవిన్యూ ప్లానింగ్, డెవలప్‌మెంటు, వాణిజ్య, పరిశ్రమల శాఖలలో కనీసం రెండయినా తెలంగాణావారికి ఇవ్వవలె.

14. 1972 సంవత్సరాంతంవరకు తెలంగాణాకు ప్రత్యేకంగా ప్రదేశ్ కాంగ్రెస్ సంఘం ఉండవలెనని హైదరాబాద్ ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు కోరుతున్నాడు. దీనికి ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడికి అభ్యంతరం లేదు.

ఈ ఒప్పందంతో ఆంధ్రప్రదేశ్ అవతరణకు నాయకులు అంగీకరించినారు. ఆవిధంగా తెలుగు మాట్లాడే వారందరూ ఒక రాష్ట్రంలో ఉండడానికి, ఒకే పాలన సౌలభ్యం ఏర్పరచుకోడానికి వీలైంది.

# 3

# గవర్నరు - పాలకవర్గము - మంత్రి మండలులు

రాజ్యాంగరీత్యా రాష్ట్రాలకు పాలనాధికారులు గవర్నర్లు మాత్రమే. గవర్నరు మంత్రిమండలి సలహానుసరించి వ్యవహరిస్తాడు. రాష్ట్రంలోని ప్రతి చర్యకూడా గవర్నర్ పేరిట నిర్వహిస్తారు. ఇతని జీతభత్యాలన్నీ పార్లమెంట్ చట్టరీత్యా నిర్ణయిస్తుంది. గవర్నరుకు న్యాయరీత్యా పాలనా సంబంధమైన శాసన బద్ధమైన అధికారాలు ఉన్నాయి. మంత్రిమండలిని, అడ్వకేట్ జనరల్‌ను రాష్ట్ర పబ్లిక్ సర్వీస్ కమిషన్ సభ్యులను గవర్నర్ నియమిస్తాడు. హైకోర్టు జడ్జిల నియామకం విషయమై రాష్ట్రపతితో గవర్నర్ సంప్రదించవచ్చు. శాసన సభలో ఆంగ్లో-ఇండియన్ ప్రతినిధి ఒకరిని, శాసన మండలిలో కొందరు సభ్యులను గవర్నర్ నియమించవచ్చు. శాసన సభలను సమావేశపరచడం, ప్రోరోగ్ చేయడం, సందేశాలు పంపడం గవర్నర్ అధికారాలలోనివే. రాష్ట్రంలో నేరస్తులను క్షమించడానికి, శిక్ష తగ్గించడానికి, విడుదలచేయడానికి గవర్నర్‌కు అర్హత ఉంది. గవర్నర్ స్వతంత్రుడా లేక, కేవలం రాష్ట్రపతి ప్రతినిధి మాత్రమేనా అనే విషయమై వివాదం ఉంది. అట్లాగే గవర్నర్ పదవి కేవలం నామమాత్రమే కాబట్టి దానిని రద్దు చేయవలెనసే వాదనకూడాఉంది.

రాష్ట్ర గవర్నర్‌ను రాష్ట్రపతి నియమిస్తాడు. కేంద్రప్రభుత్వ సలహాపై ఈ నియామకం జరుగుతుంది. 35 సంవత్సరాల వయస్సున్న భారత పౌరుడు గవర్నర్‌గా నియమించడానికి అర్హుడు. పార్లమెంట్‌లోగాని, శాసనసభలోగాని అతడు సభ్యుడుగా ఉండరాదు. లాభాలు ఆర్జించే వ్యాపారం ఏదీ చేయరాదు. గవర్నరు రాష్ట్రంలోని పరిస్థితిని ఎప్పటికప్పుడు కేంద్రానికి నివేదిస్తూ ఉంటాడు. రాజ్యాంగ పరంగా, రాష్ట్రానికి అధిపతి అయిన గవర్నర్ పేరిట పరిపాలనా వ్యవహారాలన్నీ సాగుతుంటాయి. శాసన సభలో అత్యధిక సంఖ్యా బలంగల నాయకుడిని, సర్వసాధారణంగా, ముఖ్యమంత్రిగా గవర్నర్ నియమిస్తాడు ముఖ్యమంత్రి సలహాపై ఇతర మంత్రులను నియమించి వారికి ఆయాశాఖలను కేటాయిస్తారు. ఎడ్వకేట్ జనరల్, పబ్లిక్ సర్వీసు కమిషన్ ఛైర్మన్, సభ్యులను గవర్నర్ నియమిస్తాడు. మంత్రి మండలి సలహాపై ఇటువంటి నియామకం చేస్తుంటారు. శాసన సభనుద్దేశించి గవర్నర్ ప్రసంగించవచ్చు. శాసన సభను సమావేశ పరచడం ప్రోరోగ్ చేయడం రద్దు గావించటం గవర్నర్ అధికారాలలో ఉన్నాయి. శాసన సభ సమావేశంలో లేనప్పుడు ఆర్డినెన్సులు

జారీ చేయవచ్చు, అయితే శాసన సభ దీనిని ఆమోదించవలసి ఉంటుంది. శాసన సభ ఆమోదించిన బిల్లును గవర్నరు ఆమోదిస్తేనే అది చట్టం అవుతుంది. ఆమో దించ కుండా మరొకసారి పరిశీలించ వలసిందిగా ఆదేశిస్తూ శాసనసభకు తిరిగి పం పవచ్చు కూడా. శాసనసభ రెండో పర్యాయం కూడా బిల్లును ఆమోదించి పం పిస్తే గవర్నర్ సంతకం పెట్టవలసిందే. గవర్నర్‌కు శాసన పరంగానూ, ఆర్థిక పాలనా సంబంధమైన, న్యాయ సంబంధమైన అధికారాలు ఉన్నాయి, దైనందిన పరిపాలనలో గవర్నరు జోక్యం చేసుకోడు. శాసన సభను రద్దు చేసినప్పుడు, మంత్రి మండలి లేనప్పుడు మాత్రమే గవర్నరు తన అధికారాలను విని యోగిస్తాడు. ఉరిశిక్షను తగ్గించటం, రద్దుచేయటం, వదలివేయటం అట్లాగే శిక్షను తగ్గించటం గవర్నరు చేయవచ్చు. ముఖ్యమంత్రినుంచి ఎటువంటి సమాచారాన్ని అయినా గవర్నర్ కోరవచ్చు. ఏవిషయాన్నిఅయినా పరిశీలించవలసిందిగా మంత్రి మండలికి గవర్నర్ సూచించవచ్చు, గవర్నర్ పదవీకాలం 5సంవత్సరాలపాటు ఉంటుంది. గవర్నర్ లేనప్పుడు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి ఆక్టింగ్ గవర్నర్‌గా ఉంటాడు.

ఆంధ్రప్రదేశ్‌లో రాష్ట్రపతి తన అధికారాలను వినియోగించ వలసిన సమయం ఇప్పటి వరకూ ఒకే ఒకసారి వచ్చింది. ప్రత్యేక ఆంధ్ర కోసం ఆందోళన జరిగిన సందర్భంగా శ్రీ పి.వి నరసింహారావు మంత్రి వర్గాన్ని రద్దు కావించి 1973 లో రాష్ట్రపతి పాలన ప్రవేశ పెట్టినారు. అప్పుడు ఖండూ భాయ్ దేశాయి గవర్నర్‌గానూ సరీన్ ఆయనకు ప్రత్యేక సలహా దారుగానూ ఉన్నారు. ఒక సంవత్సరం పాటు రాష్ట్రపతి పాలన సాగిన తరవాత తిరిగి శ్రీ వెంగళ రావు మంత్రి వర్గం ఏర్పడింది. 1977 ఫిబ్రవరిలో అప్పటి గవర్నర్ శ్రీ ఆర్.డి. భండారే ఎన్నికలలో పోటి చేసేనిమిత్తం రాజీనామా చేసి వెళ్ళిపోగా హై కోర్టు ప్రధాన న్యాయమూర్తి బి. జె. దివాన్ ఆక్టింగ్ గవర్నర్‌గా 16-2-1977 నుంచి 4-5-1977 వరకూ ఉన్నారు. తరవాత శ్రీమతి శారదాము ఖర్జీ గవర్నర్‌గా నియమితులైనారు, లోగడ 1975 లో ఖండూభాయ్ దేశాయ్ రాజీనామా చేసినప్పుడు నాటి హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి ఎస్. ఓబుల్ రెడ్డి ఆక్టింగ్ గవర్నర్‌గా ఉన్నారు. ప్రస్తుతం గవర్నర్‌గా ఉన్న శ్రీ కె. సి. అబ్రహాం 14-8-1978 న నియమితులైనారు.

పాలనానిర్వహణలో ముఖ్యమంత్రి, మంత్రి మండలి రాష్ట్రంలో ప్రధాన పాత్ర వహిస్తారు. రాష్ట్ర స్థాయిలో మంత్రి మండలి తీసుకొన్న నిర్ణయాలను అమలు పరచటానికి అధికార బృందం ఉంటుంది. ప్రతి శాఖకు ఒక మంత్రి కొన్ని సందర్భాలలోసహాయమంత్రికూడా ఉంటారు. వారికిసహాయంగా కార్య దర్శి అదనపు కార్యదర్శి సంయుక్తకార్యదర్శి, డెప్యూటీకార్యదర్శి, సహాయ కార్యదర్శి ఇంకా ఉద్యోగి బృందం ఉంటుంది. స్థూలంగా రాష్ట్ర స్థాయిలో పరిపాలనా శాఖలు, ఆయా శాఖలకు సంబంధించిన మంత్రులు, ఇతర శాఖల ఫైళ్ళను తెప్పించి చూడవచ్చు. వాటిపై తమ అభిప్రాయాలు వ్రాయవచ్చు.

ఒక మంత్రి నిర్ణయానికి మంత్రి మండలి యావత్తూ బాధ్యత వహిస్తుంది. కనక దీనిని సమష్టి నిర్ణయం అంటారు. సర్వ సాధారణంగా ఫైళ్ళను మంత్రిచూసిన తరవాత అవసరమైతే ఆర్థిక మంత్రికి పంపిస్తారు. తరవాత ముఖ్యమంత్రి, గవర్నర్ చూస్తారు. ఏ విషయం లోనైనా నిబంధనకు వ్యతిరేకంగా మంత్రి నిర్ణయాలను తీసుకొంటూంటే, కార్యదర్శి ఆ విషయాన్ని మంత్రి దృష్టికి తీసుకొనిరావచ్చు. ఆయాశాఖలలో బిల్లురూపేణ తీసుకొని రావలసిన విషయాలను కార్యదర్శి సిద్ధంచేసి మంత్రికి సమర్పిస్తుంటాడు. మంత్రిమండలి తీసుకొనే నిర్ణయాలు అమలుపరచటం ఉద్యోగవర్గాల బాధ్యత. ప్రస్తుతం రాష్ట్రప్రధాన కార్యదర్శిగా శ్రీ బి. యన్. రామన్ ఉన్నారు.

## మంత్రి మండలులు

ఆంధ్రప్రదేశ్ ఏర్పడినప్పుడు శ్రీ నీలం సంజీవరెడ్డి నాయకత్వాన ప్రథమ మంత్రివర్గం రూపొందింది. శాసనసభలో అత్యధిక సంఖ్యాకులుగా ఉన్న కాంగ్రెసు పార్టీ సభ్యులు శ్రీ ఎన్. సంజీవరెడ్డిని నాయకుడుగా ఎన్నుకొన్నారు. ఆయన పై పోటీ చేసిన శ్రీ బెజవాడ గోపాలరెడ్డికి తగిన బలం లేదని నిర్ధారణ అయింది.

రాష్ట్రంలో ముఖ్యమంత్రి కీలకమైన స్థానాన్ని ఆక్రమించటమేగాక, రాజకీయ అధికారాన్ని పొంది ఉంటాడు. కనక అధికార రాజకీయ చట్రంలో ముఖ్యమంత్రి స్థానానికి చాలా ప్రాధాన్యత ఉంది. ముఖ్యమంత్రి సలహానను సరించి రాష్ట్రగవర్నర్ మంత్రులను నియమిస్తాడు. శ్రీ సంజీవరెడ్డి తన తొలి మంత్రివర్గాన్ని చాలా తక్కువ మంది సభ్యులతో ఏర్పరచినారు.

1. ముఖ్యమంత్రి (1-11-56 నుండి 16-4-1957 వరకు)
   శ్రీ నీలం సంజీవరెడ్డి సాధారణ పరిపాలన, సమాచారశాఖ, ప్రణాళిక, రవాణ
2. శ్రీ కె. వి. రంగారెడ్డి : భూమిశిస్తు
3. శ్రీ కళావెంకటరావు ఆర్థికశాఖ, భూసంస్కరణలు
4. శ్రీ బి. గోపాలరెడ్డి హోమ్
5. శ్రీ వి.బి. రాజు వాణిజ్యం, పరిశ్రమలు, లేబర్
6. శ్రీ పి. తిమ్మారెడ్డి వ్యవసాయం, అటవీశాఖ
7. శ్రీ జి. వెంకటరెడ్డినాయుడు న్యాయశాఖ
8. శ్రీ జె.వి. నరసింగ్‌రావు విద్యుత్‌శాఖ, నీటిపారుదల
9. శ్రీ యస్.బి.పి. పట్టాభి రామారావు విద్యాశాఖ
10. శ్రీ డి. సంజీవయ్య సహకారశాఖ

11. శ్రీ యమ్. నరసింగరావు భవనాలు, రహదారులు
ఎక్సయిజు, మద్యనిషేధం

12. శ్రీ మెహ్దీనవాజ్ జంగ్ ఆరోగ్యశాఖ

13. శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి స్థానిక పరిపాలన

1957 లో తెలంగాణా ప్రాంతంలో శాసనసభకు ఎన్నికలు జరిగినాయి. అంత క్రితం ఆంధ్రప్రాంతంలో శాసనసభకు మధ్యంతర ఎన్నికలు జరగటం వల్ల (1955) దేశవ్యాప్తంగా జరిగిన రెండవ సాధారణ ఎన్నికలలో ఆంధ్ర ప్రాంతం పాల్గొనలేదు. ఎన్నికల అనంతరం కాంగ్రెసు పార్టీకి అత్యధిక సంఖ్యాబలం లభించటమేగాక శ్రీ నీలం సంజీవరెడ్డిని తిరిగి నాయకుడుగా ఎన్నుకొన్నారు. మంత్రివర్గంలో కొన్ని మార్పులు చేస్తూ శ్రీ సంజీవరెడ్డి పరిపాలన కొనసాగించినారు.

## 2. ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి :

| | |
|---|---|
| 1. శ్రీ నీలం సంజీవరెడ్డి (17-4-1957 నుండి 10-1-1960 వరకు) | సాధారణ పరిపాలన పరిశ్రమలు, వాణిజ్యం, ఆరోగ్యం, సమాచారం, రవాణా |
| 2. శ్రీ కె.వి. రంగారెడ్డి | హోమ్ |
| 3. శ్రీ బి. గోపాలరెడ్డి | ఆర్థికశాఖ, పదవీ విరమణ 2-4-1958 |
| 4. శ్రీ కళావెంకటరావు | రెవిన్యూ, భూసంస్కరణలు (చనిపోయినారు 28-3-1959) |
| 5. " జె.వి. నరసింగరావు | నీటిపారుదల, విద్యుత్‌శాఖ |
| 6. " పి. తిమ్మారెడ్డి | వ్యవసాయం, అటవీశాఖ |
| 7. " వి.బి. రాజు | ప్లానింగ్, పబ్లిక్‌వర్క్స (పదవీ విరమణ 6-3-1959) |
| 8. " యస్. బి. పి. పట్టాభిరామారావు | విద్యాశాఖ |
| 9. " యమ్. నరసింగరావు | భవనాలు, రహదారులు |
| 10. " కె. బ్రహ్మానందరెడ్డి | స్థానిక పరిపాలన |
| 11. " డి. సంజీవయ్య | సాంఘిక సంక్షేమం, లేబర్ |
| 12. " జి. వెంకటరెడ్డినాయుడు | న్యాయశాఖ |
| 13. " మెహ్దీనవాజ్ జంగ్ | సహకారశాఖ |
| 14. " ఎ. భగవంతరావు | దేవాదాయ, ధర్మాదాయశాఖ, చిన్నతరహా, కుటీరపరిశ్రమలు (1958 లో నియమింప బడినారు.) |

## 3 వ మంత్రిమండలి

### *సంజీవయ్యా మంత్రి వర్గం*

1960 లో అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షపదవిని చేపట్టిన శ్రీ సంజీవరెడ్డి ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేసినారు. కాంగ్రెసుపార్టీలో శాసనసభా పక్షాన మధ్యవర్తి అభ్యర్థిగా శ్రీ దామోదరం సంజీవయ్యాను నిర్ణయించి ఎన్నుకొన్నారు. ఆయన మంత్రివర్గాన్ని ఏర్పరిచి 1962 సాధారణ ఎన్నికలయ్యే వరకూ కొనసాగినారు. 14 మంది సభ్యులతో కూడిన ఈ మంత్రిమండలిలో శ్రీ కొండా వెంకటరంగారెడ్డి ఉపముఖ్యమంత్రిగా ఉన్నారు. 1956 లో జరిగిన పెద్దమనుషుల ఒప్పందాన్ననుసరించి ఉపముఖ్యమంత్రి పదవి ఏర్పరచినారు.

ముఖ్యమంత్రి శ్రీ డి. సంజీవయ్యా (11-1-1960 నుంచి 11-3-1962 వరకు)

ఉపముఖ్యమంత్రి శ్రీ కె.వి. రంగారెడ్డి

| | |
|---|---|
| 1. శ్రీ డి. సంజీవయ్యా | సాధారణ పరిపాలన |
| 2. " కె.వి రంగారెడ్డి | రెవెన్యూ, (పదవీ విరమణ 1-3-1962) |
| 3. " అల్లూరి సత్యనారాయణ రాజు (ఎం.ఎల్.సి) | పబ్లిక్ వర్క్స్ |
| 4. " యస్.బి.పి. పట్టాభి రామారావు | విద్యాశాఖ, రవాణా |
| 5. " పిడతల రంగారెడ్డి | ప్లానింగ్, స్థానిక పరిపాలన సమాచారశాఖ (పదవీ విరమణ 1-3-1962) |
| 6. " కల్లూరి చంద్రమౌళి | దేవాదాయ, ధర్మాదాయశాఖ, సహకారశాఖ |
| 7. " కె. బ్రహ్మానందరెడ్డి | ఆర్థికశాఖ, న్యాయశాఖ |
| 8. " యం. నరసింగరావు | హోమ్ |
| 9. " యం. పళ్ళంరాజు | అటవీశాఖ, పశుసంవర్ధక శాఖ, చేపలపరిశ్రమ పదవీవిరమణ (2-3-1961) |
| 10. " ఎ.సి. సుబ్బారెడ్డి | పరిశ్రమలు, పురపాలకశాఖ (పదవీ విరమణ 31-5 1960) |
| 11. " పి.వి.జి. రాజు | ఆరోగ్యశాఖ |
| 12. శ్రీమతి మాసూమాబేగం | సాంఘిక సంక్షేమం, వక్ఫ్స్ (పదవీ విరమణ 1-3-1962) |
| 13. శ్రీ ఎన్. రామచంద్రారెడ్డి | వ్యవసాయం, ఆహారం, లేబర్ |

| | | |
|---|---|---|
| 14. " | కొండా లక్ష్మణ్ బాపూజీ | చిన్నతరహా పరిశ్రమలు. ఎక్సయిజ్ (పదవీ విరమణ 1-3-1962) |

## 4 వ మంత్రి మండలి

1962 లో జరిగిన సాధారణ ఎన్నికల అనంతరం శ్రీ నీలం సంజీవరెడ్డి శాసనసభలో కాంగ్రెసు పార్టీ నాయకుడుగా ఎన్నికైనారు. అత్యధిక సంఖ్యా బలంగల ఈ పార్టీ పక్షాన శ్రీ సంజీవరెడ్డి ముఖ్యమంత్రి అయినారు. అయితే ఆయన ఐదేళ్ళ కాలపరిమితి పూర్తికాకముందే రాజీనామా ఇవ్వవలసి వచ్చింది. 1964 లో సుప్రీంకోర్టు ఒక తీర్పు ఇస్తూ రాష్ట్రంలో బస్సుల జాతీయకరణ, ఒక నిర్ణీత పద్ధతిలో నిపుణుల సంఘం సూచనలమేరకు చేయలేదని, కర్నూలు జిల్లాలో బస్సుల జాతీయకరణ చేయటం సరికాదని తీర్పు చెప్పింది. ఈ తీర్పును బట్టి ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డిరాజీనామా చేసినారు.

ముఖ్యమంత్రి శ్రీ ఎన్. సంజీవరెడ్డి (12-3-1962 నుండి 28-2-1964 వరకు)

| | | |
|---|---|---|
| 1. | శ్రీ ఎన్. సంజీవరెడ్డి | సాధారణ పరిపాలన, హోమ్, సాంఘిక సంక్షేమం, భారీపరిశ్రమలు |
| 2. " | ఎన్. రామచంద్రారెడ్డి | రెవెన్యూ, భూసంస్కరణలు |
| 3. " | కె. బ్రహ్మానందరెడ్డి | ఆర్థికశాఖ, సహకారం |
| 4. " | ఎం. పళ్ళంరాజు | అటవీశాఖ, పశుసంవర్ధకశాఖ (చనిపోయారు 23-8-1962) |
| 5 " | డా॥ ఎం. చెన్నారెడ్డి | ప్లానింగ్, పంచాయత్‌రాజ్ |
| 6. " | పి.వి.జి. రాజు | విద్యాశాఖ |
| 7. " | ఎ.సి. సుబ్బారెడ్డి | నీటిపారుదల, విద్యుత్‌శాఖ |
| 8 " | మీర్. అహ్మద్ అలీఖాన్ | భవనాలు, కమ్యూనికేషన్స్, వక్ఫ్స |
| 9. " | వై. శివరామప్రసాద్ | ఆరోగ్యశాఖ |
| 10. " | డా॥ ఎం.ఎన్. లక్ష్మి నర్సయ్య | చిన్నతరహా పరిశ్రమలు |

*సహాయమంత్రులు*

| | | |
|---|---|---|
| 1. | శ్రీ ఎం.ఆర్. అప్పారావు | ఎక్సయిజ్, మద్యనిషేధం |
| 2. " | పి.వి. నరసింహారావు | న్యాయశాఖ, సమాచారశాఖ |
| 3. " | ఆలపాటి వెంకట రామయ్య | పురపాలకశాఖ |

4. శ్రీమతి టి.ఎన్. సదాలక్ష్మి దేవాదాయ, ధర్మాదాయశాఖ, చిన్నతరహా పొదుపు
5. శ్రీ ఎ. బలరామరెడ్డి వ్యవసాయం
6. " బి.వి. గురుమూర్తి లేబర్, రవాణా

## 5 వ మంత్రిమండలి

శ్రీ నీలం సంజీవరెడ్డి రాజీనామా చేయగా, కాంగ్రెసు శాసనసభాపక్షం శ్రీ కాసుబ్రహ్మానందరెడ్డిని నాయకుడుగా ఎన్నుకొన్నది. మార్పులు లేకుండా మొదట శ్రీ సంజీవరెడ్డి మంత్రివర్గ సభ్యులను స్వీకరించిన శ్రీ బ్రహ్మానందరెడ్డి క్రమేణా మార్పులు చేసుకొంటూ పోయినారు. శ్రీ బ్రహ్మానందరెడ్డి నాయకత్వాన్ని ప్రారంభదశలో శ్రీ నీలం సంజీవరెడ్డి బలపరిచినారు. తరవాత 1971 వరకూ శ్రీ బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రిగా కొనసాగినారు.

ముఖ్యమంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి (29-2-1964 నుండి 6-3-1967 వరకు)

1. శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి సాధారణ పరిపాలన, ఆర్థికశాఖ
2. " ఎన్. రామచంద్రారెడ్డి రెవిన్యూ
3. " డా॥ ఎం. చెన్నారెడ్డి ప్లానింగ్, పంచాయతీరాజ్
4. " పి.వి.జి. రాజు విద్యాశాఖ
5. " ఎ.సి. సుబ్బారెడ్డి పబ్లిక్‌వర్క్స్
6. " మీర్ అహమద్ అలీఖాన్ హోమ్
7. " వై. శివరామప్రసాద్ ఆరోగ్యశాఖ
8. " ఎం.ఎన్. లక్ష్మీనరసయ్య పరిశ్రమలు

*సహాయమంత్రులు*

1. శ్రీ ఎం.ఆర్. అప్పారావు ఎక్సైజ్, మద్యనిషేధం
2. " పి.వి. నరసింహారావు న్యాయశాఖ, జైళ్ళు
3. " ఆలపాటి వెంకట్రామయ్య పురపాలకశాఖ
4. శ్రీమతి టి.ఎన్. సదాలక్ష్మి దేవాదాయ, ధర్మాదాయశాఖ చిన్నతరహా పొదుపు (పదవీ విరమణ 24-2-1967)
5. శ్రీ ఎ. బలరామరెడ్డి వ్యవసాయం (పదవీ విరమణ-26-2-1967)
6. " బి.వి. గురుమూర్తి లేబర్, రవాణా

## VI వ మంత్రిమండలి

ముఖ్యమంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి (6-2-1967 నుంచి 18-7-1969 వరకు)

1. శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి — సాధారణ పరిపాలన, ప్లానింగ్, భారీపరిశ్రమలు
2. శ్రీ పి. తిమ్మారెడ్డి — వ్యవసాయం, పశుసంవర్ధకశాఖ
3. శ్రీ వి.బి. రాజు — రెవిన్యూ. (పదవీ విరమణ 28-6-69)
4. శ్రీ తోట రామస్వామి (ఎం.ఎల్.సి) — పంచాయతీరాజ్
5. శ్రీ జె.వి. నరసింగరావు — భవనాలు, రహదార్లు
6. శ్రీ టి.వి. రాఘవులు — ఎక్సైజ్, మద్యనిషేధం, విద్య
7. శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ — లేబర్, సమాచారశాఖ (పదవీ విరమణ 29-3-69)
8 శ్రీ డా॥ ఎం. చెన్నారెడ్డి — ఆర్థికశాఖ (పదవీవిరమణ 13-3-1967)
9. శ్రీ ఎ.సి. సుబ్బారెడ్డి — హోమ్, వాణిజ్యపన్నులు (నియమింపబడినతేది 4-4-1967)

### సహాయమంత్రులు

1. శ్రీ పి.వి. నరసింహారావు — న్యాయశాఖ, జైళ్ళు దేవాదాయ, ధర్మాదాయశాఖ (పదవీ విరమణ 28-6-69)
2. శ్రీ బి.వి. గురుమూర్తి — పరిశ్రమలు (పదవీ విరమణ 27-6-69)
3. శ్రీ ఎన్. చెంచురామానాయుడు — పురపాలకశాఖ
4. శ్రీ కె. విజయభాస్కరరెడ్డి (ఎం.ఎల్.సి) — సహకారం
5. శ్రీ ఆర్. రామలింగరాజు (ఎం.ఎల్.సి) — సాంఘిక సంక్షేమం
6. శ్రీ ఎస్. సిద్ధారెడ్డి (ఎం.ఎల్.సి) — చిన్నతరహా నీటిపారుదల (పదవీ విరమణ 28-6-69)
7. శ్రీ కె.వి నారాయణరెడ్డి — ప్లానింగ్, వాణిజ్యం
8. శ్రీ (ii) మొహమద్ ఇబ్రహీమ్ అలీఅన్సారీ — జైళ్ళు, వక్ఫ్స్ (పదవీ విరమణ 28-6-69)
9. శ్రీ అరిగ రామస్వామి — సాంఘిక సంక్షేమం

10. శ్రీ వి. సత్యనారాయణ రావు (ఎం.ఎల్.సి) — ఎక్సైజ్, మద్యనిషేధం

(i) సహాయమంత్రులు 6 మందికి కేబినెట్ హోదా లభించింది. 6-3-67 న వారు ప్రమాణస్వీకారం చేసినారు.

(ii) ఈ మంత్రులు 6-3-67 న నియమింపబడినారు. పోర్ట్‌ఫోలియోలలో మార్పులు కూడా జరిగినాయి.

## VII వ మంత్రిమండలి

ముఖ్యమంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి (18-7-1969 నుంచి 30-9-1971 వరకు)

శ్రీ జె.వి. నరసింగరావు — ఉపముఖ్యమంత్రి

1. శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి — సాధారణ పరిపాలన, ఆర్థికశాఖ భారీపరిశ్రమలు, ఎక్సైజ్ మద్యనిషేధం
2. శ్రీ జె.వి. నరసింగరావు — ప్లానింగ్, రోడ్లు, భవనాలు
3. శ్రీ జె. వెంగళరావు — హోమ్
4. శ్రీ పి. తిమ్మారెడ్డి — రెవిన్యూ
5. శ్రీ కాకాని వెంకటరత్నం — వ్యవసాయం
6. శ్రీ తోట రామస్వామి (ఎం.ఎల్.సి) — పంచాయతీరాజ్
7. శ్రీ డా॥ ఎం.ఎన్. లక్ష్మీనరసయ్య — రవాణా
8. శ్రీ ఎం. చెంచు రామానాయుడు — పురపాలకశాఖ
9. శ్రీ ఆర్. రామలింగరాజు (ఎం.ఎల్.సి) — దేవాదాయ, ధర్మాదాయశాఖ
10. శ్రీ ఎస్. సిద్ధారెడ్డి (ఎం.ఎల్.సి) — భారీ నీటిపారుదల
11. శ్రీ మొహమ్మద్ ఇబ్రహీం అలీఅన్సారి — ఆరోగ్యశాఖ
12. శ్రీ ఎ. భగవంతరావు — చేనేతపరిశ్రమ
13. శ్రీ వి. కృష్ణమూర్తి నాయుడు (ఎం.ఎల్.సి) — విద్యుత్‌శాఖ
14. శ్రీ జి. సంజీవరెడ్డి — లేబర్

15. శ్రీ డి. పెరుమాళ్ళు — సాంఘిక సంక్షేమం
16. శ్రీ కె. విజయభాస్కర రెడ్డి (ఎం.ఎల్.సి) — సహకారం
17. శ్రీ పి.వి. నరసింహారావు — విద్యాశాఖ

*సహాయమంత్రులు*

1. శ్రీ సాగి సూర్య నారాయణరాజు — అటవీశాఖ
2. శ్రీ ఎ. వాసుదేవరావు — సమాచారశాఖ
3. శ్రీ ఆవం సంజీవరెడ్డి — పౌరసరఫరాలు
4. శ్రీ రామచంద్రరావు కళ్యాణి — మార్కెటింగ్
5. శ్రీ రోండా నారపరెడ్డి (ఎం.ఎల్.సి) — మధ్యతరహానీటిపారుదల
6. శ్రీమతి రోడామిస్త్రీ (ఎం.ఎల్.సి) — స్త్రీ సంక్షేమం, టూరిజం
7. శ్రీ గుర్రం చిన్న వెంకన్న — చిన్నతరహాపరిశ్రమలు
8. శ్రీ వి. పురుషోత్తమరెడ్డి (ఎం.ఎల్.సి) — చిన్నతరహానీటిపారుదల
9. శ్రీ సి. రాజనరసింహా — గృహావసతి
10. శ్రీ పి. అంకినీడుప్రసాద్ — వాణిజ్యం, ఎగుమతులు (పదవీ విరమణ 23-3-71)
11. శ్రీ ఎస్.ఆర్.ఎ.ఎస్. అప్పలనాయుడు — చేపలపరిశ్రమ, రేవులు (పదవీ విరమణ 15-3-1971)

## VIII మంత్రిమండలి

ప్రత్యేక తెలంగాణా రాష్ట్రానికై ఆందోళన జరిగిన తరవాత 1971లో లోక్‌సభకు మధ్యంతర ఎన్నికలు జరిగిన తరవాత ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధీ సలహాపై ముఖ్యమంత్రిగా శ్రీ బ్రహ్మానందరెడ్డి రాజీనామా చేసినారు. ఆయన స్థానంలో శ్రీ పి.వి. నరసింహారావును కాంగ్రెసు శాసనసభా పక్షం ఏకగ్రీవంగా ఎన్నుకొంది. 25 మంది సభ్యులతో కూడిన మంత్రిమండలిని ఏర్పరచి నరసింహారావు పదవిలో కొనసాగినారు. 1972 లో జరిగిన శాసనసభ ఎన్నికల అనంతరం కూడా మరొకసారి శ్రీ నరసింహారావు ఎన్నికై ముఖ్యమంత్రిగా కొనసాగినారు.

ముఖ్యమంత్రి పి. వి. నరసింహారావు
(30-9-1971 నుంచి 20-3-1972 వరకు)

ఉపముఖ్యమంత్రి బి.వి. సుబ్బారెడ్డి

1. శ్రీ పి.వి. నరసింహారావు — సాధారణ పరిపాలన, ఎక్సైజు, హోమ్, లేబర్, సాంఘికసంక్షేమం
2. శ్రీ బి.వి. సుబ్బారెడ్డి — ప్లానింగ్, రోడ్లు, భవనాలు
3. శ్రీ కాకానివెంకటరత్నం — వ్యవసాయం, పశుసంవర్ధకశాఖ
4. శ్రీ కె. అచ్యుతరెడ్డి — రెవిన్యూ, (మరణం 23-1-72)
5. శ్రీ జె. చొక్కారావు — పరిశ్రమలు
6. శ్రీ ఎస్. సిద్ధారెడ్డి (ఎం.ఎల్.సి) — నీటిపారుదల.
7. శ్రీ మొహమ్మద్ ఇబ్రహీం అలిఅన్సారీ — ఆరోగ్యశాఖ
8. శ్రీ ఎం. మానిక్‌రావు — పురపాలకశాఖ
9. శ్రీ బత్తిన సుబ్బారావు — సహకారం

*సహాయమంత్రులు*

1. శ్రీ ఎ. వాసుదేవరావు — సమాచారశాఖ (పదవీ విరమణ 13-3-1972)
2. శ్రీ సి. రాజనరసింహ — గృహవసతి
3. శ్రీ కె. గోయలనాయుడు — రవాణా
4. శ్రీ పి. మహేంద్రనాథ్ — అటవీశాఖ
5. శ్రీ కె. భీమ్‌రావు — గిరిజన సంక్షేమం

కాబినెట్ విస్తరణ — 6-10-1971

*మంత్రులు*

1. శ్రీ తోట రామస్వామి (ఎం.ఎల్.సి) — పంచాయతీరాజ్
2. శ్రీ ఆర్. రామలింగరాజు (ఎం.ఎల్.సి) — దేవాదాయ, ధర్మాదాయశాఖ
3. శ్రీ వి. కృష్ణమూర్తి నాయుడు (ఎం.ఎల్.సి) — విద్యుత్‌శాఖ, ఎక్సైజు,
4. శ్రీ ఎ. భగవంతరావు — చేనేతపరిశ్రమ
5. శ్రీ సి.హెచ్.వి.పి. మూర్తి రాజు — మార్కెటింగ్

సహాయమంత్రులు

1. శ్రీ డా॥సి. హెచ్. దేవానంద టూరిజం
రావు (ఎం.ఎల్.సి)

కాబినెట్ విస్తరణ 28-10-71

మంత్రులు

1. శ్రీ ఎన్. చెంచురామా చేనేత
నాయుడు (పదవీ విరమణ 12-3-1972)

2. శ్రీ పి. బసిరెడ్డి మధ్యతరహా నీటిపారుదల

సహాయమంత్రులు

1. శ్రీ చల్లా సుబ్బా పౌరసరఫరాలశాఖ
రాయుడు

2. శ్రీ ఎ. మదన్ మోహన్ సాంకేతిక విద్య

3. శ్రీమతి పద్మాభాస్కర రెడ్డి స్త్రీ శిశుసంక్షేమం

## IX మంత్రిమండలి

ముఖ్యమంత్రి శ్రీ పి. వి. నరసింహారావు
(20-3-1972 నుంచి 18-1-1973 వరకు)

ఉపముఖ్యమంత్రి శ్రీ బి.వి. సుబ్బారెడ్డి

1. శ్రీ పి.వి. నరసింహారావు సాధారణ పరిపాలన, కళాశాల విద్య, రెవెన్యూ

2. శ్రీ బి.వి. సుబ్బారెడ్డి సమాచారం, ప్లానింగు, రహదార్లు
(పదవీ విరమణ 29-12-1972)

3. శ్రీ కాకాని వెంకటరత్నం వ్యవసాయం, ఆహారం
(మరణం 25-12-1972)

4. శ్రీ టి. హయగ్రీవాచారి పంచాయతీరాజు

5. శ్రీ మొహమ్మద్ ఇబ్రహీం ఆరోగ్యం, వక్ఫ్స్
అలీఅన్సారి

6. శ్రీ జె. వెంగళరావు పరిశ్రమలు

7. శ్రీ ఎ. భగవంతరావు ఆర్థికశాఖ

8. శ్రీ వి. కృష్ణమూర్తి హోం (పదవీ విరమణ 29-12-1972)
నాయుడు ఎం.ఎల్.సి)

9. శ్రీ ఎం. మానిక్ రావు పురపాలకశాఖ

10. శ్రీ బి. సుబ్బారావు సహకారం,పదవీవిరమణ13-12-1972)

| | |
|---|---|
| 11. శ్రీ సి. హెచ్. వి.పి. మూర్తిరాజు | (దేవాదాయ, ధర్మాదాయశాఖ) |
| 12. శ్రీ పి. బసిరెడ్డి | మధ్యతరహా నీటిపారుదల (పదవీ విరమణ 29-12-1972) |
| 13 శ్రీ సాగి సూర్యనారాయణరాజు | అటవీశాఖ |
| 14 శ్రీ ఎల్. లక్ష్మణదాస్ | గృహవసతి |
| 15. శ్రీ పి. నరసారెడ్డి | భారీనీటిపారుదల |
| 16. శ్రీ టి. అంజయ్య | లేబర్ |
| 17. శ్రీ ఎం.వి. కృష్ణారావు | సాంఘిక సంక్షేమం |
| 18. శ్రీమతి బి. జయప్రద | విద్యుత్ శాఖ |
| 19. శ్రీ కె. ప్రభాకరరెడ్డి (ఎ.ఎల్.సి.) | రవాణా |

సహాయమంత్రులు

| | |
|---|---|
| 1. శ్రీ పి. సుబ్బారాయుడు | పౌరసరఫరాలు (పదవీ విరమణ 29-12-1972) |
| 2. శ్రీ జి. రాజారాం | చేనేత |
| 3. శ్రీ పి. మహేంద్రనాథ్ | ఎక్సైజ్ |
| 4. శ్రీ కె. గోపాలనాయుడు | చిన్నతరహా నీటిపారుదల (పదవీ విరమణ 31-12-1972) |
| 5. శ్రీ బి. శ్రీరామమూర్తి | (ప్రైమరీ, సెకండరీవిద్య) |
| 6. శ్రీ కె. భీమ్‌రావ్ | గిరిజన సంక్షేమం |
| 7. శ్రీ దేవానందరావ్ (ఎం.ఎల్.సి) | టూరిజం |
| 8. శ్రీ ఎ. మదన్‌మోహన్ | సాంకేతికవిద్య |
| 9. శ్రీ ఎమ్.ఆర్. శ్యామ్‌రావ్ (ఎం.ఎల్.సి) | స్పోర్ట్స్ కౌన్సిల్ |
| 10. శ్రీ డి. మునిస్వామి | మార్కెటింగ్ (పదవీ విరమణ 29-12-1972) |

మంత్రిమండలి విస్తరణ 15-1-1-1973

మంత్రులు

| | |
|---|---|
| 1. శ్రీ పి.వి. చౌదరి | వ్యవసాయం |
| 2. శ్రీ ఆనం వెంకటరెడ్డి | హోం, పోలీసుశాఖ |
| 3. శ్రీ ఎం. సుబ్బారెడ్డి | మధ్యతరహా నీటిపారుదల |
| 4. శ్రీ రాజగోపాలరెడ్డి | రోడ్లు, భవనాలు |

5. శ్రీ సి. దాస్ — పౌరసరఫరాలు
6. శ్రీ ఎం. అమర్ నాథ్ రెడ్డి — సహకారం

సహాయమంత్రులు

1. శ్రీ వసంత నాగేశ్వరరావు — మార్కెటింగ్
2. శ్రీ జి. సోమశేఖర్ — చిన్నతరహా నీటిపారుదల

## X మంత్రిమండలి

ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికై ఆందోళన జరిగినప్పుడు శ్రీ పి వి నరసింహారావు మంత్రిమండలిని రద్దుచేసి అధ్యక్షపాలన విధించినారు. రాష్ట్ర గవర్నర్ సలహాదారుగా హెచ్.సి. సరిన్‌ను నియమించినారు. కొన్నాళ్ళు అధ్యక్షపాలన జరిగిన తరవాత శ్రీ జలగం వెంగళరావును శాసనసభా కాంగ్రెసు పార్టీ నాయకుడుగా ఎన్నుకొన్నారు. 1977 లో. అత్యవసర పరిస్థితి అనంతరం రాష్ట్రంలో జరిగిన లోక్‌సభ ఎన్నికలలో శ్రీ వెంగళరావు నాయకత్వాన 42 లో 41 స్థానాలు కాంగ్రెసుపార్టీకి లభించినాయి. 1978 లో శాసనసభ ఎన్నికలు జరిగేనాటికి కాంగ్రెసుపార్టీ చీలిపోగా, శ్రీ వెంగళరావు ఆనాడు శ్రీ బ్రహ్మానందరెడి నాయకత్వాన గల కాంగ్రెసుపార్టీలో ఉన్నారు. ఆపార్టీ ఎన్నికలలో తీవ్ర ఓటమికి గురి అయింది. అందువల్ల శ్రీ వెంగళరావు రాజీనామా ఇవ్వవలసి వచ్చింది.

| | |
|---|---|
| ముఖ్యమంత్రి | శ్రీ జె. వెంగళరావు (10-12-1973నుండి 5-3-1978)వరకు |
| ఉపముఖ్యమంత్రి | శ్రీ బి.వి. సుబ్బారెడ్డి |
| 1. శ్రీ జె. వెంగళరావు | సాధారణ పరిపాలన, హోం, భూసంస్కరణ, భారీనీటిపారుదల |
| 2. శ్రీ బి.వి. సుబ్బారెడ్డి | ఆహారం, వ్యవసాయం (మరణం 7-6-1974) |
| 3. శ్రీ ఎన్. రామచంద్రారెడ్డి | ఆర్థికశాఖ (మరణం 27-7-1974) |
| 4 శ్రీ పి. బసిరెడ్డి | పరిశ్రమలు (డ్రాప్ చేయబడ్డారు 18-3-1976) |
| 5. శ్రీ జె. చొక్కారావు | రవాణా (పదవీ విరమణ 1-12-77) |
| 6. శ్రీ కె. రాజమల్లు | ఆరోగ్యశాఖ, (పదవీ విరమణ 28-11-1977) |
| 7. శ్రీ సాగిసూర్యనారాయణ రాజు | దేవాదాయ, ధర్మాదాయశాఖ (పదవీ విరమణ 1-5-1977) |

8. శ్రీ ఎం. ఇబ్రహీం అలీ అన్సారి — సమాచారం, వక్ఫ్స్
9. శ్రీ వి. కృష్ణమూర్తి నాయుడు (ఎం.ఎల్.సి) — మధ్యతరహా నీటిపారుదల
10. శ్రీ బి. సుబ్బారావు — సహకారం
11. శ్రీ ఎల్. లక్ష్మణదాస్ — లేబర్, ఎంప్లాయ్‌మెంట్ (పదవీ విరమణ 29-12-1977)
12. శ్రీ జి. రాజారాం — విద్యుత్ శాఖ (పదవీ విరమణ 7-1-1978)
13. శ్రీ చల్లాసుబ్బారాయుడు — పురపాలక శాఖ

*సహాయమంత్రులు*

1. శ్రీ దేవానందరావ్ — టూరిజం, పబ్లిక్ లైబ్రరీలు
2. శ్రీమతి లక్ష్మీదేవి (ఎం.ఎల్.సి) — స్త్రీ, శిశుసంక్షేమం

కాబినెట్ విస్తరణ 12-1-1974

*మంత్రులు*

1. శ్రీ ఎం.వి. కృష్ణారావు — విద్య
2. శ్రీ చనుమోలు వెంకటరావు — రోడ్లు, భవనాలు

*సహాయమంత్రులు*

1. శ్రీ బి. రామమూర్తి — సాంఘిక సంక్షేమం

కాబినెట్ విస్తరణ 25-9-1974

*మంత్రులు*

1. శ్రీ పిడతల రంగారెడ్డి — ఆర్థిక, సమాచారశాఖ (పదవీ విరమణ 1-12-1977)
2. శ్రీ టి. అంజయ్య — లేబర్, ఎంప్లాయ్‌మెంట్
3. శ్రీ పి. నరసారెడ్డి — రెవిన్యూ

*సహాయమంత్రులు*

1. శ్రీ ఎ. వెంకటరెడ్డి — చిన్నతరహా, నీటిపారుదల (పదవీ విరమణ 1-12-1977)
2. శ్రీ వి. పురుషోత్తమరెడ్డి (ఎం.ఎల్.సి.) — ఎక్సైజ్
3. శ్రీ పి. మహేంద్రనాథ్ — మార్కెటింగ్

4. శ్రీ డి. మునుస్వామి చేపలపరిశ్రమ
5. శ్రీ ఎస్. వెంకటరామరెడ్డి పశుసంవర్ధకశాఖ
(ఎం.ఎల్.సి) మరణం 14-10-1976)
6. శ్రీ అసిఫ్ పాషా న్యాయశాఖ
7. శ్రీ కె.వి. కేశవులు చేనేత

క్యాబినెట్ విస్తరణ 13-7-1976

మంత్రులు

1. శ్రీ సి. హెచ్. హను రవాణా
మయ్య (ఎం.ఎల్.సి)

సహాయమంత్రులు

1. శ్రీమతి కృష్ణవేణి స్త్రీ సంక్షేమం
సంజీవయ్య (ఎం.ఎల్.సి.)
2. శ్రీ కె.బి. నరసప్ప చక్కెరపరిశ్రమ
(పదవీ విరమణ 7-1-1978
3. శ్రీ పి. శేషావతారం పల్లెల అభివృద్ధి
(పదవీ విరమణ 4-1-1978)
4. శ్రీ పి. ధర్మారెడ్డి గృహావసతి
(పదవీ విరమణ 1-12-1977)
5. శ్రీ వై. నారాయణస్వామి చిన్నపరిశ్రమలు
(ఎం.ఎల్.సి.)

కాబినెట్ విస్తరణ 4-9-1977

మంత్రులు

1. శ్రీ ఆర్. నారపరెడ్డి పంచాయతీరాజ్
2. శ్రీ మానిక్ రావ్ కమర్షియల్ టాక్స్
(పదవీ విరమణ 7-1-1978)
3. శ్రీ కె. అప్పుడుదొర మార్కెటింగ్

సహాయమంత్రులు

1. శ్రీ కె. రామిరెడ్డి పౌరసరఫరాలు
2. శ్రీ పి.వి. వెంకటరావు నీటిపారుదల అభివృద్ధి సంస్థ
3. శ్రీ లక్ష్మీనారాయణ వెనకబడిన తరగతుల సంక్షేమం
యాదవ్ (ఎం.ఎల్.సి)

## XI మంత్రిమండలి

1978 శాసనసభ ఎన్నికల అనంతరం అత్యధిక సంఖ్యా బలంతో నెగ్గిన కాంగ్రెసు 'ఐ' పార్టీ డా॥ మర్రి చెన్నారెడ్డిని నాయకుడుగా ఎన్నుకొంది. ఆయన 32 మంది మంత్రులతో తన మంత్రిమండలిని ఏర్పరిచినారు:

| | |
|---|---|
| ముఖ్యమంత్రి | డా॥ ఎం. చెన్నారెడ్డి (6-3-1978నుంచి 10-10-1980 వరకు) |
| 1. డా॥ ఎం. చెన్నారెడ్డి | సాధారణ పరిపాలన, భూసంస్కరణ, పరిశ్రమలు, సమాచారశాఖ, ఎక్సైజ్, శాంతి, భద్రత |
| 2. శ్రీ ఎన్. అమరనాథ్ రెడ్డి | సహకారం |
| 3. శ్రీ ఎం. బాగారెడ్డి | పంచాయతీరాజ్ |
| 4. శ్రీ పి.వి. చౌదరి (ఎం.ఎల్.సి) | టెక్స్టైల్స్ |
| 5. శ్రీ సి. దాస్ | చక్కెర పరిశ్రమ |
| 6. శ్రీ పి. గంగారెడ్డి | వ్యవసాయం |
| 7. శ్రీ ఎం.ఎం. హాషిమ్ (ఎం.ఎల్.సి) | హోం |
| 8. శ్రీ టి. హయగ్రీవాచారి | వాణిజ్యం, సాంకేతిక విద్య |
| 9. శ్రీ ఎన్ జనార్ధన్ రెడ్డి (ఎం.ఎల్.సి) | రెవెన్యూ |
| 10. శ్రీ ఎ. మదన్ మోహన్ | ఆరోగ్యశాఖ |
| 11. శ్రీ ఎం. మానిక్ రావు | రహదారులు, రోడ్లు, భవనాలు |
| 12. శ్రీ వి. నాగేశ్వరరావు (ఎం.ఎల్.సి) | పశుసంవర్ధక శాఖ |
| 13. శ్రీ కె.బి. నరసప్ప | చిన్నతరహా పరిశ్రమలు |
| 14. శ్రీ కె. ఓబుల్ రెడ్డి | మధ్యతరహా నీటిపారుదల |
| 15. శ్రీ జి. రాజారాం | ఆర్థిక, విద్యుత్ శాఖలు |
| 16. శ్రీ బి. రామ్‌దేవ్ (ఎం.ఎల్.సి) | పురపాలక శాఖ* |
| 17. శ్రీమతి రోడామిస్త్రీ (ఎం.ఎల్.సి) | యాత్రలు, గ్రంథాలయాలు* |
| 18. శ్రీ జి.వి. సుధాకర్ రావు (ఎం.ఎల్.సి) | భారీనీటిపారుదల వాణిజ్యపన్నులు* |

19. శ్రీ వి. వెంకటనారాయణ (ఎం.ఎల్.సి) — దేవాదాయ, ధర్మాదాయశాఖ
20. శ్రీ భవనం వెంకటరామ రెడ్డి (ఎం.ఎల్.సి) — విద్యాశాఖ*
21. శ్రీ ఎడ్లపాటి వెంకటరావు — ప్లానింగు, న్యాయశాఖ కోర్టులు
22. శ్రీ జి. వెంకటస్వామి (ఎం.ఎల్.సి) — కార్మిక ఉపాధి కల్పన

సహాయమంత్రులు

1. శ్రీ అహమద్‌షరీఫ్ — అటవీశాఖ
2. శ్రీ నాదెండ్ల భాస్కరరావు — అసెంబ్లీ వ్యవహారాలు
3. శ్రీ నిజామ్‌వలీ — వక్ఫ్స్, చిన్న మొత్తాల పొదుపు
4. శ్రీ కె.వి.ఆర్. పద్మనాభరాజు — గిరిజన సంక్షేమం
5. శ్రీ ఎస్.వి. ప్రసాద్ — మార్కెటింగ్
6. శ్రీ జి. రామస్వామి — పౌరసరఫరాలు
7. శ్రీ కె. రంగారావు — హరిజన సంక్షేమం**
8. శ్రీ పి. శేషావతారం — పల్లెపట్ల అభివృద్ధి**
9. శ్రీ ఎ. వెంగళరెడ్డి — రవాణా
10. శ్రీ ఎ. వీరప్ప — చేపలశాఖ
11. శ్రీ ఎస్. వెంకటరెడ్డి — గనులు

*వీరు మంత్రులుగా నియమితులైనపుడు అసెంబ్లీ సభ్యులుకారు. 9-6-1978 న లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు ఎన్నికైనవారు.

**తదుపరి మంత్రిశ్రేణి పొందినవారు.

## పార్లమెంటరీ సెక్రటరీలు

1. శ్రీమతి టి. సత్యవతి
2. శ్రీ బి. కృష్ణ
3. శ్రీ రవీంద్రనాయక్
4. శ్రీ కె.యి. కృష్ణమూర్తి
5. శ్రీ నీలం చార్లెస్
6. శ్రీ ఆర్. నాగభూషణం

# 12 వ మంత్రి మండలి

డా॥ మర్రిచెన్నారెడ్డి ముఖ్యమంత్రిగా పూర్తికాలం కొనసా, 1980 అక్టోబరులో ఆయన తన ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేసి ఆయన స్థానంలో శ్రీ టి. అంజయ్యను కాంగ్రెసుపార్టీ శాసనసభాపతుం కుడుగా ఎన్నుకొంది. ఆయన మొదట పెద్దమంత్రివర్గాన్ని ఏర్పా తరవాత కొందరిని తొలగించినారు.

ముఖ్యమంత్రి శ్రీ టి. అంజయ్య (11-10-1980)

| | | |
|---|---|---|
| 1. | శ్రీ టి. అంజయ్య | |
| 2. | శ్రీ ఎన్. అమరనాథ్ రెడ్డి | సహకారం |
| 3. | శ్రీ ఇ. అయ్యపు రెడ్డి | న్యాయశాఖ |
| 4. | శ్రీ ఎం.ఎ. అజీజ్ | అటవీశాఖ |
| 5. | శ్రీ ఎం. బాగా రెడ్డి | భారీపరిశ్రమలు, ఉర్దూ అకాడమీ |
| 6. | శ్రీ పి.వి. చౌదరి | దేవాదాయ, ధర్మాదాయశాఖ |
| 7. | శ్రీ సి. దాస్ | చిన్నతరహా నీటిపారుదల |
| 8. | శ్రీ సి.హెచ్. హనుమయ్య | మార్కెటింగ్ |
| 9. | శ్రీ ఎం.ఎం. హాషిమ్ | రేవులు, ఎగుమతులు |
| 10. | శ్రీ టి. హయగ్రీవాచారి | సాంకేతికవిద్య |
| 11. | శ్రీ సి. జగన్నాథరావ్ | హోమ్ |
| 12. | శ్రీ ఎన్. జనార్ధనరెడ్డి | రెవిన్యూ |
| 13. | శ్రీ దివి కొండయ్య చౌదరి | రోడ్లు, భవనాలు |
| 14. | ఎ. మదన్ మోహన్ | ఆరోగ్యశాఖ |
| 15. | శ్రీ ఎం. మానిక్ రావు | కమర్షియల్ టాక్సెస్, పరిశ్రమలు |
| 16. | శ్రీ కె. ప్రభాకరరెడ్డి | ఆర్థికశాఖ |
| 17. | శ్రీ బి. రామ్ దేవ్ | పశుసంవర్ధకశాఖ |
| 18. | శ్రీ కె. రంగారావు | సాంఘిక సంక్షేమం, హరిజన సం |
| 19. | శ్రీ కె. రోశయ్య | రవాణా |
| 20. | శ్రీమతి సరోజినీపుల్లారెడ్డి | పురపాలకశాఖ |
| 21. | శ్రీ భాట్టం శ్రీరామమూర్తి | సాంస్కృతికశాఖ |
| 22. | శ్రీ ఎన్. శ్రీనివాసులురెడ్డి | పంచాయతీరాజ్ |

| | |
|---|---|
| 23. శ్రీ జి.వి. సుధాకర రావు | భారీనీటిపారుదల |
| 24. శ్రీ ఎ. వీరప్ప | విద్యుత్‌శాఖ |
| 25. శ్రీ ఎస్. వెంకటరెడ్డి | గనులు |
| 26. శ్రీ శ్రవనం వెంకట్రామ రెడ్డి | విద్యాశాఖ |
| 27. శ్రీ జి. వెంకటస్వామి | కార్మిక, పౌరసరఫరాలు |
| 28. శ్రీ సి. రాజనరసింహా | యాత్రలు |
| 29. శ్రీ జి. రామస్వామి | చేపలశాఖ |
| 30. శ్రీ ఎం. తులసీదాస్ | వెనకబడిన వర్గాల సంక్షేమం |
| 31. శ్రీ పాలడుగు వెంకట్రావ్ | గ్రామీణ నీటిపారుదల |
| 32. శ్రీమతి ఎం.ఎస్. విజయ లక్ష్మీదేవి | స్త్రీ, శిశుసంక్షేమం |
| 33. శ్రీ కె. కేశవరావు | చిన్నపరిశ్రమలు |
| 34. శ్రీ చనుమోలు వెంకట రావు | వ్యవసాయశాఖ |

సహాయమంత్రులు

| | |
|---|---|
| 1. శ్రీ ఎస్. ఆల్వార్‌దాస్ | పురపాలకశాఖ |
| 2. శ్రీ ఎన్. చంద్రబాబు నాయుడు | గ్రంథాలయాలు, సినిమాలు |
| 3. శ్రీ బాలాగౌడ్ | చక్కెరపరిశ్రమ |
| 4. శ్రీ పి. జనార్ధనరెడ్డి | యువజన సంఘాలు |
| 5. శ్రీ జి. నాగేశ్వరరావు | చేనేత |
| 6. శ్రీ డా॥ వై.యస్. రాజశేఖరరెడ్డి | గ్రామీణ అభివృద్ధి |
| 7. శ్రీ డి. రవీంద్రనాయక్ | గిరిజనసంక్షేమం |
| 8. శ్రీ కె. సత్యనారాయణ రాజు | గృహవసతి |
| 9. శ్రీ వి. వెంకటేశ్వరరావు | భూగర్భజలాలు |

## పార్లమెంటు సెక్రటరీలు

1. శ్రీ నీలం చార్లెస్
2. శ్రీ బి. కృష్ణ

3. శ్రీ ఆర్. నాగభూషణం
4. శ్రీమతి టి. సత్యవతి

*అంజయ్య మంత్రిమండలిలో శాఖల మార్పు*

(7-2-1982)

| | | |
|---|---|---|
| 1. | శ్రీ భవనం వెంకట్రామ రెడ్డి | రవాణా |
| 2. | శ్రీ కె. కేశవరావు | విద్య |
| 3. | శ్రీ కె. రోశయ్య | వాణిజ్యపన్నులు |
| 4. | శ్రీ మాణిక్ రావు | ఎక్సైజు |
| 5. | శ్రీ భాట్టం శ్రీరామమూర్తి | సమాచారం, సాంస్కృతిక వ్యవహారాలు గ్రంథాలయాలు |
| 6. | శ్రీ రాజనరసింహా | టూరిజం, పురావస్తు విషయాలు |
| 7. | శ్రీ మజ్జి తులసీదాసు | మీడియం ఇరిగేషన్ |
| 8. | శ్రీ ఆళ్వార్ దాసు | పురపాలక, విద్యాశాఖల సహాయమంత్రి |
| 9. | శ్రీ చంద్రబాబునాయుడు | సినిమాటోగ్రఫీ, భూగర్భజలనిధులు |
| 10. | శ్రీ బాలాగౌడ్ | వెనకబడిన తరగతులు |
| 11. | శ్రీ వి. వెంకటేశ్వరరావు | లఘుపరిశ్రమలు |
| 12. | డా॥ వై.ఎస్. రాజశేఖర రెడ్డి | పట్టుపరిశ్రమ, గ్రామీణ సంక్షేమం |
| 13. | శ్రీ ఎం.ఎం. హాషిం | సెట్విన్, వాణిజ్యం |
| 14. | శ్రీ అగిశం వీరప్ప | తోళ్ళపరిశ్రమ, లిడ్‌కాప్, విద్యుత్తు |
| 15. | శ్రీ గోకా రామస్వామి | తోటల అభివృద్ధి, చేపలు |

## 13 వ మంత్రిమండలి

*శ్రీ కోట్ల విజయభాస్కరరెడ్డి మంత్రి వర్గం*

1982, సెప్టెంబరు 16 న రాష్ట్ర కాంగ్రెస్ (ఐ) పార్టీ శాసనసభా పక్షం సమావేశమై శ్రీ విజయభాస్కర రెడ్డిని నాయకునిగా ఎన్నుకొన్నది. కేంద్రమంత్రి శ్రీ వెంకట్రామన్ పరిశీలకుడుగా ఈ సమావేశంలో పాల్గొన్నారు. శ్రీ విజయభాస్కర రెడ్డి మూడు అంచెలుగా తనమంత్రి వర్గాన్ని ఏర్పాటు చేసినారు. సెప్టెంబరు 20న ఆయన ఆయన మంత్రివర్గం ప్రమాణస్వీకారం చేసినారు. ఆనాడు శ్రీ అమర్‌సింగ్ తిలావత్ రాలేకపోయినందున ఆయన ప్రమాణ స్వీకారం తరవాత జరిగింది. 110 రోజులపాటు ఉన్న శ్రీవిజయ భాస్కరరెడ్డి మంత్రివర్గం రెండు ప్రధాన పథకాలను చేపట్టింది. ప్రాథమిక పాఠశాల విద్యార్థులకు మధ్యాహ్న భోజన పథకము ఇందులో ఒకటి. రెండ

వది చౌకగా బియ్యం అమ్మే పథకంలో కిలో రూ. 1.90 పై. మొదలుకొని రూ. 2.50 పై. వరకూ బియ్యం అమ్మవలెననుకొన్నారు.

1982, నవంబర్ 26 వతేదీన రాష్ట్రంలో ఎన్నికలు జరపనున్నట్లు ప్రకటన వెలువడింది. జనవరి 5న (1983) విధానసభకు జరిగిన ఎన్నికలలో కాంగ్రెస్ (ఐ) పార్టీ బలాన్ని కోల్పోవటంతో శ్రీ విజయభాస్కరరెడ్డి ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేసినారు. పాత శాసనసభ రద్దుకాగా కొత్త సభ్యులతో కూడినసభ ఏర్పడింది.

### శ్రీ విజయ భాస్కరరెడ్డి మంత్రిమండలి

| మంత్రులు | శాఖలు |
|---|---|
| 1. శ్రీ కె. విజయభాస్కరరెడ్డి ముఖ్యమంత్రి | సాధారణ పరిపాలన, న్యాయశాఖ, పట్టణ భూగరిష్ఠ పరిమితి, 20సూత్రాల కార్యక్రమం, హౌసింగ్ |
| 2. శ్రీ సి. జగన్నాథరావు | పరిశ్రమలు |
| 3. శ్రీ ఎన్. జనార్ధనరెడ్డి | వ్యవసాయం |
| 4. శ్రీ వి. మదన్ మోహన్ | రెవెన్యూ, వాణిజ్యపన్నులు |
| 5. శ్రీ ఎం.ఎ. అజీజ్ | అటవీశాఖ |
| 6. శ్రీ ఎం.వి. కృష్ణరావు | సహకారశాఖ |
| 7. శ్రీ కోన ప్రభాకరరావు | ఆర్థికశాఖ, ప్రణాళిక |
| 8. శ్రీ ఎం. మానిక్‌రావు | రోడ్లు, భవనాలు |
| 9. శ్రీ బి. రాందేవ్ | పశుసంవర్ధకశాఖ |
| 10. శ్రీ డి. మునుస్వామి | పంచాయతీరాజు |
| 11. శ్రీ సి. దాస్ | సాంఘిక సంక్షేమం |
| 12. శ్రీమతి సరోజినీపుల్లారెడ్డి | వైద్య, ఆరోగ్యశాఖ |
| 13. శ్రీ ఎం. బాగారెడ్డి | రవాణా |
| 14. శ్రీ కె. రోశయ్య | హోం |
| 15. శ్రీ ఎ. వీరప్ప | చిన్నతరహా నీటిపారుదల |
| 16. శ్రీ సిహెచ్. వెంకటరావు | భారీ, మధ్యతరహా నీటిపారుదల |
| 17. శ్రీ ఎన్. అమరనాథరెడ్డి | పౌరసరఫరాలు |
| 18. డా॥వై.ఎస్. రాజశేఖరరెడ్డి | విద్యాశాఖ |
| 9. శ్రీ అహమ్మద్ షరీఫ్ | వాణిజ్యం |

20. శ్రీ వి. వెంకటేశ్వర రావు — న్యాయవిభాగం
21. శ్రీ కె. కేశవరావు — కార్మికశాఖ, స్త్రీ సంక్షేమం
22. శ్రీ పాలడుగు వెంకట రావు — మార్కెటింగ్

స్టేట్ మంత్రులు

1. శ్రీ ఎన్. చంద్రబాబు నాయుడు — సాంకేతికవిద్య
2. శ్రీ జి. నాగేశ్వరరావు — దేవాదాయశాఖ
3. శ్రీ ఐ. రామకృష్ణంరాజు — ఎక్సైజు
4. శ్రీ పి. గోవర్ధన్ రెడ్డి — చేనేతపరిశ్రమ
5. శ్రీ ఆర్. వేమన్న — పురపాలకశాఖ
6. శ్రీ అమర్‌సింగ్ తిలావత్ — పర్యాటనశాఖ
7. శ్రీ పి.వి. రాఘవులు — మత్స్యశాఖ
8. శ్రీ బి. సమ్మయ్య — చిన్నతరహా పరిశ్రమలు
9. శ్రీ వి. సన్యాసి నాయుడు — చక్కెర, కుటీరపరిశ్రమలు
10. శ్రీ వి. హనుమంతరావు — గిరిజన సంక్షేమం

*శ్రీ ఎన్. టి. రామారావు మంత్రిమండలి*

1982 మార్చి 29 న 'తెలుగుదేశం' పేరిట శ్రీ ఎన్. టి. రామారావు నాయకత్వాన కొత్తపార్టీ రాష్ట్రంలో ప్రారంభమైంది. హైదరాబాదులోనూ, తిరుపతిలోనూ రెండు మహానాడు సభలను ఈ పార్టీ జరుపుకొన్నది. ఇతర పార్టీల నుంచి చేరదలచిన శాసనసభ సభ్యులు తమ సభ్యత్వానికి రాజీనామా ఇచ్చి రావలెనని తెలుగుదేశం పార్టీ నిబంధన ఏర్పరచింది. తొలుత శ్రీయుతులు నాదెళ్ళ భాస్కరరావు, గద్దె రత్తయ్య సి. నారాయణ, ఆదెయ్య తెలుగుదేశంలో చేరినారు. అందులో శ్రీ నాదెళ్ళ భాస్కరరావు ఒక్కరే శాసనసభ సభ్యత్వానికి రాజీనామా ఇచ్చినారు. మిగిలిన ముగ్గురూ తెలుగుదేశంపార్టీకి దూరంగా వెళ్ళి పోయినారు. తరవాత శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి విధానసభ సభ్యత్వానికి రాజీనామా ఇచ్చి తెలుగుదేశంలో చేరినారు.

శ్రీ ఎన్.టి. రామారావు రాష్ట్రవ్యాప్తంగా పర్యటించి పార్టీ ప్రచారం చేసినారు. జిల్లా సమన్వయ కర్తలను నియమించినారు. తొమ్మిది మాసాల పాటు పార్టీ ప్రచారాన్ని ముమ్మరంగా సాగించి నియమావళిని రూపొందించి ప్రకటించినారు.

విధానసభకు ఎన్నికలు ప్రకటించినప్పుడు ప్రతిపక్షాలవారు, తెలుగు దేశంతో కలసిస్థానాల సర్దుబాటుకు చర్చలు జరిపినప్పటికీ ఫలించలేదు. 289 స్థానాలకు తెలుగుదేశం పోటీ చేసింది. మేనకాగాంధీ నాయకత్వంగల సంజయ్ విచార్ మంచ్ 5 స్థానాలలో పోటీ చేయగా తెలుగుదేశం ఆ పార్టీకి మద్దతును ప్రకటించింది. ఎన్నికల ఫలితాలనుబట్టి తెలుగుదేశానికి 198 స్థానాలు లభించి నాయి. తెలుగుదేశం శాసనసభా పక్షం హైదరాబాదులో సమావేశమై ఎన్. టి. రామారావును నాయకునిగా ఎన్నుకొన్నది. గవర్నరు ఆహ్వానంపై ఎన్. టి. రామారావు మంత్రిమండలిని ఏర్పరచినారు. 1983 జనవరి 9 న క్రొత్త మంత్రి వర్గం ప్రమాణస్వీకారం చేసింది.

### *శ్రీ ఎన్. టి. రామారావు మంత్రిమండలి*

| మంత్రులు | శాఖలు |
|---|---|
| 1. శ్రీ ఎన్.టి. రామారావు ముఖ్యమంత్రి | సాధారణపరిపాలన, హోం, భారీపరిశ్రమలు, ప్రణాళిక సమాచారశాఖ |
| 2. శ్రీ నాదెళ్ళ భాస్కర రావు | ఆర్థికశాఖ, వాణిజ్యపన్నులు, ఎనర్జి |
| 3. శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డి | రోడ్లు, భవనాలు, నీటిపారుదల శాఖలు |
| 4. శ్రీ పి. మహేంద్రనాథ్ | భూమిశిస్తు, పౌరసరఫరాలు |
| 5. శ్రీ సంగమరెడ్డి సత్యనారాయణ | రవాణా |
| 6. శ్రీ ఈలి. ఆంజనేయులు | దేవాదాయశాఖ |
| 7. శ్రీ కరణం రామచంద్ర రావు | పంచాయతీరాజ్ |
| 8. శ్రీ పూసపాటి ఆనంద గజపతిరాజు | విద్య, గ్రంథాలయాలు, సాంస్కృతిక వ్యవహారాలు |
| 9. శ్రీ కుందూరి జానారెడ్డి | వ్యవసాయం, సహకారం |
| 10. శ్రీ శిరిగిరెడ్డి రామమునిరెడ్డి | వైద్యం, ఆరోగ్యం |

స్టేట్ మంత్రులు

| | | |
|---|---|---|
| 1. | శ్రీమతి కె. ప్రతిభా భారతి | సాంఘిక సంక్షేమం, స్త్రీ సంక్షేమ గిరిజన సంక్షేమం |
| 2. | శ్రీ ఎం. రామచంద్రరావు | కార్మిక, ఉపాధిశాఖ |
| 3. | శ్రీ ఎనముల రామ కృష్ణుడు | న్యాయస్థానాలు; పురపాలక శాఖ |
| 4. | శ్రీ టి. జీవన్ రెడ్డి | ఎక్సైజ్ |
| 5. | శ్రీ మహమ్మద్ షకీర్ | పర్యటనశాఖ; వక్ఫ్ బోర్డ్ |

# 4

# విధానసభ (శాసనసభ)

రాజ్యాంగ పరంగా ప్రతిరాష్ట్రానికి ఒక విధానసభ, కొన్ని సందర్భాలలో విధాన పరిషత్తు ఉంటుంది. విధానసభలో 500 కు మించకుండానూ, 60కి తగ్గకుండానూ సభ్యులను ఓటర్లు ఎన్నుకొంటారు. ప్రతి పదేళ్ళకూ జనాభా ప్రాతిపదికగా నియోజక వర్గాలను పునర్విభజన గావిస్తూంటారు. జనాభాకు తగినట్లుగా ప్రాతినిధ్యం ఒకే రీతిలో ఉండే నిమిత్తం ఈ చర్య తీసుకొంటారు. కనక విధానసభలో సభ్యులసంఖ్య స్వల్పమార్పులకులోనవుతూఉంటుంది. కొన్ని స్థానాలు హరిజనులకు, మరికొన్ని గిరిజనులకు కేటాయించడం కూడా రాజ్యాంగ పరంగా జరుగుతుంది. విధానసభ కాలపరిమితి 5 సంవత్సరాలు. ఆ తరవాత సభ దానంతట అదే రద్దు అవుతుంది. ఈ లోగా రాష్ట్రపతి శాసన సభను, తగిన కారణాలుంటే, రద్దు చేయవచ్చు.

ఆంధ్రప్రదేశ్ శాసనసభ (విధానసభ) 294 మంది సభ్యులతో ఉంది. వీరిని ఓటర్లు ప్రత్యక్షంగా 5 సంవత్సరాలకొక పర్యాయం ఎన్నుకొంటారు. ఇందులో 39 స్థానాలు హరిజనులకు, 11 స్థానాలు గిరిజనులకు కేటాయించినారు. 244 స్థానాలలో అర్హులైన వారెవరైనా నిలబడవచ్చు. 25 సంవత్సరాల వయస్సుగల భారత పౌరులందరూ ఎన్నికలలో నిలబడటానికి అర్హులు. ఒక స్థానం ఆంగ్లో-ఇండియన్లకు ప్రాతినిధ్యం వహించే నిమిత్తం రాష్ట్ర గవర్నర్ నామినేట్ చేస్తాడు.

1956 లో రాష్ట్రం ఏర్పడినప్పుడు శాసనసభలో 293 స్థానాలున్నాయి. రెండవ సాధారణ ఎన్నికలలో వీటి సంఖ్య 301 అయింది. మూడవ సాధారణ ఎన్నికలకు 287 స్థానాలు, ఐదవ సాధారణ ఎన్నికలలో గూడా ఇదే సంఖ్య కొనసాగింది. నియోజక వర్గాలను మార్పు చేయటం వల్ల ఈ సంఖ్యలో కూడా మార్పు వచ్చింది. జనాభా లెక్కలను బట్టి 10 ఏండ్లకొకసారి నియోజక వర్గాల మార్పు చేస్తారు. శాసనసభకు ఎన్నికైన వ్యక్తి శాసన మండలిలో గానీ, లోక్‌సభ, రాజ్యసభలోగానీ సభ్యుడుగా ఉండరాదు. లాభాలు ఆర్జించే విధంగా గానీ, లేదా ప్రభుత్వోద్యోగాలలో గాని అతడు కొనసాగటానికి వీలు లేదు. శాసనసభను ఏదైనా కారణాల వల్ల రద్దుచేస్తే తప్ప ఎన్నికైన వ్యక్తి 5 సంవత్సరాలపాటు సభ్యుడుగా ఉంటాడు. శాసనసభలో సభ్యుడు మాట్లాడిన దానిపట్ల ఎవరూ కోర్టుకు వెళ్ళటానికి వీలులేదు. శాసన సభ్యునికి స్వేచ్ఛగా

మాట్లాడే హక్కు ఉంది. ఒకసారి ఎన్నికైన సభ్యుని మళ్ళీ ఎన్నికలవరకూ తొలగించే వీలు లేదు. శాసన సభ్యులకు జీతభత్యాలు, సౌకర్యాలు ఎంత ఉండాలనేది శాసనసభ చట్టరూపేణా నిర్ధారిస్తుంది. సభా వ్యవహారాలు నిర్వహించటానికి శాసన సభ్యులు సభాధ్యక్షుని (స్పీకర్), ఉపాధ్యక్షుని (డిప్యూటీ స్పీకరుని) ఎన్నుకొంటారు. శాసన సభలో ఆర్థిక సంబంధమైన బిల్లులన్నీ, బడ్జెటును ప్రవేశపెట్టి, ఆమోదించే హక్కులు ఉన్నాయి. శాసన సభ్యులెవరైనా బిల్లును, తీర్మానాలను ప్రవేశపెట్టవచ్చు. ప్రశ్నలు, సావధాన తీర్మానాలు, స్వల్పవ్యవధి ప్రశ్నలు, వాయిదా తీర్మానాలు ప్రవేశపెట్టి, విషయాలు తెలుసుకొనే హక్కు సభ్యులకు ఉంది.

శాసన సభలో సర్వసాధారణంగా సభ్యులందరూ పార్టీలవారీగా కూర్చుంటారు. వారిస్థానాలనుస్పీకరు కేటాయిస్తారు. అధికారపక్షంలోని వారంతా ట్రెజరీ బెంచెస్ అని, మిగిలిన వారంతా ప్రతిపక్షాలని సంప్రదాయంగా భావించడం జరుగుతుంది. ఓటింగ్ సందర్భంలో ప్రతిపక్షంవారు పట్టుబడితే తప్ప సర్వసాధారణంగా మూజువాణీ తీరులోనే ఓటింగు జరుగుతుంది. లేనట్లయితే, అనుకూల ప్రతికూలురను తమ స్థానాలలో నిలబడ వలసిందిగా స్పీకరు కోరతారు. స్పీకర్ కు, డిప్యూటి స్పీకర్ కూ సభా కార్యకలాపాలను నిర్వహించటంలో తోడ్పడటానికి స్పీకర్ పానెల్ ను ఎంపిక చేస్తారు. సంవత్సరానికి ఒక పర్యాయం ప్రభుత్వ విధానాలను వివరిస్తూ గవర్నర్ శాసనసభ నుద్దేశించి ప్రసంగిస్తారు. దానిపై ధన్యవాద తీర్మానం ప్రవేశపెట్టటం, ప్రభుత్వ విధానాల మంచి చెడ్డలను అన్ని పక్షాల వారు చర్చించటం జరుగుతుంది. అట్లాగే ఏడాదికొక పర్యాయం ప్రవేశపెట్టే బడ్జెటుపై కూడా సాధారణంగానూ, పద్దులవారీగానూ, చర్చ జరుగుతుంది. ప్రభుత్వంపై సభ్యులు ప్రవేశపెట్టే అవిశ్వాస తీర్మానానికి సభలో 5వ వంతు సభ్యుల మద్దత్తు ఉండవలె.

ఆంధ్రప్రదేశ్ శాసనసభలో వివిధ పక్షాల బలాబలాలు 1956 నుంచి ఇప్పటి వరకూ ఉన్న తీరు ఈ కింద పొందుపరచడమైంది.

శాసనసభ (1955-1962) మొత్తం 300

| క్ర. నం. పార్టీపేరు | మార్చి 1957 | మార్చి 1958 | మార్చి 1961 |
|---|---|---|---|
| 1. ఐక్యకాంగ్రెస్ ఫ్రంట్ | 216 | 215 | 236 |
| 2. సి.పి.ఐ.+పీపుల్స్ డెమోక్రటిక్ ఫ్రంట్ | 37 | 37 | 37 |
| 3. సోషలిస్టులు | లేరు | 17 | లేరు |
| 4. ప్రజాసోషలిస్టుపార్టీ | — | — | 17 |

| | | | | |
|---|---|---|---|---|
| 5. ఇండిపెండెంట్స్ | | | | |
| ఇతరులు | 34 | 31 | 11 | |
| మొత్తం | 301 | 301 | 301 | |

నామినేటెడ్ సభ్యుని ఈ పట్టికలో చూపలేదు.

శాసనసభ (1962-1967)

మొత్తం సభ్యులు-300.

| క్ర. సం. | పార్టీ పేరు | మార్చి 1962 | 1962-63 | 1964-65 | నవంబరు 1966 |
|---|---|---|---|---|---|
| 1. | కాంగ్రెస్ | 177 | 176 | 210 | 215 |
| 2. | సి. పి. ఐ. | 51 | 56 | 31 | 1 |
| 3. | సి.పి.ఐ.(మార్కిస్టు) | — | — | 22 | — |
| 4. | సోషలిస్టుపార్టీ | 2 | — | — | — |
| 5. | స్వతంత్రపార్టీ | 19 | 17 | 17 | 4 |
| 6. | ఐక్యడెమోక్రాటిక్ ఫ్రంట్ | — | 25 | — | — |
| 7. | జాతీయడెమోక్రాటిక్ గ్రూప్ | — | 1 | 7 | 3 |
| 8 | ఇండిపెండెంట్స్ | | | | |
| | ఇతరులు | 51 | 17 | 13 | 2 |
| | మొత్తం | 300 | 300 | 300 | 300 |

నామినేటెడ్ సభ్యుని ఈ పట్టికలో చూపలేదు.

శాసనసభ (1967-1972)

మొత్తం సభ్యులు 287

| క్ర. సం. | పార్టీపేర్లు | ఫిబ్రవరి 1967 | ఆగస్టు 1970 | మార్చి 1971 | డిసెంబరు 1971 |
|---|---|---|---|---|---|
| 1. | కాంగ్రెస్ | 165 | 176 | 182 | 230 |
| 2. | స్వతంత్ర | 29 | 19 | 16 | 10 |
| 3. | సి. పి. ఐ. | 11 | 14 | 10 | 12 |
| 4. | కమ్యూనిస్టులు (మార్కిస్ట్) | 9 | 8 | 7 | 5 |
| 5. | తెలంగాణా యునైటెడ్ ఫ్రంట్ (తదుపరి తెలంగాణా ప్రజాసమితి | — | 29 | 26 | — |
| 6. | రిపబ్లికన్ పార్టీఆఫ్ ఇండియా | 1 | 2 | 2 | 2 |
| 7. | సంయుక్తసోషలిస్టుపార్టీ | 1 | 1 | 1 | 1 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 8. | జనసంఘ్ | 3 | 3 | 3 | 3 |
| 9. | కాంగ్రెస్ (ఐ) | — | 14 | 13 | — |
| 10. | జనకాంగ్రెస్ | — | 7 | — | — |
| 11. | పీపుల్స్ డెమోక్రాటిక్ పార్టీ | — | 4 | 3 | — |
| 12. | ఇండిపెండెంట్లు ఇతరులు | 68 | 10 | 15 | 8 |
| 13. | ఖాళీలు | — | 4 | 9 | 14 |
| | మొత్తం | 287 | 287 | 287 | 287 |

నామినేట్ అయిన సభ్యుని ఈ పట్టికలో చేర్చలేదు.

శాసనసభ (1972-1978)

మొత్తం సభ్యులు-287

| క్ర.సం. | పార్టీ | ఫిబ్రవరి 1972 | సెప్టెంబర్ 1972 | ఫిబ్రవరి 1974 | మే 1975 | నవంబర్ 1976 | ఏప్రిల్ 1977 |
|---|---|---|---|---|---|---|---|
| 1. | కాంగ్రెస్ | 219 | 218 | 214 | 242 | 242 | 243 |
| 2. | సి.పి.ఐ. | 7 | 8 | 8 | 8 | 8 | 8 |
| 3. | సి.పి.ఐ. (మార్క్సిస్టు) | 1 | 1 | 1 | 1 | 1 | 1 |
| 4. | స్వతంత్ర | 2 | — | — | — | — | — |
| 5. | సోషలిస్టు డెమోక్రాటిక్ ఫ్రంట్ | — | 11 | 11 | 6 | 4 | — |
| 6. | ఆంధ్రప్రదేశ్ ప్రోగ్రెసివ్ డెమోక్రాట్లు | — | 8 | 8 | 7 | 7 | — |
| 7. | ప్రోగ్రెసివ్ ఫ్రంట్ | — | 7 | 7 | 6 | 6 | — |
| 8. | పీపుల్స్ డెమోక్రాట్లు | — | 6 | 6 | 3 | 3 | — |
| 9. | ఇండిపెండెంట్లు ఇతరులు | 58 | 26 | 24 | 13 | 12 | 2 |
| 10. | జనతాఫ్రంట్ | — | — | — | — | — | 27 |
| 11. | ఖాళీలు | — | 2 | 8 | 1 | 4 | 6 |
| | మొత్తం | 287 | 287 | 287 | 287 | 287 | 287 |

నామినేట్ అయిన సభ్యుని ఈ పట్టికలో చూపలేదు.

## శాసనసభ (1978)

మొత్తం 294 సభ్యులు : (నామినేటెడ్ సభ్యుడు మినహా)

| క్రమ సం. | పార్టీ | ఫిబ్రవరి 1978 | ఏప్రిల్ 1978 |
|---|---|---|---|
| 1. | కాంగ్రెస్ | 30 | 15 |
| 2. | కాంగ్రెస్ (ఐ) | 175 | 194 |
| 3. | జనతాపార్టీ | 60 | 60 |
| 4. | సి. పి. ఐ. | 6 | 6 |
| 5. | సి. పి. ఐ (మార్క్సిస్టు) | 8 | 7 |
| 6. | మజ్లిస్ | 3 | 3 |
| 7. | ఇండిపెండెంట్లు ఇతరులు | 12 | 8 |
| 8. | ఖాళీలు | — | 1 |
| | మొత్తం | 294 | 294 |

శాసనసభకు 1978 లో ఎన్నికలు జరిగినప్పుడు జనతా పార్టీకి 60 స్థానాలు, భారత జాతీయ కాంగ్రెసుకు 15 స్థానాలు, భారత కమ్యూనిస్టుపార్టీకి 6 స్థానాలు; మార్క్సిస్టు పార్టీకి 7 స్థానాలు, మజ్లిస్‌కు 3 స్థానాలు లభించినాయి. స్వతంత్రులుగా 6 గురు గెలిచినారు. మార్క్సిస్టు లెనినిస్టు పార్టీకి ఒక్క స్థానం రాగా గవర్నర్ ఆంగ్లో-ఇండియన్ ప్రతినిధిగా మెట్రోనస్ ను నామినేట్ చేసినారు. ప్రధాన ప్రతిపక్షంగా జనతాపార్టీని గుర్తించి ఆ పార్టీ నాయకుడు గౌతులచ్చన్నకు మంత్రిహోదాలో ప్రధాన ప్రతిపక్ష నాయకునిగా గుర్తింపు ఇచ్చినారు. అయితే జాతీయ స్థాయిలో జనతాపార్టీ చీలిపోవటంతో శాసనసభలో కూడా జనతాపార్టీ చీలిపోయింది. ప్రధాన ప్రతిపక్ష స్థానానికి ఉండవలసిన 31 మంది కనీససంఖ్య ఏపక్షానికీ లేకుండా పోయింది. భారత జాతీయ కాంగ్రెస్ శాసనసభాపక్షానికి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి నాయకుడుగా నియమితులైనారు. కాని ఆ పార్టీలోని శాసన సభ్యులంతా ఏకమొత్తంగా కాంగ్రెసు-ఐ లో చేరిపోవటం వల్ల శాసనసభలో చివరకు ఒక్కరు కూడా మిగలలేదు. ఒక సభ్యుడు స్వతంత్రుడుగా ఉన్నాడు. సి.పి.ఐ (యం) నాయకునిగా సి.హెచ్. రాజేశ్వరరావు ఉన్నారు. జనతాపార్టీ నాయకుడుగా జయపాల్ రెడ్డి, లోక్‌దళ్ నాయకుడుగా గౌతులచ్చన్న, భారతీయ జనతాపార్టీ నాయకుడుగా ఎం. వెంకయ్యనాయుడు ఉన్నారు. జనతా, ఇండిపెండెంట్లు భారత జాతీయ కాంగ్రెస్ పక్షాన ఎన్నికైనవారితో చాలామంది కాంగ్రెస్-ఐ లో చేరటం వల్ల ఆపార్టీ సంఖ్య 1981 అక్టోబరు నాటికి 260 వరకూ పెరిగింది. శాసన సభలో సభ్యులు పార్టీ మారినప్పుడు స్పీకరుకు తెలియ పరుస్తారు. చేరిన పార్టీలో స్థానాన్ని కేటాయిస్తూ స్పీకరు ఆ విషయాన్ని సభకు తెలియ జేస్తారు

శాసన సభలో సభ్యుడుగాని వ్యక్తి కూడా మంత్రి కావచ్చు. అట్లా అయినప్పుడు ఆరు మాసాలలోగా ఏదో ఒక స్థానం నుంచి ఎన్నికై రావలసి ఉంటుంది. శాసన మండలి సభ్యుడు మంత్రి అయితే శాసన సభ లో అతనికి ఓటు హక్కు ఉండదు.

## శాసన మండలి

1958 లో రాష్ట్రశాసన మండలి ఏర్పడింది. ఇందులో సభ్యులను శాసన సభనుంచి, ఉపాధ్యాయ నియోజక వర్గాలనుంచి, స్థానిక సంస్థలనుంచి పట్టభద్రులనుంచి ఎన్నుకొంటారు. అవిగాక, గవర్నర్ కొందరిని నామినేట్ చేస్తారు. మొత్తం 90 మంది ఉన్న శాసనమండలిలో 30 మందిని శాసనసభ ఎన్నుకొంటుంది. 30 మందిని స్థానిక సంస్థలు ఎన్నుకొంటాయి. మొత్తం సభ్యులలో 12 వ వంతు ఉపాధ్యాయులు, మరో 12 వ వంతు పట్టభద్రులు ఎన్నుకొంటారు. గవర్నర్ మొత్తం సభ్యులలో 6వ వంతు నామినేట్ చేస్తారు. విధాన పరిషత్తు బడ్జెటును, ఆర్థిక వ్యవహారాలను తప్ప మిగిలిన అన్ని విషయాలలో శాసనసభవలె చర్చలు జరిపి నిర్ణయాలు తీసుకొంటుంది. శాసనసభ ఆమోదించిన బిల్లును, తీర్మానాన్ని శాసనమండలి కూడా ఆమోదించవలసి ఉంది. నిరాకరించవచ్చుకూడ. అప్పుడు శాసనసభ ఆ విషయాన్ని మళ్ళీ పరిశీలించి శాసనమండలి సూచించినట్లు మార్పులు చేసి పంపవచ్చు. లేదా శాసనమండలి నిర్ణయాన్ని తృణీకరించనూవచ్చు. రెండుసార్లు ఇట్లా జరిగిన తరవాత శాసనసభ నిర్ణయమే తుది నిర్ణయం అవుతుంది. శాసనమండలి మార్పులనూ, చేర్పులనూ సూచిస్తూ బిల్లులను తీర్మానాలను శాసనసభకు పంపించవచ్చు. ఏ బిల్లునుగానీ, తీర్మానాన్నిగానీ ముందుగా శాసనమండలిలో కూడా ప్రవేశపెట్టి, తరవాత శాసనసభకు పంపవచ్చు. శాసనమండలి సభ్యులకు శాసనసభ సభ్యులవలె సౌకర్యాలు, జీతభత్యాలు ఉన్నాయి. ఉభయసభల నుంచి సభ్యులను వివిధ కమిటీలలో నియమిస్తారు. శాసనమండలి సమావేశాలు, శాసనసభతో పోలిస్తే తక్కువ రోజులు ఉంటాయి. శాసనమండలి సభానిర్వహణకు చైర్మన్‌ను ఎన్నుకొంటుంది. అట్లాగే వైస్-చైర్మన్‌ను కూడా. ఇందలి సభ్యులలో 3వ వంతు ప్రతినిధులు రెండేళ్ళకొక పర్యాయం రిటైర వుతుఉంటారు.

## శాసనసభలు పనిచేసేతీరు

సర్వసాధారణంగా ఉభయ సభలలోనూ ఒక గంటసేపు ప్రశ్నోత్తరాల సమయం ప్రారంభదశలో ఉంటుంది. సభ్యులు లిఖిత పూర్వకంగా స్పీకరుకు ప్రశ్నలను పంపిస్తారు. వాటి ప్రాధాన్యాన్ని, ఔచిత్యాన్ని పరిశీలించి ఆమోదించిన వాటిని స్పీకరు ఆయామంత్రులకు పంపిస్తారు. కొన్ని ప్రశ్నలనుస్పీకరు

నిరాకరిస్తూంటారు. మరికొన్నిటికి సభాముఖంగా కాక, సభ్యుడికి లిఖిత పూర్వకంగా సమాధానం అందజేయవలసిందని కోరవచ్చు. సమాధానాలు అందిన తరవాత ఏరోజు సభలలో వాటిని అనుమతించేదీ స్పీకరు నిర్ణయిస్తారు. సభ్యులు వేసిన ప్రశ్నలకు మంత్రులు సమాధానాలు చెబుతారు. ఈ సమాధానాలు చెప్పిన తరవాత అనుబంధ ప్రశ్నలకు అవకాశం ఇస్తారు. చాలా సందర్భాలలో ఈ అనుబంధ ప్రశ్నల ద్వారానే ఎన్నో విషయాలు బయటపడుతూంటాయి. వివాదాస్పదమైన విషయాలు వచ్చినపుడు ప్రశ్నలూ, సమాధానాలూ సంతృప్తిపరచలేనప్పుడు స్పీకరు ప్రత్యేక చర్చా సమయాన్ని కేటాయిస్తూంటారుకూడా. ఒక మంత్రి బదులు ఇంకొక మంత్రి సమాధానం ఇవ్వడం వల్ల అనుబంధ ప్రశ్నలు వచ్చినపుడు చిక్కు ఏర్పడుతుంది. అనుబంధ ప్రశ్నలు ఎట్లాంటివి రాగలవో ఊహించి అందుకు తగిన సమాధానం చెప్పటానికి వీలుగా ఆయా శాఖలవారు సమాచారాన్ని ముందే మంత్రులకు సమకూర్చుతారు. అయినప్పటికీ అనూహ్యమైన పరిణామాలకు దారితీయటం, మంత్రులు వ్యవధికోరటం, ప్రశ్నను వాయిదా వేయటం, పూర్తి సమాచారం కోసం మరొక తేదీ నిర్ణయించటం, జరుగుతుంది. కొన్ని సందర్భాలలో సమాధానం చెప్పటానికి మంత్రినిరాకరించవచ్చు. లేక మౌనం వహించవచ్చు. అప్పుడు స్పీకరుకూడా మరో ప్రశ్నకు పోవలసిందే తప్ప, సమాధానం చెప్పి తీరవలసిందేనని ఆదేశించలేరు. అనుబంధ ప్రశ్నలు వేయడానికి ప్రశ్న వేసిన సభ్యునికే తొలి అవకాశం ఇస్తారు. తరవాత స్పీకరు తగిన విచక్షణ నుపయోగించి సభ్యులను అనుమతిస్తారు. ప్రశ్నోత్తరాల సమయం ప్రతిరోజూ ఒక గంటసేపు ఉంటుంది. తరవాత వాయిదాపడిన ప్రశ్నలు, స్వల్ప వ్యవధి ప్రశ్నలు స్వీకరిస్తారు. తరవాత వాయిదా తీర్మానాలు, అత్యవసర విషయాలపై సభాదృష్టికి తెచ్చే విషయాలూ స్వీకరిస్తారు. ఏవైనా విపరీత సంఘటనలు జరిగినప్పుడు వాటిని గురించి చర్చించడానికి వీలుగా సభాకార్యక్రమాన్ని వాయిదా వేయవలెనని సభ్యులు కోరుతుంటారు. దీనిపై స్పీకరు నిర్ణయమే తుదినిర్ణయము. స్పీకరు నిర్ణయాన్ని ప్రశ్నించే హక్కు సభ్యులకు లేదు. సభాకార్యక్రమాలలో క్రమం తప్పినట్లు స్పీకరు దృష్టికి తీసుకురావచ్చు. దానిపై కూడా స్పీకరు తన నిర్ణయాన్ని ప్రకటిస్తారు. మంత్రుల సమాధానాలు సంతృప్తికరంగా లేనపుడు, సభ్యులు అడిగిన వాటికి మంత్రులంగీకరించనప్పుడు, స్పీకరు నిర్ణయం తమకు అనుకూలంగా లేనప్పుడు నిరసన తెలియజేసే నిమిత్తం సభ్యులు సభనుంచి బయటకు వెళ్ళిపోతూంటారు. ప్రతిపక్ష సభ్యులు ఎక్కువగా ఇట్లా బయటకు పోవటం కద్దు. ఎప్పుడోగాని అధికారపక్ష సభ్యులు వాకౌట్ చేయరు. సభలో వాగ్వివాదం చెలరేగినప్పుడు సభ్యులు దూషణలకు దిగినప్పుడు, స్పీకరు హెచ్చరిక చేసినా పరిస్థితి అదుపులోనికి రానప్పుడు, సభను వాయిదా వేయటం అనేక పర్యాయాలు జరిగింది. అభ్యంతరకరమైన మాటలను రికార్డునుండి స్పీకరు తొలగించవచ్చు.

తరువాత సాధారణ తీర్మానాలు సభ్యులు ప్రవేశపెట్టినప్పుడు అందుకు సంబంధించిన మంత్రి ఒక ప్రకటన చేస్తారు. దీనిపై చర్చను ఆమోదించరు. తరవాత ప్రభుత్వం ప్రవేశపెట్టే బిల్లులు, మంత్రుల వివరణ, సభ్యుల చర్చ ఉంటుంది. వారానికి ఒకరోజు అనధికార సభ్యుల చర్చకు కేటాయిస్తారు. సాధారణంగా ఆ రోజు సభ్యులు తీర్మానాలను ప్రవేశపెడుతూంటారు. బిల్లులపై ఓటింగు వచ్చినప్పుడు, అవిశ్వాసతీర్మానం ఓటింగుకు వచ్చినప్పుడు, సభ్యులందరూ సభలో విధిగా ఉండవలెనని ఆయా పార్టీలకు సంబంధించిన 'విప్'లు ఉత్తరువులు జారీ చేస్తూంటారు. అయితే ఇది పార్టీకి సంబంధించిన వ్యవహారమేగాని, శాసనసభకు సంబంధించింది కాదు. సభ్యులు తప్పనిసరిగా హాజరు కావలెనని స్పీకరు ఆదేశించరు. కాని సభానిర్వహణకు 'కోరం' ఉండవలె. బిల్లులపై చర్చ జరిగేటప్పుడు కోరం లేకుంటే గంట కొట్టి సభ్యులను పిలుస్తూంటారు. సభలో జరిగే కార్యకలాపాలన్నిటినీ పూర్తిగా రికార్డుచేస్తారు. తరవాత వాటిని ఆయా సభ్యులకు పంపి వారి అనుమతి పొంది అచ్చువేస్తారు. ఉభయ శాసన సభలలోనూ కార్యకలాపాలు ఇంచుమించు ఒకేవిధంగా ఉంటాయి.

## శాసనసభల సంఘాలు

ఉభయ శాసన సభలకు సంబంధించి తొమ్మిది సంఘాలు ఉమ్మడిగా ఏర్పరుస్తారు. ఇవి:

1. అంచనాల సంఘము
2. పబ్లిక్ అకౌంట్స్ సంఘము
3. ప్రభుత్వ సంస్థల సంఘము
4. సబార్డినేట్ లెజిస్లేషన్ సంఘము
5. హరిజన సంక్షేమ సంఘము
6. గిరిజన సంక్షేమ సంఘము
7. వెనుకబడిన తరగతుల సంక్షేమ సంఘము
8. గ్రంథాలయ సంఘము
9. సౌకర్యాల సంఘము

ఇవిగాక శాసనసభకు, శాసనమండలికి విడివిడిగా ఐదు సంఘాలుంటాయి. అవి:

1. సభా కార్యక్రమాల సలహా సంఘం
2. నిబంధనల సంఘము
3. ప్రభుత్వ హామీల పరిశీలన సంఘము
4. హక్కుల పరిశీలన సంఘము
5. దరఖాస్తుల పరిశీలన సంఘము

అంచనాల సంఘానికి శాసనసభనుంచి 15 మంది, శాసనమండలినుంచి

ఐదుగురు ఎన్నికయిన సభ్యులుంటారు. దీనికి అధ్యక్షుణ్ణి స్పీకరు నామినేట్ చేస్తారు. పబ్లిక్ అకౌంట్సు పబ్లిక్ అండర్ టేకింగ్సు కమిటీల విషయంలోనూ ఇదే పద్ధతి ఉంటుంది. మిగిలిన సంఘాలన్నిటికీ సభాధ్యక్షులే సభ్యులను నామినేట్ చేస్తారు. సంప్రదాయానుసారంగా ఎస్టిమేట్స్ కమిటీకి, పబ్లిక్ అకౌంట్స్ కమిటీకి ప్రతిపక్షంలోని వారిని అధ్యక్షులుగా నామినేట్ చేస్తారు. ఈ సంఘాలు రాష్ట్రంలోనూ, అవసరమైతే, ఇతర రాష్ట్రాలలోనూ పర్యటించటం, తరచు సమావేశం కావటం, తరవాత నివేదికల్ని తయారుచేసి ఉభయ సభలకు సమర్పించటం జరుగుతుంటుంది. మంత్రులు ఈ సంఘాలలో సభ్యులుగా ఉండరు. అన్ని సంఘాలకు కూడా కార్యదర్శిగా శాసనసభల సచివాలయ కార్యదర్శి ఉంటారు.

నమూనాగా ఒకనాటి విధానసభ, విధానపరిషత్తు పనిచేసిన విషయాలు తెలుసుకోవడానికిగాను ఒకటి, రెండు అనుబంధాల్ని పరిశీలించవచ్చు.

## శాసనసభల సంఘాలు

విధానసభ, విధాన పరిషత్తు స్థూలంగా చర్చలు చేసి శాసనాలు చేస్తుండగా చాలా విషయాలు మిగిలిపోతుంటాయి. ఉభయ శాసన సభలకు అనేక విషయాలను సునిశితంగా పరిశీలించేటంత సమయంలేనందువల్ల ఆయా సంఘాలను నియమించి వాటిద్వారా చర్చలు చేయడం, పనులు సాగించటం జరుగుతుంది. మన రాష్ట్రంలో అటువంటి సంఘాలు తొమ్మిది ఉన్నాయి. ఇవిగాక విధానసభకు విడిగా ఐదుసంఘాలూ, విధానపరిషత్తుకు ౬ సంఘాలూ ఉన్నాయి. ఈ సంఘాలు రెండు విధాలు. స్థాయీ సంఘాలు, తాత్కాలిక సంఘాలు. స్థాయీసంఘాలను స్పీకరు, లేదా చైర్మన్ నియమిస్తారు. ఈ సంఘాలు చేయవలసిన పనులను స్పష్టంగా సూచిస్తారు. హక్కులు, విజ్ఞప్తులు పరిశీలించడం, శాసనసభల వ్యవహారాలకు సలహాలివ్వటం అనధికార సభ్యుల బిల్లులపై పరిశీలన చేయటం, నిబంధనలు ఏర్పరచటం, సభ్యులు సభకు హాజరుకాని విషయాలు పరిశీలించటం, సభ్యుల సౌకర్యాలు, జీతభత్యాలు, సభలో ఇచ్చే హామీలు పరిశీలించడం, ప్రభుత్వ సంస్థలు నిర్వహించే తీరు గమనించటం, హరిజన, గిరిజన వెనకబడిన తరగతుల సంక్షేమాన్ని చూడటం ఇత్యాది విషయాలకోసం స్థాయీ సంఘాలు ఏర్పరుస్తారు. మన రాష్ట్రంలో ఉభయ సభలకు సంబంధించిన తొమ్మిది సంఘాలూ ఇవి:

1. అంచనాల సంఘము
2. ప్రభుత్వ ఆదాయ, వ్యయవ్యవహారాల సంఘము
3. ప్రభుత్వ సంస్థల పరిశీలన సంఘము
4. సబార్డినేట్ లెజిస్లేషన్ సంఘము
5. హరిజన సంక్షేమ సంఘము
6. గిరిజన సంక్షేమ సంఘము

7. వెనకబడిన్న తరగతుల సంక్షేమ సంఘము
8. గ్రంథాలయ సంఘము
9. సౌకర్యాల సంఘము

ఈ సంఘాలను ఒక సంవత్సరం పాటు నియమిస్తారు. ఆ సంవత్సరంలో సభ్యులు తాము పరిశీలించి, పర్యటించి, గమనించిన విషయాలను ఉభయ సభలకు నివేదిక సమర్పిస్తారు. ఈ విధంగా ప్రతి సంవత్సరమూ కొత్త సంఘాన్ని ఏర్పరుస్తుంటారు.

విధానసభకు ఉన్న ఐదు తాత్కాలిక సంఘాలు ఇవి :

1. సభావ్యవహారాల సలహా సంఘము
2. నిబంధనల సంఘము
3. ప్రభుత్వ హామీల సంఘము
4. హక్కుల సంఘము
5. విజ్ఞప్తుల సంఘము

విధాన పరిషత్తులో ఇదే విధంగా ఐదు సంఘాలు ఉంటాయి.

***1. అంచనాల సంఘము :***

ప్రతి సంవత్సరం అంచనాల సంఘం ఏర్పడగానే ఏడాదిలో తాము పరిశీలించవలసిన శాఖలేవో నిర్ధారిస్తారు. అన్ని శాఖలనూ పరిశీలించటం సాధ్యం కాదు కనక, సమయం చాలదు గనక, కొన్ని శాఖలను మాత్రమే సాధారణంగా స్వీకరిస్తూ ఉంటారు. పరిశీలించదలచిన శాఖ సమాచారాన్ని ఆయా శాఖాధిపతులు సంఘానికి అందించవలసి ఉంటుంది. ఎటువంటి సమాచారాన్నయినా, ఆ శాఖనుంచి ఈ సంఘం అడిగి స్వీకరించవచ్చు. ఆయా శాఖలలోని అధికారులను పిలిచి విషయాలు అడిగి తెలుసుకోవచ్చు. సాక్ష్యాలు స్వీకరించవచ్చు. సర్వ సాధారణంగా ఆయా శాఖలలోని ఉద్యోగులు తాము చేసిన పనులను సమర్థించుకోవటం, విపులీకరించటం జరుగుతుంటుంది. అంచనాల సంఘంవారు ప్రత్యక్షంగా విషయాలను తెలుసుకొనే నిమిత్తం పర్యటనలు చేస్తూ ఉంటారు. అవసరమైతే ప్రత్యేక నివేదికలు సమర్పిస్తుంటారు. అంచనాల సంఘం సమర్పించే నివేదికను విధానసభగానీ, విధాన పరిషత్తుగానీ చర్చించవు. అయితే నివేదికలో సూచించిన సిఫారసులను విధిగా ఆమోదించవలెనని కూడా ఏమీ లేదు. సర్వ సాధారణంగా సిఫారసులను అమలు పరచటానికి ప్రభుత్వం ప్రయత్నిస్తూంటుంది. ప్రభుత్వ విధానాలలో పెద్దమార్పులు చేయవలసి వచ్చినప్పుడు మాత్రం అమలు పరచటానికి ఆటంకాలు ఏర్పడవచ్చు.

ఈ సంఘాన్ని 1981 ఏప్రిల్ 1 న ఏర్పరచినారు. ఒక సంవత్సరంపాటు ఈ సంఘ కాల పరిమితి ఉంటుంది. మొత్తం 20 మంది సభ్యులలోనూ అత్యధిక సంఖ్యాకులు అధికారపక్షంవారు కాగా, ప్రతిపక్షాలనుంచి కూడా సభ్యులు ఉండటాన్ని గమనించవచ్చు. ప్రతి సంఘంలోనూ ఇదే విధంగా అన్ని పార్టీల

నుంచి, ఇండిపెండెంట్లనుంచీ సభ్యులను ఆయా సంఘాలలో స్వీకరిస్తూంటారు. అంచనాల సంఘంలో అధ్యక్షుణ్ణి స్పీకర్ నియమిస్తారు. విధానసభ నుంచి 15 మంది, విధాన పరిషత్తునుంచి 5 గురు ఈ సంఘానికి ఎన్నికవుతారు.

*2. పబ్లిక్ అకౌంట్స్ కమిటీ*

ప్రస్తుతం ఈ కమిటీ 1981 ఏప్రిల్ 1న మార్క్సిస్టు సభ్యుడు ఎం. ఓంకార్ అధ్యక్షతన ఏర్పడి పని చేస్తున్నది. దీని కాలపరిమితి కూడా ఒక సంవత్సరమే.

ఈ సంఘానికి ప్రతిపక్ష సభ్యుడు అధ్యక్షుడుగా ఉండటం గమనార్హం. శాసన సభకు కంట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ నివేదిక అందిన వెంటనే ఈ సంఘ సభ్యులకు నివేదిక ప్రతులు ఇస్తారు. తదనుగుణంగా ఈ సంఘం సంవత్సరంలో చేయవలసిన కార్యక్రమాలను రూపొందిస్తుంది. కమిటీ నిర్ణయించిన అనంతరం ఆయా శాఖలకు పరిశీలక అంశాలను తెలియపరుస్తారు. ఈ సంఘానికి ఎకౌంటెంట్ జనరల్ ఎప్పటికప్పుడు తోడ్పడుతుంటారు. అవసరమయితే ఈ సంఘంవారు ఆయా శాఖల ఉద్యోగులను పిలిచి సాక్ష్యం సేకరించటం, పర్యటనలు చేయడం, సిఫారసులను వివిధ శాఖలకు పంపించటం జరుగుతుంటుంది. ఈ సంఘం చేసే సిఫారసులను సర్వసాధారణంగా ప్రభుత్వం అమలుపరుస్తుంటుంది. ఏ మేరకు సిఫారసులను అమలు పరచిందీ శాసనసభకు తెలియపరుస్తుంటారు. ఈ సంఘంలోని 20 మంది సభ్యులలో 15 మంది విధానసభ నుంచి 5 గురు విధాన పరిషత్తునుంచీ ఎంపిక కాగా అధ్యక్షుణ్ణి స్పీకరు నామినేట్ చేస్తారు. ఈ సంఘ సిఫారసులు ప్రభుత్వం అమలు పరచలేకపోతే అందుకు కారణాలను తెలియపరుస్తుంది. సర్వసాధారణంగా ఆయా శాఖలు చేసే అవకతవకలను ఈ సంఘం చూపుతుంది. ఈ సంఘానికీ, ప్రభుత్వానికీ అభిప్రాయ భేదాలు తీవ్రంగా ఉన్నప్పుడు, తుది నిర్ణయం తీసుకొనే బాధ్యత విధాన సభదే.

*3. ప్రభుత్వ సంస్థల పరిశీలన సంఘము*

ప్రభుత్వ యాజమాన్యాన నిర్వహిస్తున్న సంఘాలను పరిశీలించడానికి ఉభయ శాసన సభలనుంచీ 20 మందితో కూడిన సంఘాన్ని ఎన్నుకుంటారు. ఇందులో 15 మంది విధానసభనుంచీ, 5 గురు విధాన పరిషత్తునుంచీ ఎన్నికవుతారు. అధ్యక్షుణ్ణి మాత్రం స్పీకరు నామినేట్ చేస్తారు. ప్రస్తుతం పని చేస్తున్న పబ్లిక్ అండర్ టేకింగ్స్ కమిటీ 1981 ఏప్రిల్‌లో ఏర్పడింది.

ఈ సంఘం వారు సంవత్సరంలో ఏ ఏ సంస్థలను పరిశీలించవలెనో నిర్ణయించుకొంటారు. అందుకుగాను తగిన సమాచారాన్ని ముందుగా తెప్పించుకొంటారు. తదనుగుణంగా తనిఖీ చేయవలసిన తీరు, అడిగి తెలుసుకోవలసిన విషయాలు నిర్ధారిస్తారు. ప్రశ్నావళిని ఆయా శాఖలకు, సంస్థలకు పంపిస్తారు.

సమాచారాన్ని పరిశీలిస్తారు. అవసరమైతే సభ్యులనుంచి, స్వచ్ఛంద సంస్థల నుంచి కూడా విషయ సేకరణ చేస్తారు. ఆయా సంస్థలు పనిచేసే తీరును ప్రత్యక్షంగా వెళ్ళి పరిశీలిస్తారు. కార్మిక సంఘ ప్రతినిధులను కలుసుకొంటారు. అయితే వ్యక్తిగతమైన వ్యవహారాలనూ, కలహాలనూ ఈ సంఘం పరిశీలించదు. అకౌంటెంటు జనరల్ సహాయాన్ని కూడా వీరు స్వీకరిస్తారు. నివేదికల్ని శాసన సభలకు సమర్పించిన తరువాత సిఫారసులను అమలుపరచే నిమిత్తం ఆయా శాఖలకు పంపి అనుసరింపచేస్తారు. దీనిపై తీసుకొన్న చర్య గూర్చి తెలుసుకొంటారు.

### 4. సబార్డినేట్ లెజిస్లేషన్ సంఘము

ఉభయ శాసనసభలు శాసనాలు చేసిన తరువాత వాటిని అమలు పరచేట్టానికి పాలకవర్గానికి తోడ్పడే నిమిత్తం నియమ నిబంధనలు రూపొందించవలసి ఉంటుంది. శాసన సభ ఆమోదించిన చట్టాన్ని తగిన విధంగా అమలుపరచే బాధ్యత పాలక వర్గానిది. ఈ విధంగా రూపొందించిన నియమ నిబంధనావళి శాసనం భావించిన తీరులో ఉందా లేదా, సంక్రమింపజేసిన అధికారాలను సక్రమంగా అమలు పరుస్తున్నారా లేదా అని పరిశీలించడానికి సబార్డినేట్ లెజిస్లేషన్ సంఘాన్ని ఏర్పరుస్తారు. ఈ సంఘంలోని సభ్యులందరూ ఉభయ శాసనసభ అధ్యక్షులచే నియమింపబడతారు. సంఘాధ్యక్షుడు కూడా స్పీకరుచే నియమితుడైన వాడే. 1981 ఏప్రిల్‌లో సబార్డినేషన్ లెజిస్లేటివ్ కమిటీ ఏర్పడింది. ఉభయ శాసనసభలు ఏ ఉద్దేశంతో శాసనాలను చేసినాయో వాటికి అనుగుణంగా నిబంధనలు ఉన్నాయో లేదో అని చూడవలసిన బాధ్యత ఈ సంఘంపై ఉన్నందువల్ల దీనికి అత్యంత ప్రాధాన్యం ఉంది. ఈ సంఘం కాల పరిమితి కూడా ఒక సంవత్సరం మాత్రమే.

### 5. హరిజన సంక్షేమ సంఘము

రాష్ట్ర ప్రభుత్వం హరిజనుల సంక్షేమ నిమిత్తం చేపట్టిన వివిధ కార్యక్రమాలు అమలు జరిగే తీరుతెన్నులను పరిశీలించి లోపాలను చూపడం కోసం ఈ సంఘాన్ని ఉద్దేశించినారు. ఈ సంఘానికి సభ్యులను ఉభయ సభాధ్యక్షులు నియమిస్తారు. రాజ్యాంగ నిబంధనలను అనుసరించి హరిజనులకు కేటాయించిన స్థానాలు, ఉద్యోగాలు వారికి సక్రమంగా దక్కుతున్నాయో లేదో ఈ సంఘం పరిశీలిస్తుంది.

### 6. గిరిజన సంక్షేమ సంఘం

15 మంది సభ్యులతో 1981 ఏప్రిల్ 8న ఈ సంఘాన్ని ఏర్పరచినారు.

గిరిజనులకు తలపెట్టిన సౌకర్యాలు, కేటాయించిన ఉద్యోగాలు వారికి లభిస్తున్నాయా లేదా, రాజ్యాంగ పరంగా ఇచ్చిన రక్షణలు క్షేమేరకు అమలు జరుగుతున్నాయి అనేది ఈ సంఘం పరిశీలిస్తుంది.

## 7. వెనకబడిన తరగతుల సంక్షేమ సంఘము

1981 ఏప్రిల్ 9 న ఈ సంఘం ఏర్పడింది. రాజ్యాంగపరంగా ప్రభుత్వం తయారుచేసిన వెనకబడిన తరగతుల జాబితా ప్రకారం ఉద్యోగాల్లో న్యాయ సౌకర్యాలలో సూక్త కేటాయింపులు ఏమేరకు అమలు జరుగుతున్నాయో సంక్షేమ పథకాలు వెనకబడిన తరగతుల వారికి ఎంతవరకు తోడ్పడుతున్నాయో వీరు పరిశీలిస్తారు.

సంక్షేమ సంఘాలు కూడా ఒక సంవత్సర కాల పరిమితితో పని చేస్తాయి. ఇతర రాష్ట్రాలలో సంక్షేమ కార్యక్రమాలు అమలు జరిగే తీరు తెన్నులు తెలుసుకొనే నిమిత్తం వీరు పర్యటన చేస్తారు. రాష్ట్రంలో కూడా ఆయా ప్రాంతాలు పర్యటిస్తారు. ఈ సంఘాల నివేదికలు శాసన సభలకు సమర్పిస్తారు.

## 8. గ్రంథాలయ సంఘము

ఉభయ శాసన సభల సభ్యులకు అవసరమైన సమాచారాన్ని అందించడానికి, వివిధ విషయాలపై గ్రంథాలను పరిశీలించడానికి ఒక గ్రంథాలయాన్ని ఏర్పరచినారు. ఈ గ్రంథాలయాన్ని సంపూర్ణంగా అభివృద్ధి చేయడానికి తగిన సూచనలివ్వడానికి గ్రంథాలయ సంఘాన్ని ఏర్పరచినారు. ఇది కూడా ప్రతి సంవత్సరం ఏర్పరుస్తుంటారు.

## 9. సభ్యుల సౌకర్యాల సంఘము

ఉభయ శాసన సభ సభ్యులకు గృహవసతి, ఆహారం, వైద్య సౌకర్యాలు, ప్రయాణ సదుపాయాలు ఇత్యాదులను పరిశీలించి మెరుగుపరచడానికి తగిన సూచనలు ఇవ్వడానికి ఒక సంఘాన్ని ఏర్పరచినారు. ఇంతర సంఘాలలో వలె కాక ఈ సంఘానికి మంత్రి సర్వసాధారణంగా అధ్యక్షులుగా ఉంటారు.

## 10. జాయింట్ సెలక్టు కమిటీ

ఏదైనా ఒక బిల్లు సమగ్రంగా పరిశీలించి ప్రజాభిప్రాయం సేకరించి ఆ తరవాత శాసన సభలలో ప్రవేశపెట్టవలెనని అనుకొన్నప్పుడు అందుకు నిమిత్తం ఉభయ సభల నుంచి ఒక సంఘాన్ని ఏర్పరుస్తారు. లోగడ సమగ్ర విద్యా బిల్లును జాయింట్ సెలక్టు కమిటీకి నివేదించినారు. ప్రస్తుతం మంత్రులపైన ఏవైనా ఆరోపణలు వచ్చినప్పుడు వాటిని విచారించి చర్య తీసుకోవటానికి, అట్లాగే ఉన్నతాధికారులూ, తదితరులపై కూడా అవినీతి ఆరోపణలు విచారణ జరిపి, రుజువైతే చర్య తీసుకోవటానికి ఉపకరించే బిల్లును రాష్ట్ర ప్రభుత్వం

ప్రవేశ పెట్టింది. దీనిని లోకాయుక్త, ఉపలోకాయుక్త బిల్లు అంటారు. ఈ బిల్లును తుణ్ణంగా పరిశీలించి, తిరిగి శాసనసభకు తేవటానికి వీలుగా జాయింట్ సెలక్టు కమిటీని ఏర్పరచినారు. ఈ సంఘం అనేక పర్యాయాలు సమావేశమైన తరవాత ప్రతిపక్ష సభ్యులకూ అధికారపక్ష సభ్యులకూ అభిప్రాయ భేదాలు వచ్చినాయి. బిల్లు పరిధిలో ముఖ్యమంత్రిని కూడా చేర్చవలెనని ప్రతిపక్ష సభ్యులు పట్టుబట్టినారు. అధికారపక్ష సభ్యులు అందుకు అంగీకరించలేదు. జాయింట్ సెలక్టు కమిటీ ఈ బిల్లుపై నివేదిక సమర్పించిన తరవాత ఆ సంఘం పని పూర్తి అయినట్టే. మళ్ళీ అవసరమైనప్పుడు మరొక సంఘాన్ని ఏర్పరుస్తారు.

విధానసభనుంచి 5 సంఘాలు, విధాన పరిషత్తునుంచి 5 సంఘాలు విడివిడిగా ఏర్పరుస్తారు. ఈ సంఘాలు ఆయా సభలకు పరిమితం కనుక ఇట్లా విడిగా ఏర్పరచటం జరుగుతుంది.

### 11. సభాకార్యక్రమాల సలహా సంఘము

సభా కార్యక్రమాలు ఎట్లా జరగవలె, అవసరమైతే నిబంధనలు ఎట్లా సవరించవలె, ఏ విషయానికి ఎంతసేపు, ఎన్నాళ్ళు చర్చకు అవకాశం ఉండవలె, సభా కార్యక్రమాన్ని పొడిగించవలెనా, లేదా మొదలైన అంశాలను ఈ సంఘాలు వివరంగా పరిశీలించి నిర్ణయాలు తీసుకొంటాయి. సర్వసాధారణంగా అన్ని పార్టీల నుంచి ఈ సంఘాలలో సభ్యత్వం, ప్రాతినిధ్యం ఉంటుంది గనక ఈ సంఘ నిర్ణయాలను సభ గౌరవిస్తుంది. ఇవి తాత్కాలికంగా ఏర్పరచే సంఘాలు మాత్రమే.

విధాన సభలో స్పీకరు, విధాన పరిషత్తులో అధ్యక్షుడు ఈ సంఘ సభ్యులను నియమిస్తారు.

### 12. నిబంధనల కమిటీ

ఉభయ సభలలోనూ స్పీకర్, అధ్యక్షుడు ఈ సంఘాన్ని నియమిస్తారు. సభా నిర్వహణకు సంబంధించిన నియమావళిలో మార్పులు, చేర్పులు సూచించే నిమిత్తం ఈ సంఘాలను ఉద్దేశించినారు. స్పీకరు అధ్యక్షుడుగా విధానసభలో ఈ సంఘం పని చేస్తుంది.

### 13. హక్కుల సంఘము

సభ్యుల హక్కులు భంగపడినప్పుడు ఆయా సభ్యులు సభాధ్యక్షుని దృష్టికి ఆ విషయాన్ని తీసుకొని వస్తూంటారు. సభలో అప్పటికప్పుడే ఈ విషయం నిర్ణయించటం సాధ్యం కాకపోవచ్చు. కనక సభ్యుని హక్కుకు భంగం కలిగిందా లేదా అనే విషయాన్ని పరిశీలించి నిర్ధారించే నిమిత్తం హక్కుల సంఘాన్ని ఏర్పాటుస్తారు. సభాధ్యక్షుడు సభ్యుల హక్కులకు భంగం కలిగిందని భావించినప్పుడు, లేదా ఆ విషయాన్ని పరిశీలించవలసిన అవసరం ఉందని అను

కొన్నప్పుడు సభ్యుడు తెచ్చిన ప్రస్తావనను హక్కుల సంఘానికి నివేదిస్తారు. సంఘం విషయాన్ని పరిశీలించదగిన సిఫారసు చేస్తుంది.

*14*. *విజ్ఞప్తుల సంఘము*

ప్రభుత్వానికి అనేక విధాలైన విజ్ఞప్తులను వివిధ సంఘాలు, పార్టీలు, ప్రజలు సమర్పిస్తుంటారు. అట్లాగే శాసన సభలకు కూడా అనేక విజ్ఞప్తులు సభాధ్యక్షుని ద్వారా సమర్పించటం జరుగుతుంది. ఈ విజ్ఞప్తులను పరిశీలించ టానికి సభకు సమయం చాలదు. కనక ఇందు నిమిత్తం ఉభయ సభలు కూడా విడిగా విజ్ఞప్తుల సంఘాలను నియమిస్తారు. శాసన సభలో డిప్యూటి స్పీకరు, విధాన పరిషత్తు డిప్యూటి ఛైర్మన్, ఈ సంఘానికి అధ్యక్షులుగా ఉంటారు.

*15*. *ప్రభుత్వ హామీల పరిశీలక సంఘము*

ఉభయ శాసన సభలలోనూ అనేక సందర్భాలలో సభ్యులడిగిన ప్రశ్న లకు సమాధానంగా మంత్రులు హామీలనిస్తుంటారు. చర్చల సందర్భంలో కూడా ఇటువంటి హామీలను ఇవ్వడం ఉంది. ఇచ్చిన హామీలు ఎంతవరకు అమలు జరుగుతున్నదీ పరిశీలించి, సభకు నివేదించడానికి ఉభయ సభలలోనూ విడివిడిగా సభాధ్యక్షుడు సంఘాన్ని నియమిస్తారు.

## ఆంధ్రప్రదేశ్ విధానసభ

**ఒక రోజు కార్యక్రమ పట్టిక**

**1981 సం. నవంబరు 16 వ తేదీ సోమవారం-ఉదయం 8-30 గంటలకు**

శక. సం. 1903 కార్తీకం 25 వ రోజు

* తొమ్మిదవ సమావేశపు తొమ్మిదవరోజు *

**I ప్రశ్నోత్తరాలు :**

* నక్షత్రం గుర్తుగల ప్రశ్నల, స్వల్పవ్యవధి ప్రశ్నలజాబితాలు వేరుగా అందజేయడం జరిగింది.

* నక్షత్రంగుర్తులేని ప్రశ్నల జాబితా సమాధానాలతో సహా సభా సమక్షంలో పెట్టడం జరిగింది.

**II అత్యవసర ప్రజాప్రాముఖ్యంగల విషయాలను ప్రభుత్వ దృష్టికి తేవడం :**

1. శ్రీ సి. హెచ్. రాజేశ్వరరావు, శ్రీ పూల సుబ్బయ్య, శ్రీ కె. గోవిందరావుగారలు ఆర్.టి.సి. ఉద్యోగులు తలపెట్టిన సమ్మెదృష్ట్యా వారి ఉద్యోగ నిబంధనలను గురించి రవాణాశాఖామాత్యుల దృష్టికి తెచ్చినారు.

2. డాక్టర్ ఎస్. చంద్రమౌళి, వరిపంట పొలాలలో తెగుళ్ళు సోకటం, ప్రబలడాన్ని గురించి రైతులకు క్రిమిసంహారక ఔషధాలను సరఫరా చేయక పోవటాన్ని గురించి వ్యవసాయ శాఖామాత్యుల దృష్టికి తెచ్చినారు.

3. శ్రీ ఎం. ఓంకార్, శ్రీ కె. సత్యనారాయణ, శ్రీమతి ఎం. స్వరాజ్యంగారలు, హైదరాబాదు, హిందుస్థాన్ స్టీల్ వర్క్స్ కనస్ట్రక్షన్ లిమిటెడ్‌లో పనివారి తొలగింపును గురించి కార్మిక పౌరసరఫరాల శాఖామాత్యుల దృష్టికి తెచ్చినారు.

III సభాసమక్షంలో ఉంచవలసిన పత్రాలు :

1. వాణిజ్య పన్నుల, ఖాదీ, గ్రామపరిశ్రమల శాఖామాత్యులు శ్రీ ఎం. మాణిక్‌రావు ఆంధ్రప్రదేశ్ సాధారణ అమ్మకాలపన్ను నియమావళిని సవరిస్తూ రెవెన్యూశాఖవారి 25-8-1981 తేదీగల జి.ఓ.ఎం.ఎస్. నెం. 1346 తో జారీ చేసిన నోటిఫికేషన్ ప్రతిని 1957 సం. ఆంధ్రప్రదేశ్ సాధారణ అమ్మకాలపన్ను చట్టంలోని 3914 సెక్షన్ కింద ఉంచవలసినవిధంగా సభాసమక్షంలో ఉంచినారు.

2. వాణిజ్యపన్నుల ఖాదీ గ్రామపరిశ్రమల శాఖామాత్యులు శ్రీ ఎం. మాణిక్‌రావు, ఆంధ్రప్రదేశ్ సాధారణ అమ్మకాలపన్ను నియమావళిని సవరిస్తూ రెవెన్యూశాఖవారి 27-8-1981 తేదీగల జి.ఓ.ఎం.ఎస్. నెం. 1366 తో జారీ చేసిన నోటిఫికేషన్ ప్రతిని 1957 సం. ఆంధ్రప్రదేశ్ సాధారణ అమ్మకాలపన్ను చట్టంలోని 39 (4) సెక్షన్ కింద ఉంచవలసిన విధంగా సభాసమక్షంలో ఉంచినారు.

3. విద్యాశాఖామాత్యులు శ్రీ బి. వెంకటరామరెడ్డి 1966 సం. ఆంధ్రప్రదేశ్ అధికార భాషా చట్టంలోని 5 (1) సెక్షను కింద జారీ చేసిన సాధారణ పరిపాలన (ఓ.ఎల్.ఐ) శాఖ వారి 4-8-1981 తేదీగల జి.ఓ.ఎం.ఎస్. నెం. 409 ప్రతిని సదరు చట్టంలోని 8 (2) సెక్షన్ ప్రకారం సభాసమక్షంలో ఉంచినారు.

4. విద్యాశాఖాఖామాత్యులు శ్రీ బి. వెంకటరామరెడ్డి, 17-9-1981 తేదీగల ఆంధ్రప్రదేశ్ గెజిటు అసాధారణ సంచిక 1 వ భాగంలో ప్రచురితమైన, విద్యాశాఖవారి 17-9-1981 తేదీగల జి ఓ.ఎం.ఎస్. నెం. 1066 ప్రతిని భారత సంవిధానంలోని 371-డి పరిచ్ఛేదపు (6) ఖండం కింద అవసరమైన విధంగా సభాసమక్షంలో ఉంచినారు.

5. కార్మిక, పౌరసరఫరాల శాఖామాత్యులు శ్రీ జి. వెంకటస్వామి, 1979 సం. ఆంధ్రప్రదేశ్ ముఠా, జట్టు, హామీల ఇతర కాయకష్టపు పనివారల (ఉపాధి, క్రమబద్ధీకరణ, సంక్షేమ) పథకం ఖండాలను విస్తరింపజేసే కార్మిక, ఉపాధికల్పన, పౌష్టికాహారం, సాంకేతిక విద్య(కార్మిక-) శాఖవారి 21-8-1981 తేదీగల జి.ఓ.ఎం.ఎస్. నెం. 590 ప్రతిని 1976 సం. ఆంధ్రప్రదేశ్ ముఠా, జట్టు, హమాలి ఇతర కాయకష్టపు పనివారు (ఉపాధి క్రమబద్ధీకరణ, సంక్షేమ) చట్టంలోని 28 వ సెక్షన్నుయొక్క (2) సబ్ సెక్షను కింద అవసరమైన విధంగా సభాసమక్షంలో ఉంచినారు.

IV సభాసమక్షంలో ఉంచవలసిన పత్రాలు :

1. మార్కెటింగు, గిడ్డంగుల తూకాలు కొలతల శాఖామాత్యులు శ్రీ సి. హెచ్. హనుమయ్య ది. 28-4-1981 న 7846 నెం. (నక్షత్రంగుర్తు) ఎల్.ఎ.క్వ్యా. పై అనుబంధ ప్రశ్నలకు సమాధానమిస్తూ ఇచ్చిన హామీ ననుస రించి గోదాములున్న, అవి నిర్మాణంలో ఉన్న ప్రదేశాలను తెలిపే వివరణ పత్రం ప్రతిని సభాసమక్షంలో పెట్టినారు.

2. చేనేత జౌళిపరిశ్రమల శాఖామాత్యులు శ్రీ జి. నాగేశ్వరరావు, 2-4-1981 తేదీన 7947 నెం.(నక్షత్రంగుర్తు) ఎల్.ఎ.క్వ్యా.కు సమాధానమిస్తూ ఇచ్చిన హామీలననుసరించి అపెక్స్ సంఘానికి అనుబంధితమైన ప్రాథమిక ఉన్ని, నేత పనివారి సహకార సంఘాల పేర్లను తెలిపే వివరణ పత్రాన్ని సభకు సమర్పించినారు.

V 1981-82 సం. వ్యయానికి మొదటివిడత అనుబంధ అంచనాల సమర్పణ:

ఆర్థిక శాఖామాత్యులు శ్రీ కె. ప్రభాకర రెడ్డి, 1981-82 సం. పు వ్యయానికి మొదటివిడత అనుబంధ అంచనాలను సమర్పించినారు.

VI 1975-76 సం.నికి అదనపు గ్రాంట్లకోసం అభ్యర్థనల సమర్పణ :

ఆర్థిక శాఖామాత్యులు శ్రీ కె. ప్రభాకర రెడ్డి 1975-76 సం.నికి అద నపు గ్రాంట్లకోసం అభ్యర్థనలను సమర్పించినారు.

VII స్వల్పకాలిక చర్చ :

రాష్ట్రంలో శాంతిభద్రతల పరిస్థితిపై స్వల్పకాలిక చర్చ.

VIII అర్ధగంట చర్చ

విశాఖపట్నం ఉక్కు కర్మాగారానికి సంబంధించి ది. 11-11-1981 న సమాధానం ఇచ్చిన 8635 ఎం.ఎల్.ఎ. క్వ్యానుంచి ఉత్పన్నమయ్యే చర్చ.

హైదరాబాదు ఇ. సదాశివరెడ్డి
తేది. 13-11-1981 విధానమండలి కార్యదర్శి

## ఆంధ్రప్రదేశ్ విధాన సభ

1981 వ సం॥ నవంబర్ 16 వ తేదీ (దుర్మతి నామ సం॥ 1903 కార్తీక 5) సోమవారం ప్రత్యక్షంగా అడిగిన ప్రశ్నల జాబితా.

సాంకేతిక విద్యా జాయింటు డైరెక్టర్ల పదవులను భర్తీచేయకపోవడం :

71

* 8577 శ్రీ పీళం సన్యాసినాయుడు

సాంకేతికవిద్య భారతీయవైద్య శాఖామాత్యులు దయచేసి ఈ క్రింది

విషయాలు తెలుపుతారా!

(అ) ప్రభుత్వ పాలిటెక్నిక్‌ల ప్రిన్సిపాల్‌లకు దాదాపు పదిహేను సంవత్సరాలు లేదా అంతకంటె ఎక్కువ కాలం ఉద్యోగానుభవం ఉన్నప్పటికీ వారి ఏకీకృత సీనియారిటీ తుది పట్టిక ఇప్పటివరకు ప్రచురితంకాని విషయం వాస్తవమేనా!

(ఆ) సాంకేతిక విద్యా జాయింటు డైరక్టరు పదవులు ఎన్ని ఖాళీగా ఉన్నాయి, అందరిలోకి సీనియరు పాలిటెక్నిక్ ప్రిన్సిపాల్‌లకు ప్రమోషను ఇవ్వడం ద్వారా ఆ ఖాళీలను భర్తీ చేయకుండటానికిగల కారణాలేవి?

రాయలసీమలో హోమియోపతి వైద్య కళాశాలను ప్రారంభించడం.

72 -

* 8749 - శ్రీ ఎ. వెంకటేశ్వర్లు

సాంకేతిక విద్య, భారతీయ వైద్య శాఖామాత్యులు దయచేసి ఈ కింది విషయాలు తెలుపుతారా!

(అ) రాయలసీమ ప్రాంతంలో ఒక హోమియోపతి వైద్య కళాశాలను ప్రారంభించడానికి ప్రభుత్వం నిర్ణయించిన విషయం వాస్తవమేనా?

(ఆ) అయితే, అది ఎప్పుడు, ఎక్కడ ప్రారంభిస్తారు?

(ఇ) హోమియోపతిలో పోస్టుగ్రాడ్యుయేట్ తరగతులను ప్రారంభించడానికి ప్రభుత్వం ఆలోచిస్తున్న విషయం కూడా వాస్తవమేనా?

వైద్యడిగ్రీ కోర్సుల కాలపరిమితిని పెంచడం.

73 -

* 8568 - శ్రీ ఎ. మోహన్‌రెడ్డి:

ఆరోగ్య వైద్య శాఖామాత్యులు దయచేసి ఈ కింది విషయాలు తెలుపుతారా!

(అ) ఐదున్నర సంవత్సరాల వైద్య డిగ్రీ కోర్సులో, పిల్లల జబ్బుల గురించి మూడు మాసాల కోర్సును పెంచవలెనని ప్రభుత్వం యోచిస్తున్నదా?

(ఆ) దేశంలో డాక్టరును సందర్శించే రోగులలో 45 శాతం పిల్లలేనన్న విషయం వాస్తవమేనా?

రాష్ట్ర ప్రభుత్వోద్యోగుల కనీస పింఛనును పెంచడం

74 -

* 8581 - సర్వశ్రీ ఎం. ఓంకార్ - యస్. రాఘవరెడ్డి, శ్రీ నరిమల్లు

స్వరాజ్యం : - ఆర్థిక శాఖామాత్యులు దయచేసి ఈ కింది విషయాలు తెలుపుతారా!

(అ) తమిళనాడులోని ప్రభుత్వోద్యోగికి కనీస పింఛను నెలకు 250/-రూ. కేంద్ర ప్రభుత్వోద్యోగికి నెలకు 245/- రూ. 55 శాతం కరువుభత్యం కాగా

మన రాష్ట్రంలో పింఛనుదారుకు కనీసపింఛను నెలకు 100/- రూ., 15 శాతం కరువుభత్యం ఇస్తున్న విషయం వాస్తవమేనా ?

(ఆ) అయితే, ఆ తేడాలకు గల కారణాలు ఏవి?

(ఇ) పింఛనుదారులు దాని పెంపుదలకు విజ్ఞప్తి చేసుకొన్న విషయం వాస్తవమేనా ?

(ఈ) అయితే, దానిమీద తీసుకొన్న చర్య ఏమిటి?

**తెలుగు పండితులు లేని ప్రాథమికోన్నత పాఠశాలలు**

75 -

* 8034 - (ప్) సర్వశ్రీ యన్. యస్. యన్. రెడ్డి, యం. వెంకయ్యా నాయుడు :

విద్యాశాఖామాత్యులు దయచేసి ఈ క్రింది విషయాలు తెలుపుతారా!

(అ) రాష్ట్రంలో తెలుగు పండితులు లేని ప్రాథమికోన్నత పాఠశాల లెన్ని ?

(ఆ) 1979 - 80 వరకు, గుర్తింపు పొందిన పాఠశాలలలో తెలుగు పండితుల, ఇతర ఉపాధ్యాయుల పదవులు వరుసగా 5 సంవత్సరాలు ప్రభుత్వ సహాయం లేకుండానే కొనసాగితే, వాటంతటవే ఆ పదవులు ప్రభుత్వ సహాయం కోసం అనుమతింపబడుచుండిన విషయం వాస్తవమేనా ?

(ఇ) 1980 - 81 నుంచి సదరు పదవులు ప్రభుత్వ సహాయం కోసం అనుమతింపబడని విషయం కూడా వాస్తవమేనా ?

(ఈ) ప్రభుత్వం అవసరమైన నిబంధన చేసి, యథాపూర్వ స్థితిని కొనసాగిస్తుందా ?

**బహదూర్‌పురాలోని నూనె మిల్లుపై నిఘా విభాగం దాడి**

76 -

* 8655 - సర్వశ్రీ సి. హెచ్. రాజేశ్వరరావు, పూల సుబ్బయ్యా, డి. చిన మల్లయ్యా : —

కార్మిక పౌర సరఫరాల శాఖామాత్యులు దయచేసి ఈ క్రింది విషయాలు తెలుపుతారా !

(అ) 1981 సం॥ జూన్ 21 వ తేదీన హైదరాబాదులోని బహదూర్ పురా ప్రాంతంలోని నూనె మిల్లుపై నిఘా విభాగం దాడి చేసిన విషయం వాస్తవమేనా?

(ఆ) జగదీష్ నూనె మిల్లుపై కూడా దాడి చేసినారా ?

(ఇ) ప్రజలకు పంపకం చేయవలసిన పామోలిన్ నూనె ఎంత స్వాధీనం చేసుకోవడం జరిగింది, ఎంత అనధికారంగా అమ్మడం జరిగింది ?

(ఈ) దానిపై ప్రభుత్వం తీసుకున్న చర్య ఏమిటి ?

ఉన్నిని కొనుగోలు చేయడంలో దళారీలు

77 -

* 8167 - శ్రీ యం. అయ్యరాములు :- చేనేత జౌళి శాఖామాత్యులు దయచేసి ఈ కింది విషయాలు తెలుపుతారా ?

(అ) దళారీలు గొర్రెల పెంపకందారుల వద్దనుంచి ఉన్నిని చౌక ధరకు, ఉన్ని పారిశ్రామికులకు అమ్ముతున్న విషయం వాస్తవమేనా?

(ఆ) గొర్రెల పెంపకం దార్లను, పారిశ్రామికులను దళారీల నుంచి రక్షించడానికి ఏదైనా ప్రతిపాదన ఉన్నదా ?

మెదక్ జిల్లాలోని కేంద్ర సహకార బాంకులోని బాంకు అధికారుల అవకతవకలు

78 -

* 8044 - (కె) - సర్వశ్రీ సి. జంగారెడ్డి, యన్. యస్. యన్. రెడ్డి : సహకార శాఖామాత్యులు దయచేసి ఈ కింది విషయాలు తెలుపుతారా ?

(అ) మెదక్ జిల్లా కేంద్ర సహకార బాంకు అధికారులు చేసిన అవకతవకలను గురించిన ప్రతి, సదరు బాంకు కార్మిక సంఘం నుంచి (30-1-1981 తేదీగల ఆర్.సి. నెం. 2/81 చూడుడు) సహకార శాఖామాత్యులకు, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగారికి, ఆహార వ్యవసాయశాఖ ప్రభుత్వ కార్యదర్శికి అందినదా ?

(ఆ) దీనిమీద ప్రభుత్వం తీసుకొన్న చర్య ఏమిటి ?

వీరంకి గ్రామంలో శ్రీ నాగేశ్వరస్వామి దేవాలయ ఆవరణలో కళ్యాణ మండపం నిర్మాణము

79 -

* 8618 — శ్రీ వి. శోభనాద్రీశ్వరరావు :- దేవాదాయ శాఖామాత్యులు దయచేసి ఈ కింది విషయాలు తెలుపుతారా ?

(అ) కృష్ణాజిల్లా, ఉయ్యూరు తాలూకా వీరంకి గ్రామంలోని శ్రీ నాగేశ్వరస్వామి, శ్రీ ఆంజనేయస్వామి దేవాలయ ఆవరణలో కళ్యాణమండపాన్ని నిర్మించడానికి తిరుమల తిరుపతి దేవస్థానం 15 వేల రూపాయలను మంజూరు చేసిన విషయం వాస్తవమేనా ?

(ఆ) పని నిర్వహణ కోసం మానేజింగ్ ట్రస్టీకి విడుదల చేసిన ఏడు వేల ఆయిదువందల రూపాయలు, 150 బస్తాల సిమెంటును అతడు దుర్వినియోగం చేసిన విషయం కూడా వాస్తవమేనా ?

(ఇ) అయితే, ఆ మానేజింగ్ ట్రస్టీపై తీసుకొన్న చర్య ఏమిటి?

దుగ్గిరాల మార్కెటు యార్డులోని వర్తకుల ఇబ్బందులు

80 -

* 8815 - శ్రీ జి. మల్లికార్జునరావు : - మార్కెటింగు శాఖామాత్యులు దయచేసి ఈ కింది విషయాలు తెలుపుతారా !

(అ) దుగ్గిరాల మార్కెటు యార్డులోని వర్తకులు కొన్ని ఇబ్బందుల వల్ల పసుపును కొనుగోలు చేయడానికి నిరాకరించిన విషయం వాస్తవమేనా?

(ఆ) ఆ ఇబ్బందులను తొలగించడానికి ప్రభుత్వం తీసుకొన్న చర్య లేవి ?

(ఇ) ప్రస్తుతం వర్తకులు పసుపును కొనుగోలు చేస్తున్నారా?

(ఈ) లేనిచో, ఈ విషయంలో ప్రభుత్వం తీసుకొన్న చర్యలేవి?

ఇ. సదాశివరెడ్డి,
విధానమండలి కార్యదర్శి

## 11 వ సమావేశం, 1981

ప్రశ్న నెం. 8577 శ్రీ వీసం సన్యాసినాయుడు ఎం.ఎల్.ఏ.

గౌరవనీయులైన సాంకేతిక విద్యాశాఖ మంత్రిగారు దయచేసి ఈ కింది సమాచారం తెలియజేస్తారా?

ఎ) 15 సంవత్సరాలు లేదా అంతకంటే ఎక్కువ సర్వీసు పూర్తిచేసిన రాష్ట్రంలోని ప్రభుత్వ పాలిటెక్నిక్కుల ప్రిన్సిపాళ్ళ ఏకీకృత సీనియారిటి జాబితా ఇప్పటివరకు ప్రచురించిన మాట నిజమేనా?

బి) సాంకేతిక విద్యాశాఖ జాయింటు డైరెక్టరు ప్రిన్సిపాళ్ళను ప్రమోటుచేసి భర్తీ చేయకపోవటానికి గల కారణాలేమిటి?

సమాధానం

ఎ) రాష్ట్రంలోని ప్రభుత్వ పాలిటెక్నిక్కుల ప్రిన్సిపాల్‌ల సీనియారిటీ జాబితా 1963 ఫిబ్రవరి వరకు క్రమబద్ధీకరించడం జరిగింది. ఆ తరవాత కొందరు ప్రిన్సిపాళ్ళు తమ సీనియారిటీని సవరించవలసిందిగా చేసుకొన్న విజ్ఞప్తులు అందినాయి. ఈ విషయం ప్రభుత్వ పరిశీలనలో ఉంది. ఈ విజ్ఞప్తులు పరిష్కరించిన వెంటనే ఏకీకృత సీనియారిటీ జాబితాను ఖరారుచేసి ప్రచురించడం జరుగుతుంది.

బి) ఒక జాయింటు డైరెక్టరు పదవి మాత్రమే 8-12-1980 తేదీ నుండి ఖాళీగా ఉంది. ప్రిన్సిపాళ్ళ సీనియారిటీ ఖరారు చేసిన వెంటనే దానిని భర్తీ చేయటం జరుగుతుంది.

(పై సమాధానం సాంకేతిక విద్య, భారతీయ వైద్యశాఖల మంత్రి శ్రీ టి. హయగ్రీవాచారిగారి ఆమోదం పొందింది)

ఎల్. ఎఫ్. ఎన్. టి. ఎఫ్ శాఖ యు. ఒ. నోటు నెం. 3240/టి.ఎఫ్ 2/81-2 తేదీ : 5-11-81.

ప్ర. నెం. 8749 శ్రీ ఎ. వెంకటేశ్వర్లు, ఎం. ఎల్. ఏ.

గౌరవనీయులైన భారతీయ వైద్య, హోమియోపతి శాఖ మంత్రిగారు దయచేసి ఈ కింది సమాచారాన్ని తెలియజేస్తారా?

ఎ) రాయలసీమ ప్రాంతంలో ఒక హోమియోపతిక్ కళాశాలను ప్రారంభించవలెనని ప్రభుత్వం నిర్ణయించిన మాట నిజమేనా?

బి) అయితే, ఎక్కడ ప్రారంభిస్తారు? ఎప్పుడు ప్రారంభిస్తారు?

సి) హోమియోపతిలో పోస్టుగ్రాడ్యుయేటు కోర్సులను ప్రారంభించే విషయాన్ని ప్రభుత్వం పరిశీలిస్తున్న మాటకూడా నిజమేనా?

సమాధానం

ఎ) అవునండి

బి) హోమియోపతి వైద్య కళాశాలను 1981-82లో కడపలో ప్రారంభిస్తారు.

సి) కాదండి.

(పై సమాధానం సాంకేతిక విద్య, భారతీయ వైద్యశాఖ మంత్రి శ్రీ టి. హయగ్రీవాచారిగారి ఆమోదం పొందింది.)

వైద్య, ఆరోగ్య యు. ఓ. నోటు నెం. 2719/ఆర్ 1/81-4, వైద్య ఆరోగ్య, తేదీ : 12-11-1981.

ప్రశ్న నెం. 8568 శ్రీ ఎ. మోహన్ రెడ్డి. ఎం. ఎల్. ఎ.

గౌరవనీయులైన వైద్య, ఆరోగ్యశాఖ మంత్రిగారు దయచేసి ఈక్రింది సమాచారం తెలియజేయస్తారా?

ఎ) పిల్లల వ్యాధుల కోర్సు నిమిత్తం ఐదున్నర సంవత్సరాల వైద్య డిగ్రీకోర్సును మరో మూడునెలలు పొడిగించవలెనని ప్రభుత్వం ఆలోచిస్తున్నదా?

బి) మనదేశంలో వైద్యపరీక్ష నిమిత్తండాక్టర్ల వద్దకు వెళ్లే 45శాతం మంది రోగులు పిల్లలు అన్నమాటమేనిజమేనా?

సమాధానం

ఎ) లేదండి.

బి) లేదండి.

(పై సమాధానం వైద్య ఆరోగ్యశాఖ మంత్రి శ్రీ ఎ. మదన మోహన్‌గారి ఆమోదం పొందింది.)

యు.ఓ. నోటు నెం. 2381/ఇ1/81-4 వై. ఆ. తేదీ 12-11-81.

9 వ సమావేశం

ప్రశ్న నెం. 8581 శ్రీ ఎం. ఓంకార్, ఎం. ఎల్. ఏ.
శ్రీ ఎన్. రాఘవరెడ్డి, ఎం. ఎల్. ఏ.
శ్రీమతి మల్లు స్వరాజ్యం, ఎం. ఎల్. ఏ.

గౌరవనీయులైన ఆర్థికశాఖమంత్రిగారు దయచేసి ఈదిగువ సమాచారం తెలియజేస్తారా.

ఎ) తమిళనాడు ప్రభుత్వోద్యోగి నెలకు రూ. 250 ల మేరకు కనీస

ఫించను, కేంద్రప్రభుత్వ ఉద్యోగి నెలకు రూ. 245 మేరకు కనీస పింఛను 55 శాతం కరువుభత్యం పొందుతుండగా మన రాష్ట్రంలోని పింఛనుదారు నెలకు రూ. 100 మేరకు కనీస పింఛను, 15 శాతం కరువుభత్యం మాత్రమే పొందు తున్న మాట నిజమేనా?

బి) అయితే ఈ తేడాకు కారణాలేమిటి?

సి) పింఛను పెంచవలసిందని పింఛనుదారులు విజ్ఞప్తి చేస్తున్న మాట నిజమేనా?

డి) అయితే దానిపై తీసుకున్న చర్య ఏమిటి?

**సమాధానం**

ఎ) లేదండి. తమిళనాడు ప్రభుత్వం నెలకు రూ. 100 కనీస పింఛను ఇవ్వగా, కేంద్రప్రభుత్వం నెలకు రూ. 60 కనీస పింఛను ఇస్తున్నది. కేంద్ర ప్రభుత్వం నెలకు రూ. 62.50 లు కనీస పరిమితికి రూ. 312.50 గరిష్ఠ పరి మితికి లోబడి పింఛనులో 62 1/2 శాతం మేరకు సహాయం అనుమతిస్తున్నది. 31-9-77 తేదీనగాని, ఆతరవాతగాని పదవీ విరమణచేసి జీతంలో కరువుభత్యం కలిపి సవరించిన జీతపు స్కేళ్ళ ప్రయోజనం పొందదలచిన ఉద్యోగుల విష యంలోను, 30-4-79 తేదీ తర్వాత పదవీవిరమణ చేసిన ఉద్యోగుల విషయం లోను నెలకు రూ. 42.50 ల కనీస పరిమితి, రూ. 212.50 గరిష్ఠ పరిమితికి లోబడి పింఛనులో 42 1/2 శాతం సహాయం అనుమతిస్తున్నది. కాగా మన రాష్ట్రంలో కనీస పింఛను నెలకు రూ. 100 లు. నెలకు రూ. 500 ల వరకు పింఛను పొందుతున్న వారికి పింఛనులో 25 శాతం, నెలకు రూ. 500 లకు పైగా పింఛను పొందుతున్న వారికి పింఛనులో 20 శాతం మేరకు రాష్ట్ర ప్రభుత్వం సహాయం అనుమతిస్తున్నది. కనక పింఛనులో 1-1-75 నుంచి 1-3-79 వరకు తాత్కాలికంగా పెంచిన మొత్తాలతో సహా 1-3-79 వరకు అప్పుడప్పుడు అనుమతించిన పైకాలు, మొట్టమొదట మంజూరు చేసిన పింఛను పైకం చేరి ఉంటాయి.

బి) ఈ విషయాలలో కేంద్రప్రభుత్వం, ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు ఒకే విధమైన విధానాన్ని అనుసరించవలసిన అగత్యం లేనందున కేంద్రప్రభు త్వం, రాష్ట్రప్రభుత్వాలు ఆయా అంశాలను, పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని స్వతంత్రంగా నిర్ణయాలు చేస్తాయి. మన రాష్ట్రంలో వేతన సవరణ కమిష నరు చేసిన సిఫారసులను అనుసరించాము. అందువల్ల ఈతేడా ఏర్పడింది.

సి) ఔనండి.

డి) రాష్ట్రప్రభుత్వం వేతన సవరణ కమిషనరు చేసిన సిఫారసులను అనుసరించింది. మన రాష్ట్రంలోని పింఛనుదారు మొత్తం వేతనం వగైరాలు కేంద్రప్రభుత్వం నుంచి లేదా తమిళనాడు ప్రభుత్వం నుంచి అందుకు సమా నంగా పింఛను పొందుతున్న వారికంటే చాలా ఎక్కువ. రాష్ట్ర ప్రభుత్వం

ప్రస్తుతానికి మళ్ళీ పింఛనులు సవరించాలని సంకల్పించడంలేదు.

(పై సమాధానాన్ని ఆర్థికమంత్రిగారు ఆమోదించారు.) యు.ఓ. నోటు. నెం. 36222/424/పింఛను 1/81-5 తేదీ: 10-11-1981.

8 వ సమావేశం

ప్రశ్న నెం. 8034-సి

శ్రీ ఎన్. ఎస్. ఎన్. రెడ్డి.
శ్రీ ఎం. వెంకయ్యనాయుడు ఎం.ఎల్.ఏలు.

గౌరవనీయులైన విద్యాశాఖ మంత్రిగారు దయచేసి ఈ కింది సమాచారం తెలియజేస్తారా?

ఎ) రాష్ట్రంలో తెలుగు పండితులు లేని అప్పర్ ప్రైమరీ పాఠశాలల సంఖ్య ఎంత?

బి) గుర్తింపు పొందిన పాఠశాలల్లోని తెలుగుపండితుల పదవులు, తదితర ఉపాధ్యాయుల పదవులు వరుసగా ఐదు సంవత్సరాల వరకు సహాయం పొందకుండా ఉన్నట్లయితే ఆ పదవుల నిమిత్తం 1979-80 వరకు సహాయం అనుమతించిన మాట నిజమేనా?

సి) ఆ పదవులకు 1980-81 నుంచి సహాయం అనుమతించలేదన్న మాటకూడా నిజమేనా?

డి) ప్రభుత్వం ఈ విషయంలో అవసరమయిన ఏర్పాటు చేసి సహాయం అందజేస్తుందా?

సమాధానం

ఎ) 2,346

బి) కాదండీ.

సి) కాదండీ.

డి) నిధులు అందుబాటులో ఉన్నప్పుడు పాఠశాలల్లకు సహాయం అనుమతించే విషయాన్ని ప్రభుత్వం పరిశీలిస్తుంది.

(పై సమాధానాన్ని విద్యాశాఖమంత్రి శ్రీ బి. వెంకట్రామరెడ్డిగారు ఆమోదించారు.)

విద్యా యు.ఓ. నెం. 1147/12/81-3 తేది 14-11-1981.

## ఆంధ్రప్రదేశ్ శాసన సభ

9 వ సమావేశం, 1981

ప్రశ్న నెం. 8665

శ్రీ సి.హెచ్. రాజేశ్వరరావు, ఎం.ఎల్.ఏ.
శ్రీ పూల సుబ్బయ్య, ఎం.ఎల్.ఏ.
శ్రీ డి. చిన్నమల్లయ్య, ఎం.ఎల్.ఏ.

గౌరవనీయులైన పౌర సరఫరాల శాఖమంత్రిగారు దయచేసి ఈ కింది సమాచారం తెలియజేస్తారా ?

ఎ) నిఘా విభాగం 1981, జూన్ 21 న హైదరాబాదు, బహదూర్ పురా ప్రాంతంలోని ఒక మిల్లుపై దాడి జరిపిన మాట నిజమేనా ?

బి) జగదీష్ ఆయిల్ మిల్లుపై కూడా దాడి జరిపారా ?

సి) ప్రజలకు సరఫరా చేయడానికి ఉద్దేశించిన పామోలిన్ ఆయిల్ ఎంత పరిమాణాన్ని స్వాధీనం చేసుకొన్నారు? అనధికారికంగా ఎంత ఆయిల్ అమ్మకమైంది ?

డి) దానిపై ప్రభుత్వం ఏమి చర్య తీసుకొన్నది ?

సమాధానం

ఎ) కాదండి.

బి) జగదీష్ ఆయిల్ మిల్లుపై 19-6-81 న దాడి జరిపినారు.

సి) ఆ సంస్థనుంచి 3,28,480 కే.జీ.ల ఆర్.బి.డి. పామోలిన్ ఆయిల్ స్వాధీనం చేసుకొన్నారు. 7 మంది చౌక ధరల దుకాణాల డీలర్లకు ఉద్దేశించిన 2,060 కే.జి.ల పామోలిన్ ఆయిల్‌ను అనధికారిక వ్యక్తులకు జారీ చేసినట్లు కనుగొనడమైంది.

డి) 1955, అవసర వస్తువుల చట్టం 6-ఎ విభాగం కింద హైదరాబాదు నగర కలెక్టరు గారికి ఒక నివేదిక సమర్పించడం జరిగింది. ఈ విషయంలో విచారణ జరిపి, హైదరాబాదు మిరాలమ్ చెరువు వద్దగల మెస్సర్స్ జగదీష్ ఆయిల్ మిల్ నుంచి పట్టుకున్న ఆయిల్‌ను ప్రభుత్వపరంగా జప్తుచేస్తూ ఉత్తరువులు జారీ చేయడానికి అది ఉద్దేశించబడింది. ఈ విషయంలో విచారణ జరుగుతున్నది.

(పై సమాధానం కార్మిక, పౌర సరఫరాల శాఖమంత్రిగారి ఆమోదం పొందింది.)

ఆహార, వ్యవసాయశాఖ యు.ఓ. నోటు నెం. 46767/పౌర సరఫరాలు 4/81-3, తేదీ 3-11-1981.

8 వ సమావేశం, 1981

ప్రశ్న నెం. 6167 (*) ఎం. జయరాములు, ఎం.ఎల్.ఏ.

గౌరవనీయులైన పశు సంవర్ధక శాఖమంత్రిగారు దయచేసి ఈ కింది సమాచారం తెలియజేస్తారా ?

ఎ) గొర్ల కాపరులనుంచి దళారీలు ఉన్నిని తక్కువ వెలకు కొనుగోలు చేసి, దానిని ఉన్ని పరిశ్రమలదార్లకు అధిక రేట్లకు అమ్ముతున్న విషయం నిజమేనా?

బి) దళారీలనుంచి గొర్ల కాపరులను, పరిశ్రమలదార్లను ఇద్దర్నీ కాపాడే ప్రతిపాదన ఏదైనా ఉన్నదా?

సమాధానం

ఎ) అవునండీ.

బి) గొర్ల కాపరుల సంక్షేమాన్ని చూచే నిమిత్తం రాష్ట్రంలో ఉన్ని వ్యవహారాల బోర్డును ఒకదాన్ని స్థాపించే ప్రతిపాదన ఉన్నది.

(పై సమాధానం మంత్రిగారి ఆమోదం పొందింది)
అటవీ గ్రా.అ.యు.ఓ. నోటు నెం. 47113/ఏను 3/81-2
తేది 10-11-81

ఆంధ్రప్రదేశ్ విధానసభ

తొమ్మిదవ సమావేశం

16-11-1981 వ తేదీన అడుగబడు స్వల్ప వ్యవధి ప్రశ్న
చెరకు ఉత్పత్తిదారులకు ప్రోత్సాహాలు

80 - ఎ

స్వల్ప వ్యవధి ప్రశ్న నెం. 8898-ఎఫ్. సర్వశ్రీ కె. గోవిందరావు, సి. హెచ్. రాజేశ్వరరావు, పూల సుబ్బయ్య, వి. శోభనాద్రీశ్వరరావు, పి. జనార్దనరెడ్డి, ఎస్. జైపాల్ రెడ్డి, కె. సత్యనారాయణ చక్కెర పరిశ్రమ శాఖామాత్యులు దయచేసి ఈ కింది విషయాలు తెలుపుతారా?

(అ) 1981-82 చెరకు ఆడించే కాలానికి చెరకుకు ఎంతధర నిర్ణయించడం జరిగింది?

(ఆ) మన రాష్ట్రంలోని చక్కెర ఫ్యాక్టరీలకు చెరకు సరఫరా చేసే చెరకు ఉత్పత్తిదారులకు ఎటువంటి ప్రోత్సాహం ఇవ్వడానికి సంకల్పించినారు?

హైదరాబాదు, ఇ. సదాశివరెడ్డి
తేదీ: 13-11-1981 విధానమండలి కార్యదర్శి

హిందుస్థాన్ స్టీల్ వర్క్స్ కన్‌స్ట్రక్షన్ మేనేజిమెంటు 100 మంది కార్మికులను పనిలోనుంచి తొలగించిన విషయానికి సంబంధించి శ్రీ ఎం.

ఓంకార్, శ్రీ కె. సత్యనారాయణ, శ్రీమతి మల్లు స్వరాజ్యం గారలు ఇచ్చిన సావధానపు నోటీసుపై 16-11-1981 తేదీన శాసన సభలో కార్మిక పౌర సరఫరాల శాఖమంత్రిగారు చేసే వివరణ.

హైదరాబాదులోని, హిందుస్తాన్ స్టీల్ వర్క్స్ కన్‌స్ట్రక్షన్ లిమిటెడ్ కేంద్ర ప్రభుత్వానికి చెందిన సంస్థ. ఇది కాంచనబాగ్‌లోని మిధాని సూపర్ అలాయ్ ప్రాజెక్టువద్ద చేపట్టిన నిర్మాణపు పని పూర్తయినదని తెలుపుతూ 28-3-81 తేదీన 100 మంది కార్మికులను పనిలోనుంచి తొలగించడం జరిగింది. హైదరాబాదు హిందూస్తాన్ స్టీల్ వర్క్స్ కన్‌స్ట్రక్షన్ లిమిటెడ్ ఉద్యోగుల యూనియను చేసిన విన్నపంపై ఈ విధానాన్ని కార్మికశాఖ అడిషనలు కమీషనరు స్వీకరించి దానిని పరిష్కరించే దృష్టిలో ఉభయ పక్షాల సమావేశాలు ఏర్పాటు చేసినారు.

హైదరాబాదులో పనిలోనుంచి తీసివేసిన కార్మికులను కార్పొరేషను పని చేపట్టే ఇతర స్థలాలలోను, ముఖ్యంగా కార్పొరేషను విశాఖపట్టణంలో చేపట్టిన నిర్మాణపు పనిలో చేర్చుకోవాలని యూనియను అడిగింది.

ఏదైనా ఒక స్థలంవద్ద పని పూర్తి అయిన వెంటనే అక్కడి కార్మికులను తమ అవసరాలనుబట్టి బదిలీ చేయదగిన పనివారిని ఒక యూనిటు నుంచి మరొక యూనిటుకు మార్చడం సాధారణంగా జరుగుతుందని మేనేజిమెంటు ప్రతినిధులు తెలియజేసినారు. బదిలీ చేయరాని వర్గానికి చెందిన వారిలో స్వీపర్లు, అటెండర్లు, వాచ్‌మను మొదలైన సామాన్య పనివారు చేరిఉంటారు వీరిని సాధారణంగా నిర్మాణం జరిగే ప్రాంతం నుంచే తీసుకొనడం జరుగుతుంది. బదిలీ చేయని వారితోసహా బదిలీ చేయడానికి వీలులేని వారిని శాసన ప్రకారం పనిలో నుంచి తొలగించి, అందుకు సంబంధించిన నష్ట పరిహారాన్ని చెల్లిస్తారు. విశాఖపట్టణంలో జరిగే పనిలో అవసరం ఏర్పడితే, తక్షణమే బదిలీ చేయగలిగిన పనివారిని హైదరాబాదు నుంచి పంపడం జరుగుతుందని కూడా వారు తెలియజేసినారు. అయితే బదిలీ చేయదగని వారిని హైదరాబాదులోనే పనినుంచి తొలగించడం జరుగుతుంది. అవసరమయితే వారిని విశాఖపట్టణంలో తిరిగి నియమించవచ్చు.

ఈలోగా పనిలోనుంచి తొలగించబడిన కార్మికులు పనిలో కొనసాగించవలసిందని కోరుతూ ఆంధ్రప్రదేశ్ హైకోర్టులో ఒక రిట్ పిటిషనును దాఖలు చేసినారు. దానిని తోసివేయడం జరిగింది.

కార్మికశాఖ అడిషనలు కమీషనరు 13-10-1981 తేదీన తిరిగి మేనేజిమెంటు ప్రతినిధులు, యూనియను ప్రతినిధులతో ఒక సమావేశాన్ని ఏర్పాటు చేసినారు. కానీ ఏ విధమైన పరిష్కారం కుదరలేదు. పనిలోనుంచి తొలగించదలచిన 100 మంది పనివారిలోనూ జూనియరు అసిస్టెంట్లు, డ్రైవర్లు, చేతిపనివారైన ఫిట్టర్లు, మెకానిక్కులు, స్వీపర్లు మొదలైనవారు ఉన్నారు. అడిష

నలు కమీషనరుగారి సలహాపై పారిశ్రామిక వివాదం రూపంలో 20-10-1981 తేదీన యూనియను ఒక దరఖాస్తును పంపింది. దీనిని అడిషనలు కమీషనరు గారు రాజీ కుదర్చడంకోసం స్వీకరించినారు. రాజీ సమావేశాలు 9-11-81, 13-11-1981 తేదీలలో జరిగినాయి.

కమీషనరు నుంచి రాజీ నివేదిక అందిన తరవాత ప్రభుత్వం తగిన చర్యను తీసుకుంటుంది.

జి. వెంకటస్వామి
కార్మిక, పౌరసరఫరాల శాఖమంత్రి

వరి పైరుకు దోమకాటు, కంకిపురుగువంటి జబ్బులు తగిలిన విషయంపై శాసనసభ నియమావళిలోని 74 వ నియమంకింద సభ్యుడు డాక్టర్ ఎస్. చంద్ర మౌళిగారు ఇచ్చిన నోటీసును పురస్కరించుకొని వ్యవసాయ శాఖమంత్రి శ్రీ సి.హెచ్. వెంకటరావుగారు చేసే వివరణ.

రాష్ట్రంలో 1981 ఖరీఫ్ కాలంలో పది జిల్లాలలో వరిపైరుకు దోమ కాటు తగిలినట్లు తెలియజేయడం జరిగింది. ఈ వ్యాధి పశ్చిమగోదావరి, తూర్పుగోదావరి, కృష్ణ, గుంటూరు జిల్లాలలో తీవ్రంగాను, నెల్లూరు, ఖమ్మం వరంగల్లు, నల్గొండ, నిజామాబాదు ఆదిలాబాదు జిల్లాలలో ఓ మాదిరిగాను వ్యాపించింది. మొత్తం 17.09 లక్షల ఎకరాల భూములలోని వరిపైరు ఈ వ్యాధికి గురి అయింది. కాని ఆర్థికపరంగా చూసినట్లయితే కనిష్ఠ పరిమితికిపైన వాస్తవంగా దెబ్బతిన్న ప్రాంతం 8.11 లక్షల ఎకరాలు. ఈ వ్యాధిని అరికట్ట డానికి వ్యవసాయ శాఖవారు యుద్ధ ప్రాతిపదిక మీద సకాలంలో చర్య తీసు కున్నారు. అంతేకాక అనేక సస్య రక్షణ పథకాల కింద సస్యరక్షణ మందులు, పరికరాలను సరఫరా చేసి మొత్తం 14.98 లక్షల ఎకరాలలోని వరి పైరుకు చికిత్స చేసినారు. క్రిమి సంహారక మందులు కొనుగోలు చేసే నిమిత్తం, ఈ వ్యాధికి గురిఅయిన జిల్లాలకు లాభనష్టాలు లేని ప్రాతిపదికకింద రూ. 55 లక్షలు కేటాయించినారు. అంతేకాక రుణాలుగా రూ. 27.92 లక్షలు, సబ్సిడీగా రూ. 47 లక్షలు కేటాయించినారు.

2. ఒక్కొక్క సమితి ప్రాంతానికి ఒక వ్యవసాయశాఖ అసిస్టెంటు డైరక్టరును కేటాయించినారు. రైతులకు సలహాలిచ్చే ఉద్యమాలను నిర్వహించడానికి ఇతర పథకాలలో పనిచేస్తున్న సిబ్బంది నందరిని సమీకరించినారు. రైతులలో ఒక విధమయిన చైతన్యాన్ని రేకెత్తించడం జరిగింది, మందులు మొదలయిన వాటిని ఎట్లా చల్లాలో ఆ పద్ధతులను వారికి కరపత్రాలు, వాల్ పోస్టర్లు, రేడియో ప్రకటనలు, దండోరా ద్వారా తెలియ చెప్పడం జరిగింది.

3. ఈ క్రిములను నిర్మూలించడానికి కావలసిన 4.835 మెట్రికు టన్నుల గ్రాన్యూల్సు, 291.995 మెట్రికు టన్నుల పొడి, 11817 లీటర్ల

ద్రవ పదార్థాన్ని వ్యవసాయశాఖ ద్వారా సరఫరా చేసినారు. అంతేకాక వీటిని ఆంధ్రప్రదేశ్ ఆగ్రో పరిశ్రమల అభివృద్ధి సంస్థ, మార్క్‌ఫెడ్, సహకార సంఘాలు వంటి ఇతర ఏజెన్సీలు, ప్రయివేట్ డీలర్ల ద్వారా కూడా అధిక మొత్తాలలో విరివిగా సరఫరా చేసినారు.

4. డెమ్సిమ్రట్, ఫోరేట్ వంటి గ్రాన్యుల్సు ఉత్పత్తి పరిమితంగా ఉన్నందు వల్ల మొదట వీటికి కొరత ఉండేది. అందువల్ల వీటిని ఇతర రాష్ట్రాలనుంచి తెప్పించడం జరిగింది. అంతేకాక ఈ దోమకాటు వ్యాధిని అరికట్టడానికి గాను ఇతర ప్రత్యామ్నాయ మందులను అత్యధిక మొత్తాల్లో అందుబాటులో ఉంచడం జరిగింది. ఈ క్రిమి సంహారక మందులను బ్లాకు మార్కెటులో ఎక్కువ ధరలకు అమ్ముతున్నట్లు ఎట్లాంటి ఫిర్యాదులు అందలేదు. నిర్దిష్ట మయిన సంఘటన ఏదయినా ప్రభుత్వ దృష్టికి తీసుకు వచ్చినట్లయితే చట్టరీత్యా చర్య తీసుకోవడం జరుగుతుంది.

5. కంకి పురుగు వ్యాధి గుంటూరు, కృష్ణా, పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి, నల్గొండ, ఆదిలాబాదు జిల్లాలలోను, ఖమ్మం వరంగల్లు వంటి ఇతర జిల్లాల్లో చెదురు మదురుగాను కనుగొనడం జరిగింది. ఈ వ్యాధికి మొత్తం 72,756 ఎకరాలు గురి అయింది. కాని ఆర్థికపరంగా చూస్తే కనిష్ఠ స్థాయికి పైన 30.255 ఎకరాలు దెబ్బ తిన్నాయి అనవచ్చు. వ్యవసాయ శాఖవారు 61, 564 ఎకరాల్లోని పైరుకు చికిత్స చేసినారు. ఈ శాఖ ఈ వ్యాధిని అరి కట్టడానికి యుద్ధ ప్రాతిపదిక మీద చర్యను తీసుకొని పంటకు నష్టాన్ని నివా రించింది.

పి. హెచ్. వెంకటరావు,
వ్యవసాయ శాఖమంత్రి

అధికారభాష - తెలుగు - 1966, ఆంధ్రప్రదేశ్ అధికార భాషచట్టము, (1966 లో 9 వ చట్టము) అధికార భాషా సంఘము తిరిగి ఏర్పాటు-ఉత్తరువు చేయడమైనది.

(జి ఓ.ఎం.ఎస్. నెం. 408 ప్రధాన పరిపాలన (అధికారభాష-1) శాఖ తేదీ 4 - ఆగస్టు - 1981)

ఈ కింది వానిని చూడండి.

1. 1-8-1978 తేదీగల ప్రధాన పరిపాలన (అ.భా) శాఖ, జి. ఓ. ఎం.ఎస్. నెం. 491.

2. 17-4-1979 తేదీగల ప్రధాన పరిపాలన (అ.భా) శాఖ, జి.ఓ.ఎం. ఎస్. నెం. 328.

ఉత్తరువు :

రాష్ట్రంలో అధికార కార్యాల నిమిత్తమై తెలుగుభాష వాడుకలో

జరిగిన ప్రగతిని సమీక్షించి రాష్ట్ర ప్రభుత్వానికి సిఫార్సులు చేయడానికిగాను 1966, ఆంధ్రప్రదేశ్ అధికార భాషా చట్టం 5 (1) విభాగపు కింద రాష్ట్ర అధికార భాషా సంఘం పైన పేర్కొన్న మొదటి జి.ఓ.లో తిరిగి ఏర్పాటు చేయబడినది. పైన పేర్కొన్న రెండవ జి.ఓ. లో అధికార భాషా సంఘం అధ్యక్షుని పదవీకాలం ఆయన పదవీ బాధ్యతలు స్వీకరించిన తేదీనుంచి మూడు సంవత్సరాలుగా నిర్ణయించడం జరిగింది. 4-8-1978 తేదిన పదవీ బాధ్యతలు స్వీకరించిన అధికార భాషా సంఘం అధ్యక్షుని పదవీ కాలం 3-8-1981 తేదీతో ముగిసింది.

2. ప్రభుత్వం దిగువ తెలిపిన వారితో అధికార భాషా సంఘాన్ని తిరిగి ఏర్పాటు చేయడానికి నిర్ణయించింది.

1. డా. సి. నారాయణరెడ్డి అధ్యక్షులు
2. శ్రీ పి. బసిరెడ్డి (పదవీ విరమణ చేసిన) సభ్యుడు హైకోర్టు న్యాయమూర్తి.
3. డా. కొత్తపల్లి వీరభద్రరావు, ప్రొఫెసరు, సభ్యుడు (హైదరాబాదు విశ్వవిద్యాలయము).
4. శ్రీ విద్వాన్ విశ్వం (కవి, పత్రికా రచయిత) సభ్యుడు
5. శ్రీ జ్ఞానానంద కవి (కాకినాడ) సభ్యుడు

3. ప్రధాన పరిపాలనా శాఖలో అధికార భాషా వ్యవహారాలను చూచు ప్రభుత్వ ప్రత్యేకాధికారి, సంఘం కార్యదర్శిగా కొనసాగవలె.

4. సంఘం రాష్ట్ర అధికార కార్యాల నిమిత్తం తెలుగు భాష వాడుకలో జరిగిన ప్రగతిని సమీక్షించి ఈ కింది విషయాలపై రాష్ట్ర ప్రభుత్వానికి సిఫార్సులు చేయవలె.

ఎ) రాష్ట్రంలోని అధికార కార్యాల నిమిత్తం తెలుగుభాష క్రమాధిక ఉపయోగము.

బి) రాష్ట్రంలోని అన్ని లేక ఏవేని అధికార కార్యాల నిమిత్తమై ఇంగ్లీషు భాష వాడుకపై నిర్బంధములు.

సి) ఈ దిగువ నిర్దిష్టపరచిన అంశాలు :

1. అధికార భాషను అమలు పరచడానికి చాలినంత మంది తెలుగు టైపిస్టులకు శిక్షణ ఇవ్వడం.

2. ప్రభుత్వ కార్యాలయాలలో ఉపయోగించడానికి చాలినంత సంఖ్యలో తెలుగు టైపురైటర్లను సేకరించడం.

3. న్యాయస్థానంలో కూడా అధికార భాషను అమలుపరచే నిమిత్తం అవసరమైన శాసనాలను అనువదించడం.

4. తెలుగులో వివరణలు, ముసాయిదాలు వ్రాయడంలో తెలుగు రాని సిబ్బందికి శిక్షణ ఇవ్వడం.

5. ప్రయాణ భత్యం దినసరి భత్యం తదితర భత్యాల కార్యం నిమిత్తం సంఘం మొదటి తరగతి కమిటీగా ఉండవలె.

6. అధికార భాషా సంఘం పదవీ కాలం అధ్యక్షునికి చెల్లించవలసిన పారితోషికం మొదలైన వాటి విషయమై ఉత్తరువులు విడిగా జారీ చేయడం జరుగుతుంది.

వి. రామకృష్ణ
ప్రభుత్వ సంయుక్త కార్యదర్శి.
*భవనం వెంకట్రామరెడ్డి*
విద్యాశాఖమంత్రి.

## ఆంధ్రప్రదేశ్‌లో శాంతి భద్రతల పరిస్థితిపై వివరణ

ఆంధ్రప్రదేశ్‌లో శాంతిభద్రతల పరిస్థితి అదుపులో ఉన్నది. అయితే, జంటనగరాలలో మతపరమయిన అలజడులు, నిర్మల్, భైంసా, ఆదిలాబాదులలో చెదురుమదురుగా అలజడులు జరిగినాయి. కరీంనగరు, నల్లగొండ, ఖమ్మం జిల్లాలలో తీవ్రవాదుల దౌర్జన్య చర్యలు కొనసాగినాయి. 1981 మే 27 నుంచి 1981 జూన్ 6 వ తేదీవరకు పంచాయతీల ఎన్నికలు, 9-6-81 వ తేదీన పంచాయతీ సమితుల అధ్యక్షుల ఎన్నికలు ప్రశాంతంగా జరిగినాయి. అయితే మహబూబ్‌నగర్, మెదక్, వరంగల్లు, ఖమ్మం, శ్రీకాకుళం, ప్రకాశం, గుంటూరు, అనంతపురం, విజయనగరం జిల్లాలలో ప్రత్యర్థివర్గాలకు మధ్య కొన్ని ఘర్షణలు జరిగినాయి.

రెండు మునిసిపలు కార్పొరేషన్లతో సహా 83 మునిసిపాలిటీలలో 78 మునిసిపాలిటీల ఎన్నికలుకూడా ప్రశాంతంగా పూర్తి అయినాయి.

1981 అక్టోబరులో సహకారసంస్థల ఎన్నికలుకూడా ప్రశాంతంగా జరిగాయి. అయితే, పోటీచేస్తున్న అభ్యర్థుల మద్దతుదార్ల మధ్య చిన్నపాటి ఘర్షణలు జరిగినాయి.

హైద్రాబాదు, సికిందరాబాదు జంటనగరాలలోని వివిధ బస్తీలనుంచి హుస్సేన్‌సాగర్ వరకు 13-9-1981 న నిమజ్జనం నిమిత్తం బయలుదేరిన గణేశ్ విగ్రహాల బృహత్తర ఊరేగింపుకూడా ప్రశాంతంగా జరిగింది. దసరా, బక్రీదు పండుగల సందర్భంగా అక్టోబరు 6, 8 తేదీలలో విస్తృతమయిన బందోబస్తు ఏర్పాట్లు చేయడం జరిగింది. అందువల్ల పరిస్థితులు ప్రశాంతంగా ఉన్నాయి. పోలీసువారు విస్తృతబందోబస్తు ఏర్పాట్లు చేయడంవల్ల 8-11-1981 న మొహరం ఊరేగింపు ప్రశాంతంగా జరిగింది. విద్యార్థులు

కార్మికవర్గాల పరిస్థితికూడా మొత్తంమీద సంతృప్తికరంగా ఉన్నది.

ఉద్యోగులకు సంబంధించినంతవరకు గుర్తింపుపొందని ఆంధ్రప్రదేశ్ పోలీస్ ఎన్.జి.ఓ.ల సంఘం ఆందోళన ప్రారంభించింది. సంఘం గుర్తింపుతో పాటు ఇతర కోరికల విషయంలో ప్రత్యక్ష చర్యకు పూనుకుంటామని ఆ సంఘం బెదిరించింది. సంఘం ఆందోళన కార్యకలాపాలు కర్నూలు ఆంధ్ర ప్రదేశ్ స్పెషల్ పోలీసు రెండవ బెటాలియనుకు చెందిన పోలీసు కానిస్టేబుళ్ళు హెడ్ కానిస్టేబుళ్ళ వరకు వ్యాపించినాయి. పోలీసుదళంలో క్రమశిక్షణను కాపాడవలసిన దృష్ట్యా ప్రజాశ్రేయస్సు దృష్ట్యాను, రాష్ట్రీభద్రతదృష్ట్యాను గట్టి చర్య తీసుకోవడం జరిగింది. కొంతమంది పోలీసువారిని జాతీయభద్రత చట్టంక్రింద అదుపులోకి తీసుకోవడం జరిగింది.

**నేరాల పరిస్థితి:-**

1981 లో (1981 సెప్టెంబరు ఆఖరువరకు) 41,209 విచారణార్థ మయిన నేరాలు జరిగినట్లు తెలియజేయడం జరిగింది. కాగా, 1980లో (1980 సెప్టెంబరు ఆఖరు వరకు) 39, 983 నేరాలు జరిగినాయి. అంటే నేరాలు 3 శాతం పెరిగినాయన్నమాట. 1981 లో 41,209 కేసులు నివేదించ బడగా 22,337 కేసులు ఆచూకీ తీయబడ్డాయి. ఆచూకీతీసిన కేసుల శాతం 54.2. 1981 లో హత్యలు, దొంగతనాలు, మానభంగాల గురించి నివేదించ బడిన నేరాల సంఖ్య తక్కువ. కాగా, దొమ్మీలు, బందిపోటు దొంగతనాలు, ఇంటికన్నాలకు సంబంధించిన నేరాల సంఖ్య పెరిగింది. వాటి ముఖ్యాంశాలు ఈ కింద వివరించడమైంది.

**హత్యలు: -**

1981 సెప్టెంబరు ఆఖరువరకు రాష్ట్రంలో 1016 హత్యలు జరిగినట్లు తెలియజేయడం జరిగింది. 1980 లో అదేకాలంలో 1022 కేసులు నమోదయ్యాయి. ఆ విధంగా ఈ కేసులసంఖ్య 6 తగ్గిందన్నమాట.

**బందిపోటు దొంగతనాలు:-**

రాష్ట్రంలో ఈ ఏడాదిలో 296 బందిపోటు దొంగతనాలు నివేదించ బడ్డాయి. కాగా, 1980 లో అదేకాలంలో 242. ఈ నేరాలు 22 శాతం పెరిగాయన్నమాట. కరీంనగర్ లో 9-11-1981 న 8 మందిని అరెస్టు చేయడంతో బందిపోటు దొంగతనాల కేసుల ఆచూకీలో ఎన్నో వివరాలు వెల్లడయ్యాయి. కరీంనగర్, మెదక్, నిజామాబాదు, వరంగల్లు జిల్లాలలో బంది పోటు దొంగతనాలు చేస్తున్న 31 మంది ముఠా కనుగొనడం జరిగింది. వీరికి 12 బందిపోటు దొంగతనాలు, 4 హత్యలతో సంబంధమున్నది. భారత శిక్షాస్మృతి 396 కింద నేరం (బందిపోటు దొంగతనం, ఆ తరవాత హత్యతో)

కూడ వీరికి సంబంధం ఉంది. ఇ. తిరుపతయ్యారెడ్డి, సంజీవరెడ్డి, ఇప్పరాజా రెడ్డి, ఆర్. శంకర్ ప్రభృతులు ఈ 31 మంది ముఠాకు నేతృత్వం వహిస్తున్నారు. అరెస్టయిన వ్యక్తుల సమాచారం ఆధారంగా దొంగతనం చేసిన ఆస్తులకు సంబంధించి సుమారు 85,000 విలువచేసే ఆస్తులు స్వాధీనం చేసుకోవడం జరిగింది. ఈ ముఠా మిద్దె పై కప్పు తొల్గించడంద్వారాగానీ, గోడపైకి ఎక్కడం ద్వారాగాని ఇండ్లలోపలికి ప్రవేశిస్తారు. ఇంటివారిని భయపెట్టడానికి టపాకాయలను పేలుస్తారు. కత్తులుచూపి బెదిరిస్తారు. ఆ తరవాత వారి బంగారునగలు లాక్కున్నారు. ప్రతిఘటించినప్పుడు దౌర్జన్యానికి పాల్పడ్డారు. రంగారెడ్డిజిల్లాలో 7 మంది వడ్డెర్ల ముఠాను అరెస్టు చేయడంలో పోలీసుదళం ఎంతో విజయం సాధించింది. దోసకాయల యాదయ్య ఈ ముఠాకు నాయకుడు. రంగారెడ్డి జిల్లాలోని మేడ్చల్, ఇబ్రాహీం, దిండిగల్లు సమీపంలో చుట్టుపట్ల ఈ ముఠా నాలుగు బందిపోటు దొంగతనాలు, ఒక దోపిడీ చేసింది. ఈ కేసులు దర్యాప్తులో ఉన్నాయి. ఈ ముఠానుంచి ఆస్తిని స్వాధీనం చేసుకోవడానికి పోలీసులు ప్రయత్నిస్తున్నారు.

**మానభంగాలు:-**

1981 సెప్టెంబరు ఆఖరువరకు 122 మానభంగం కేసులు నివేదించబడ్డాయి. 1980లో అదేకాలంలో 132 కేసులు నమోదయ్యాయి. గతసంవత్సరంతో పోల్చిచూస్తే ఈ కేసుల సంఖ్య 15 కు తేడా 11 శాతం తగ్గాయన్నమాట.

**దొమ్మీలు:-**

ఈ ఏడాదిలో 3050 దొమ్మీ కేసులు నివేదించబడగా 1980 లో అదే కాలంలో 2278 కేసులు నివేదించబడ్డాయి. ప్రధానంగా జంటనగరాలలో మతపరమయిన గొడవల్లోజరిగిన ఘర్షణవల్ల, గ్రామీణప్రాంతాలలో పంచాయతీలు తదితర సంస్థల ఎన్నికల సందర్భంగా జరిగిన ఘర్షణలవల్ల వీటి సంఖ్యలో పెరుగుదల కన్పిస్తున్నది.

**షెడ్యూలు కులాలు షెడ్యూలు తెగలపైఅత్యాచారాలకు సంబంధించినేరాలు:-**

ఈ ఏడాదిలో షెడ్యూలుకులాలు, షెడ్యూలు తెగలపై అత్యాచారాలకు సంబంధించిన నేరాల సంఖ్య చాలాతక్కువ. భద్రత చర్యలు చేపట్టడం, షెడ్యూలుకులాలు, షెడ్యూలుతెగల ప్రజలపై అత్యాచారాలకు పాల్పడే నేరస్తులను సకాలంలో పట్టుకోవడం, నేరాలు తరచుగా జరిగే ప్రాంతాలలో పోలీసు బలగాల్నుంచి కట్టుదిట్టమయిన చర్యలు తీసుకోవడంవల్లనే ఈ నేరాల సంఖ్య తగ్గిందని చెప్పవచ్చు. షెడ్యూలుకులాలు/షెడ్యూలు తెగలవారిపై జరిగిన హత్యలు, మానభంగాలవంటి పెద్ద నేరాలు 1980 లో 35 నివేదించగా 1981 లో 24 కేసులు నివేదించడం జరిగింది.

ముఖ్యమంత్రి

# ఆంధ్రప్రదేశ విధాన పరిషత్తు

*ఒకనాటి కార్యక్రమ పట్టిక*

**1981 సం. నవంబరు 16వ తేదీ సోమవారం ఉదయం 10-00 గంటలకు**

శక సం. 1903, కార్తీక 25 వ రోజు

(ముప్పది ఎనిమిదవ సమావేశపు తొమ్మిదవ రోజు)

**I ప్రశ్నోత్తరాలు**

(నక్షత్రం గుర్తుగల ప్రశ్నల జాబితా, స్వల్పవ్యవధి ప్రశ్నలు వేరుగా అందజేయడం జరిగింది.)

**II విధానపరిషత్తు నిబంధనలలోని 311-ఎ నియమాన్ని అనుసరించి ఉత్పన్నంచేసిన విషయం :**

శ్రీ ఎం. హనుమంతరావు, 11-11-1981 తేదీన సంఘం దైరీవర్ధకతసాధింపు చర్యలకు వ్యతిరేకంగా నిరాహారదీక్ష పూనిన శ్రీ రవీంద్రను, ఇంకా తొమ్మిదిమందిని అరెస్టుచేయడాన్ని గురించి విషయాన్ని ఉత్పన్నం చేస్తారు. అందువల్ల పశుసంవర్ధక శాఖామాత్యులు స్టేట్‌మెంట్ చేయవలె.

**III సభాసమక్షంలో ఉంచవలసిన పత్రాలు:**

1. ముఖ్యమంత్రి శ్రీ టి. అంజయ్య ఈ కింది జి.ఓ.లను ఒక్కొక్క ప్రతిని 1968 సం. ఆంధ్రప్రదేశ్ ఆబ్కారీ చట్టంలోని 72 సెక్షనులోని (4) సబ్-సెక్షను ననుసరించవలసిన విధంగా సభాసమక్షంలో ఉంచడం జరిగింది.

1) రెవెన్యూశాఖ 29-7-1981 తేదీగల 1197 నెం. జి.ఒ.
2) రెవెన్యూశాఖ 4-8-1981 తేదీగల 1245 నెం. జి.ఒ.
3) రెవెన్యూశాఖ 4-8-1981 తేదీగల 1246 నెం. జి.ఒ.

2. ముఖ్యమంత్రి శ్రీ టి. అంజయ్య నీటిపారుదల విద్యుచ్ఛక్తి శాఖ 5-10-1981 తేదీగల 472 నెం. ప్రభుత్వ ఉత్తర్వులోని భారత సంవిధానంలోని 371-డి పరిచ్ఛేదంలోని 5 వ క్లాజు ప్రతిబంధాన్ని అనుసరించి రాష్ట్రప్రభుత్వంచే చేయబడిన ప్రత్యేక ఉత్తర్వు ప్రతిని సదరు పరిచ్ఛేదంలోని 6 వ క్లాజు చేయవలసిన విధంగా సభాసమక్షంలో ఉంచడం జరిగింది.

3. పురావస్తు, సినిమాటోగ్రఫీ, చలనచిత్రాభివృద్ధి సార్వజనిక గ్రంథాలయాల శాఖామాత్యులు శ్రీ ఎన్. చంద్రబాబునాయుడు ఈ కింది జి.ఒ.లను ఒక్కొక్క ప్రతిని 1960 సం. ఆంధ్రప్రదేశ్ సార్వజనిక గ్రంథాలయాల చట్టంలోని 25 వ సెక్షను (3) వ సబ్-సెక్షను ననుసరించవలసిన విధంగా సభాసమక్షంలో ఉంచడం జరిగింది.

1) విద్యాశాఖ 13-5-1981 తేదీగల 474 నెం. జి.ఒ.
2) విద్యాశాఖ 13-5-1981 తేదీగల 475 నెం. జి.ఒ.

3) విద్యాశాఖ 26-6-1981 తేదీగల 579 నెం. జి.ఒ.

4. పురావస్తు, సినిమాటోగ్రఫీ, చలనచిత్ర అభివృద్ధి సార్వజనిక గ్రంథాలయాల శాఖామాత్యులు శ్రీ ఎన్. చంద్రబాబునాయుడు, 1980-81 సం.నకు హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రచలనచిత్ర అభివృద్ధి సంస్థ లిమిటెడ్ నిర్వహణ పై ఆరవసాలీనా నివేదిక ప్రతిని 1956 సం. భారతీయ కంపెనీల చట్టంలోని 619-ఎ (3) సెక్షనులోని నిర్దేశాలననుసరించి సభా సమక్షంలో ఉంచడం జరిగింది.

**IV 1981-82 సం. నకు వ్యయపు అనుబంధపు అంచనా: సమర్పణ**

ఆర్థికశాఖామాత్యులు శ్రీ కె. ప్రభాకరరెడ్డి. 1981-82 సం.నకు వ్యయపు అనుబంధపు అంచనాలు చూపే మొదటి పట్టికను సమర్పిస్తారు.

**V 75-76 సం నకు అదనపు గ్రాంట్ల కొరకు డిమాండ్లను సమర్పించడం**

ఆర్థికశాఖామాత్యులు శ్రీ కె. ప్రభాకరరెడ్డి, 1975-76 సం.నకు అదనపు గ్రాంట్ల కోసం డిమాండ్లను చూపే పట్టికను సమర్పిస్తారు.

**VI అత్యవసర ప్రజా ప్రాముఖ్యంగల విషయాలను ప్రభుత్వ దృష్టికి తేవడం:-**

1. సర్వశ్రీ బి. హెచ్. వెంకటనరసయ్య, ఎం.కె. మాణిక్యరావు డి. సూర్యప్రకాశరెడ్డి, పశ్చిమగోదావరి జిల్లా చింతలపూడి (తాలూక) లింగపాలెం మహిళామండలి కుట్టుపని కేంద్రంలో కుట్టుపని ఉపాధ్యాయినిగా ఉన్న అనుసూచిత కులానికి చెందిన కుమారి పి. మ్యేరీలపుష్పను మానభంగం చేసి హత్యచేసిన విషయాన్ని ముఖ్యమంత్రిగారి దృష్టికి తెస్తారు.

2. శ్రీమతి కుముద్ బి.నాయక్, శ్రీ ఎం. మాధవరావు, మెదక్ జిల్లా పెద్ద చెల్మాడ గ్రామం గొల్ల సంగయ్య భార్యను సర్పంచ్ ఇంకా ఇతరులు నగ్నంగా తిప్పిన విషయాన్ని హోంశాఖామాత్యుల దృష్టికితెస్తారు.

3. సర్వశ్రీ ఎస్. హిమవంతరావు, ఎం. మాధవరావు, జిల్లాపరిషత్తులలో సమితులలో "జిల్లా విశిష్టసమితి"లను ఏర్పాటు చేయడాన్ని పంచాయతీ రాజ్ శాఖామాత్యుల దృష్టికి తెస్తారు.

**VII ప్రభుత్వ తీర్మానం :-**

రోడ్లు, భవనాలశాఖామాత్యులు శ్రీ డి. కొండయ్యచౌదరి ఈ విధంగా ప్రతిపాదిస్తారు.

1-1-1981 నుంచి 31-12-1982 తేదీ వరకు ఆంధ్రప్రదేశ్ ప్రాంతీయ పోస్టలు సలహా సమితిలో పని చేయడానికి రాష్ట్ర విధానమండలి లోని ఒక ప్రతినిధి పేరును పంపవలసిందిగా ఆంధ్రప్రదేశ్ పోస్టుమాస్టర్ జనరల్ ప్రభుత్వాన్ని కోరినందువల్ల సదరు కాలానికి పై చెప్పిన సమితిలో పని చేయడానికి పరిషత్తుచే ఎన్నుకొన్న సభ్యుని పేరును పోస్టుమాస్టర్ జనరల్‌కు పంపడానికి ప్రభుత్వానికి ఈ పరిషత్తువారు సిఫారసు చేస్తున్నారు.

**VIII ప్రభుత్వ చిత్తుచట్టం**

విధానసభ ఆమోదించిన రూపంలో 1981 ఆంధ్రప్రదేశ్ గ్రామపంచాయతుల

పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్తుల చట్టాల (మూడవ సవరణ) (బిత్తు చట్టం) 1981 సం. 27 వ నెం. విధానసభ బిత్తు చట్టం

- అ -

పంచాయతీ రాజ్యశాఖామాత్యులు శ్రీ ఎన్. శ్రీనివాసుల్ రెడ్డి విధాన సభ ఆమోదించిన రూపంలో, 1981 ఆంధ్రప్రదేశ్ గ్రామ పంచాయతుల, పంచాయతీ సమితుల జిల్లా పరిషత్తుల చట్టాల (మూడవ సవరణ) చిత్తు చట్టాన్ని పరిశీలనలోకి తీసుకొనవలసిందిగా ప్రతిపాదిస్తారు.

- ఆ -

పంచాయతీ రాజ్య శాఖామాత్యులు శ్రీ ఎన్. శ్రీనివాసుల్ రెడ్డి, ఆ చిత్తు చట్టాన్ని ఆమోదించవలసిందిగా ప్రతిపాదిస్తారు.

హైదరాబాద్,
తేదీ : 13-11-1981

ఎం. అంగురాజు
విధాన పరిషత్తు కార్యదర్శి

1981 వ సం॥ నవంబర్ 16 వ తేదీ (శ. సం॥ 1903) కార్తిక 25 సోమవారము : వాగ్రూపమున అడిగిన ప్రశ్నల జాబితా :

ఆంధ్రప్రదేశ్ రజతోత్సవాలు

71 -

* 7419 — శ్రీ డి. శివరామరాజు : గౌరవనీయులైన ముఖ్య మంత్రిగారు దయచేసి ఈ కింది విషయాలు తెలుపుతారా?

(అ) ఆంధ్రప్రదేశ్ రజతోత్సవాల పేరుమీద 1980 సంవత్సరం నవంబరు 1 వ తేదీనుంచి 25 వ తేదీవరకు శ్రీమతి ఇందిరాగాంధి ఇరవై సూత్రాల కార్యక్రమం, స్వర్గీయ శ్రీ సంజయ్‌గాంధిగారి ఐదు సూత్రాల కార్యక్రమాలకు ప్రాధాన్యత ఇవ్వబడిన విషయం వాస్తవమేనా ?

(ఆ) నిర్వాహక సమితి సభ్యుల పేర్లు ఏవి?

(ఇ) ప్రకటనలు, విద్యుద్దీపాలంకరణలు, సమావేశాలు, విందు భోజనాలు మొదలయిన వివిధాంశాలపై ప్రభుత్వం, ప్రభుత్వ సంస్థలు సివిల్ పంచాయతీ రాజ్య సంస్థలచే ఎంత సొమ్ము ఖర్చు అయ్యింది?

పెన్నా నదిలో పడవ ప్రమాదం

72 -

* 8315 — శ్రీ ఎం. జె. మాణిక్యరావు : గౌరవనీయులైన ముఖ్య మంత్రిగారు దయచేసి ఈ కింది విషయాలు తెలుపుతారా ?

(అ) కడపజిల్లా, సిద్ధవటం సమీపంలో పెన్నా నదిలో 22-9-81 తేదీన పడవ తలకిందులై ఏబది మంది మరణించిన విషయం వాస్తవమేనా ?

(ఆ) అయితే దాని వివరాలేవి ?

సిమెంటు ఫ్యాక్టరీలు.

73 -

* 7832 - సర్వశ్రీ ఆర్.నారపరెడ్డి, ఎం.జె. మాణిక్యరావు: గౌరవనీయులైన భారీ పరిశ్రమల శాఖామాత్యులు దయచేసి ఈ క్రింది విషయాలు తెలుపుతారా!

(అ) రాష్ట్రంలో ఉన్న సిమెంటు ఫ్యాక్టరీలు ఎన్ని ? అవి ఏ ఏ స్థలాలలో ఉన్నాయి?

(ఆ) గత రెండు సంవత్సరాలలో ప్రతి ఫ్యాక్టరీ ప్రతిష్ఠాపిత శక్తి ఎంత? వాటి కచ్చితమైన ఉత్పత్తి పరిమాణ మెంత?

ఇ) రాష్ట్రంలో తీవ్రమైన బొగ్గుకొరతవల్ల సిమెంటు ఉత్పత్తి దెబ్బతినడాని కవకాశం ఉన్నదనే విషయం వాస్తవమేనా?

ఈ) అయితే బొగ్గు నిరంతర సరఫరాకు తీసుకొన్న చర్యలు ఏవి?

కడపజిల్లా, కోడూరు గ్రామంలో చాకిరేవువంక రిజర్వాయరు.

74 -

* 79 (ఎస్): సర్వశ్రీ డి. సూర్యప్రకాశరెడ్డి, పి. భుజంగరావు: గౌరవనీయులైన చిన్నతరహా నీటిపారుదల శాఖామాత్యులు దయచేసి ఈ కింది విషయాలు తెలుపుతారా?

అ) కడపజిల్లా, కోడూరు తాలూకా గ్రామంలోని చాకిరేవు రిజర్వాయరు పనిని చేపట్టినారా?

ఆ) అయితే, దాని అంచనావ్యయమెంత?

ఇ) ఇంతవరకు వ్యయపరచిన సొమ్ము ఎంత?

పశ్చిమగోదావరి జిల్లా నర్సాపూర్ ఇందిరాలేసు వర్కర్స్ సొసైటీపై ఫిర్యాదులు:

75 -

* 7906 - శ్రీ బి.హెచ్. వెంకటనరసయ్య, గౌరవనీయులైన చిన్నతరహా పరిశ్రమల శాఖామాత్యులు దయచేసి ఈ కింది విషయాలు తెల్పుతారా?

అ) పశ్చిమగోదావరిజిల్లా, నర్సాపూర్‌లో ఇందిరాలేస్ వర్కర్సు సొసైటీ ఏదైనా ఉన్నదా?

ఆ) ఇందిరాలేస్ వర్కర్స్ సొసైటీ ప్రజలనుంచి వేలకువేల రూపాయలు వసూలుచేసి వారిని మోసం చేసినారని ప్రభుత్వానికి ఏదైన ఫిర్యాదు అందిందా? అయితే, దాని వివరాలు ఏవి?

ఇ) అందువల్ల ప్రభుత్వం ఎటువంటి చర్య తీసుకొన్నది?

కాకినాడ, కోటిపల్లి మధ్య రైల్వే లైనును పునరుద్ధరించడం.

76 -

* 7014 - శ్రీ డి. శివరామరాజు :- గౌరవనీయులైన రోడ్లు, భవనాల శాఖామాత్యులు దయచేసి ఈ కింది విషయాలు తెల్పుపుతారా?

అ) కాకినాడ, కోటిపల్లి మధ్య యుద్ధసమయంలో వేసిన రైల్వేలైను పనికిరాకుండా పోయిన విషయం రాష్ట్రప్రభుత్వానికి తెలిసిందా?

ఆ) కోనసీమ (మధ్య డెల్టా) వద్ద ఒ.ఎన్.జి.సి. కార్యకలాపాలు, వ్యవసాయ ఉత్పత్తుల రవాణాదృష్ట్యా రాష్ట్రప్రభుత్వం కేంద్రప్రభుత్వంతో రైల్వే బోర్డుతో ఈ రైల్వే లైనును పునరుద్ధరించే విషయమై సంప్రదిస్తుందా?

ఇ) గోదావరి నదిమీద నర్సాపూర్-కోటిపల్లి వద్ద రైల్‌కంరోడ్ బ్రిడ్జి నిర్మించి నర్సాపూర్-కోటిపల్లికి రైల్వేలైను కలపడానికి ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వాన్ని, రైల్వేబోర్డును సంప్రదిస్తుందా?

**సిమెంటు పనులను వాయిదా వేయడం:**

77 -

* 8306 - శ్రీ జూపూడి యజ్ఞనారాయణ:- గౌరవనీయులైన పంచాయతీరాజ్ శాఖామాత్యులు దయచేసి ఈ కింది విషయాలు తెలుపుతారా?

అ) పంచాయతీరాజ్‌శాఖ 29-7-1981 తేదీగల మెమో నెం. 1029 ఎన్. ఆర్. ఇపి. 11/81-1 ద్వారా అన్ని సిమెంటు పనులను వాయిదా వేయమని ఆదేశాలు జారీ చేసినారా?

ఆ) అయితే అందుకు గల కారణాలేవి?

**గుంటూరుజిల్లా వినుకొండకు రక్షిత మంచినీటి సరఫరా:**

78 -

* 48- (ఎన్)- సర్వశ్రీ ఎం. హనుమంతరావు, జూపూడియజ్ఞనారాయణ :- గౌరవనీయులైన గ్రామీణ నీటిసరఫరా శాఖామాత్యులు దయచేసి ఈ కింది విషయాలు తెలుపుతారా!

అ) గుంటూరుజిల్లా వినుకొండ గ్రామానికి రక్షిత మంచినీటి సరఫరా పథకం 1976లోనే ప్రారంభించినా, ఇంకా పూర్తి కానీ విషయం వాస్తవమేనా?

ఆ) అయితే, అందుకుగల కారణాలేవి?

**ఆంధ్రప్రదేశ్‌లో చలనచిత్ర కేంద్రాలు:**

79 -

* 72- [సి] సర్వశ్రీ కె. కోటేశ్వరరావు, పి. భుజంగరావు:- గౌరవనీయులైన పురావస్తు శాఖామాత్యులు దయచేసి ఈ కింది విషయాలు తెలుపుతారా?

అ) ఆంధ్రప్రదేశ్‌లో కూడా పూనాలోవలె "చలనచిత్ర శిక్షణాకేంద్రం" నెలకొల్పడానికి ప్రభుత్వంవద్ద ఏదేని ప్రతిపాదన ఉన్నదా?

ఆ] అయితే, దాని వివరాలేవి?

**డ్రిల్లింగ్ రిగ్గులు పనిచేసే పరిస్థితి:**

* 80 - [ఎఫ్] సర్వశ్రీ ఎం. మాధవరావు ఎం. జె. మాణిక్యరావు:-

గౌరవనీయులైన భూగర్భజల శాఖామాత్యులు దయచేసి ఈ కింది విషయాలు తెలుపుతారా?

అ) కార్పొరేషన్ సేకరించిన డ్రిల్లింగ్ రిగ్గుల సంఖ్య ఎంత, 1981 మార్చి ఒకటవ తేదీకి అందులో ఎన్ని పనిచేసే స్థితిలో ఉన్నాయి.

ఆ] ప్రతి సంవత్సరానికి రిగ్గు ఉపయోగపు సగటు రేటెంత?

ఇ] ప్రభుత్వం అద్దె ప్రాతిపదికపై ప్రయివేటు రిగ్గులను తీసుకొంటున్న విషయం వాస్తవమేనా?

ఈ] ప్రయివేటు రిగ్గులు అద్దెకు తీసుకొనే పద్ధతికి స్వస్తిచెప్పడానికి ప్రభుత్వ రిగ్గులను అధికంగా ఉపయోగించడానికి ప్రభుత్వం చర్యలు తీసుకొంటుందా?

ఎం. అంగురాజ్

విధానపరిషత్తు కార్యదర్శి.

## ఆంధ్రప్రదేశ్ విధాన పరిషత్తు

స్వల్పవ్యవధి ప్రశ్న నెం. 87-క్యూ శ్రీ వి. రామారావు, ఎం.ఎల్.సి.

గౌరవనీయులైన ముఖ్యమంత్రిగారు దయచేసి ఈ కింది సమాచారం తెలియజేస్తారా?

ఎ] సమాచార, పౌరసంబంధాలశాఖ డైరెక్టరు కార్యాలయం 'సత్యసూర్య' అనే పత్రికను ప్రచురిస్తున్న మాట నిజమేనా?

బి] అయితే ఇప్పటివరకు ఖర్చు చేసిన మొత్తం, ఆర్జించిన లాభం ఎంత?

సమాధానం

ఎ] కాదండి

బి] ఈ ప్రశ్నకు తావులేదు

[పై సమాధానం ముఖ్యమంత్రిగారి ఆమోదం పొందింది.]

ప్రధాన పరిపాలన (స.పౌ.) శాఖ యు.ఓ. నోటు నెం. 2963/స.పౌ. ఎ4/81-2. తేదీ 14-11-81.

స్వల్పవ్యవధి ప్రశ్న నెం. 88—సి. సర్వశ్రీ ఎం. మాధవరావు, ఎం. జె. మాణిక్యరావు, ఎం.ఎల్.సి లు.

గౌరవనీయులైన రెవిన్యూశాఖ మంత్రిగారు దయచేసి ఈ కింది సమాచారం తెలియజేస్తారా?

ఎ] చిత్తూరుజిల్లా, చంద్రగిరితాలూక, పుదుపట్ల గ్రామంలోని పేద హరిజనులు సాగుచేస్తున్న 20 ఎకరాల భూమిపై ఉన్న నిలువ పంటను 1981

అక్టోబరులో భూస్వాములు నాశనం చేసిన మాట నిజమేనా?

బి] అయితే దానిమీద తీసుకున్న చర్య ఏమిటి?

సమాధానం

ఎ] కాదండీ

బి] ఈ ప్రశ్న ఉత్పన్నంకాదు.

[పై సమాధానం న్యాయశాఖ మంత్రిగారి ఆమోదం పొందింది.]

రెవిన్యూ యు.ఓ. నోటు నెం. 2680/పి/81-2 తేదీ 15-11-1981

స్వల్ప వ్యవధి ప్రశ్న నెం. 88-ఎన్ శ్రీ కె.ఎల్. మహేంద్ర,ఎం.ఎల్.సి.

గౌరవనీయులైన మున్సిపలు పరిపాలనశాఖ మంత్రిగారు దయచేసి ఈ కింది సమాచారం తెలియజేస్తారా?

ఎ] హైదరాబాదు, ఆసిఫ్‌నగర్ ప్రాంతమందలి షహీద్‌నగర్ నివాసులు పబ్లికు కుళాయి లేకుండా నివసిస్తున్న మాట నిజమేనా? అక్కడ పాక్షికంగా నిర్మించిన డ్రైనేజివల్ల మురుగునీటితో వీధులు అపరిశుభ్రంగా తయారవుతున్న మాటకూడా నిజమేనా?

బి] అయితే, ప్రభుత్వం, వారికి పబ్లికు కుళాయి ఏర్పాటు చేయడం, పాక్షికంగా నిర్మించిన డ్రైనేజిని పూర్తిచేయడం, ఆ ప్రాంతాన్ని, వీధులను పరిశుభ్రంగా ఉంచే నిమిత్తం చెత్తకుండీలను ఏర్పాటుచేయడంవంటి సదుపాయాలు కలుగజేస్తుందా?

సమాధానం

ఏ-బి :— 1980-81 వరకు నిర్మించిన ప్రాంతాలకు పూర్తి డ్రైనేజి సదుపాయాలు కలుగజేయడం అయింది. కొత్తగా విస్తరించిన కొద్ది ఇండ్లకు మాత్రం ఈ సౌకర్యాలను కలుగజేయవలసి ఉంది. హైదరాబాదు మున్సిపలు కార్పొరేషను వీరికి ఆ సదుపాయాలను విస్తరింపజేసే నిమిత్తం అవసరమయిన చర్య తీసుకొంటున్నది. ఈ నెలాఖరుకు అదికూడా పూర్తికాగలదు. ఇప్పటికే అక్కడ ఐదు చెత్తకుండీలు ఉన్నాయి. మరో ఐదు సమకూర్చబడ్డాయి. ఈ నెలాఖరుకు మూడు పబ్లిక్ కుళాయిలను ఏర్పాటు చేయడం జరుగుతుంది.

[పై సమాధానం మున్సిపలు పరిపాలన, పట్టణ అభివృద్ధిసంస్థ శాఖల సహాయ మంత్రి శ్రీ ఎన్. ఆళ్వారుదాసుగారి ఆమోదం పొందింది.]

యు.ఓ. నోటు నెం. 8199-ఎ 2-81-1, ము.ప. తేదీ 15-11-1981.

ప్రశ్న నెం. 8815 శ్రీ ఎం. జె. మాణిక్యరావు, ఎం.ఎల్.సి.

గౌరవనీయులైన ముఖ్యమంత్రిగారు దయచేసి ఈ కింది సమాచారం తెలియజేస్తారా?

ఎ) 22-9-1981 తేదీన కడపజిల్లా, సిద్ధవటం సమీపాన పెన్నానదిలో పడవొకటి నీట మునిగి 50 మంది చనిపోయిన సంగతి నిజమేనా?

బి] అయితే, అందుకు సంబంధించిన వివరాలేమిటి?

సమాధానం

ఏ-బి :- 22-9-1981 తేదీన కడపజిల్లా, సిద్ధవటం సమీపాన పెన్నా నదిలో జరిగిన పడవ ప్రమాదంలో 15 మంది చనిపోయినారు. వీరిలో ఇద్దరు బాలురు, ఒక బాలిక, నలుగురు స్త్రీలు, ఎనిమిది మంది పురుషులు ఉన్నారు. ప్రమాదం జరిగేటప్పుడు పడవ నడిపే వారితోసహా 55 మంది అందులో ప్రయాణం చేస్తున్నారు. వారిలో 34 మంది సురక్షితంగా ఈదుకుంటూ ఒడ్డుకు చేరడమో లేదా వారిని రక్షించడమో జరిగింది. జిల్లా పరిపాలన అధి కారులు ఏర్పాటు చేసిన అన్వేషక బృందాలు 10 మృతదేహాలను బయటికి తీసుకొచ్చినారు.

ప్రమాదంలో మునిగిపోయిన వారి కుటుంబాలు ఒక్కొక్క దానికి రూ. 2000/-లు ఎక్స్ గ్రేషియా మొత్తం చెల్లించబడింది. ఈ ప్రమాదానికి దారితీసిన కారణాలను తెలుసుకోవడానికి మేజిస్ట్రేట్ చే విచారణ జరిపించ డానికి ఉత్తరువు చేయబడింది. విచారణ జరుగుతున్నది.

[పై సమాధానం ముఖ్యమంత్రిగారి ఆమోదం పొందింది.]

ప్రధాన పరిపాలన [ప్ర. ఎ.] శాఖ యు.ఓ. నోటు నెం. 2357/ ప్ర.ప/81-2. తేదీ 14-11-1981.

ప్రశ్న నెం. 7832 శ్రీ ఆర్. నారపరెడ్డి, ఎం.ఎల్.సి.
శ్రీ ఎం. జె. మాణిక్యరావు, ఎం.ఎల్.సి.

గౌరవనీయులైన భారీపరిశ్రమల శాఖమంత్రిగారు దయచేసి ఈకిందిసమా చారాన్ని తెలియజేస్తారా?

ఎ] రాష్ట్రంలో సిమెంటు ఫ్యాక్టరీలు ఎన్ని ఉన్నాయి. అవి ఎక్క డెక్కడ ఉన్నాయి?

బి] వాటి స్థాపిత శక్తి ఎంత? గత రెండు సంవత్సరాలలో ప్రతిఫ్యాక్ట రీలో అయిన వాస్తవ ఉత్పత్తి ఎంత?

సి] బొగ్గు తీవ్రకొరతవల్ల రాష్ట్రంలో సిమెంటు ఉత్పత్తికి అంతరాయం కలుగవచ్చు అన్నమాట నిజమేనా?

డి] అయితే, బొగ్గు నిరంతర సరఫరాకు తీసుకొన్న చర్యలేమిటి?

సమాధానం

[ఎ] [బి] : వివరణ సభాసమక్షంలో ఉంచడం జరిగింది.
[సి] కాదండీ.
[డి] ఈ ప్రశ్న ఉత్పన్నం కాదు.

[పై సమాధానం భారీ పరిశ్రమలశాఖా మంత్రి శ్రీ ఎం. బాగారెడ్డి ఆమోదం పొందింది.]

పరిశ్రమల, వాణిజ్య శాఖ యు.ఓ. నోటు నెం. 2594- బి పి/81 తేది: 13-11-1981.

ప్రశ్న నెం. 79-ఎస్. శ్రీ డి. సూర్యప్రకాశరెడ్డి, ఎం.ఎల్.సి.

గౌరవనీయులైన చిన్న తరహానీటి పారుదల శాఖామంత్రిగారు దయచేసి ఈ కింది సమాచారం తెలియ జేస్తారా?

(ఎ) కడపజిల్లా కోడూరు తాలూకాలోని ఒక గ్రామంవద్ద చాకిరేవు వరక రిజర్వాయరు పని చేపట్టినారా?

[బి] అయితే, దాని అంచనా ఖర్చు ఎంత?

[సి] ఇప్పటి వరకు ఖర్చు చేసిన మొత్తమెంత?

సమాధానం

[ఎ] కడపజిల్లా, రాజంపేట తాలూకా ములకలపాడు గ్రామం వద్ద చాకలిరేవు కోనమీద రిజర్వాయరు నిర్మించేపని 1981 ఫిబ్రవరిలో చేపట్టినారు.

[బి] పై పథకానికి ప్రత్యేక ఖర్చులతోసహా రూ. 3689600 ల కోసం పాలనాపరమైన ఆమోదం తెలియజేయడం జరిగింది.

(సి) 1981 మార్చి నాటికి దీనికోసం రూ. 3.50 లక్షల ఖర్చుచేసినారు.

(పై సమాధానాన్ని మంత్రిగారు ఆమోదించినారు.)

నీటిపారుదల, విద్యుచ్ఛక్తిశాఖ యు.ఓ. నోటు నెం. 613/సి.పా. 3-2/81. తేదీ; 11-11-81.

ప్రశ్న నెం. 7906 శ్రీ బి.హెచ్. వెంకటనరసయ్య, ఎం.ఎల్.సి.

గౌరవనీయులైన లఘుపరిశ్రమల మంత్రిగారు దయచేసి ఈ కింది సమాచారం తెలియ జేస్తారా?

(ఎ) పశ్చిమగోదావరి జిల్లా నరసాపూర్‌లో ఇందిరాలేసు పనివారల సంఘం ఏదైనా ఉందా?

(బి) ఇందిరాలేసు పనివారి సంఘం ప్రజలనుంచి వేలాది రూపాయలు వసూలుచేసి, వారిని మోసం చేసినట్లు ఫిర్యాదు అందిందా? అయితే, ఆ వివరాలేమిటి?

(సి) దానిపై ప్రభుత్వం తీసుకున్న చర్య ఏమిటి?

సమాధానం

(ఎ) పశ్చిమ గోదావరి జిల్లాలో అటువంటి పారిశ్రామిక సహకార సంఘం ఏదీ పరిశ్రమలశాఖ డైరెక్టరేటులో రిజిస్టరు కాలేదు.

(బి) ప్రభుత్వానికి అటువంటి ఫిర్యాదు ఏదీ అందలేదు.

[సి] ఈ ప్రశ్న ఉత్పన్నంకాదు.

(పై సమాధానం లఘుపరిశ్రమలశాఖ మంత్రి శ్రీ కె. కేశవరావుగారి ఆమోదం పొందింది.)

యు.ఓ. నోటు నెం. 1308/ఆర్. ఐ. పి/81-4, తేదీ; 12-11-81.

## ఆంధ్రప్రదేశ శాసన పరిషత్తు

ప్రశ్న నెం. 7014 శ్రీ డి. శివరామరాజు, ఎం.ఎల్.సి.

గౌరవనీయులైన రోడ్లు, భవనాలశాఖ మంత్రిగారు దయచేసి ఈ కింది సమాచారం తెలియజేస్తారా?

ఎ) యుద్ధకాలంలో కాకినాడనుంచి కోటిపల్లి వరకు వేసిన రైల్వేలైను వాడకంలో లేకుండా పోయిన విషయం రాష్ట్రప్రభుత్వానికి తెలుసా?

బి) కోనసీమ (కేంద్ర డెల్టా)లో చమురు, సహజవాయువుల కమిషన్ కార్యక్రమాల దృష్ట్యా, వ్యవసాయోత్పత్తుల రవాణాదృష్ట్యా కాకినాడనుంచి కోటిపల్లి వరకుగల ఈ రైల్వేలైనును తిరిగి వాడకంలో పెట్టవలసిందిగా రాష్ట్ర ప్రభుత్వం, కేంద్రప్రభుత్వంతోను, రైల్వేబోర్డుతోను సంప్రదింపులు జరుపుతుందా?

సి) గోదావరి నదిపైన నర్సాపూర్‌లోను, కోటిపల్లిలోను రైల్వే రోడ్ల బ్రిడ్జిలను నిర్మించడంద్వారా నర్సాపూరును కోటిపల్లిని రైల్వేలైనతో కలుపవలసిందిగా కేంద్రప్రభుత్వంతోను, రైల్వేబోర్డుతోను ప్రభుత్వం సంప్రదింపులు జరుపుతుందా?

సమాధానం

ఎ) అవునండి.

బి-సి) అవునండి ఈ విషయంపై ప్రతిపాదనలు కేంద్ర ప్రభుత్వానికి పంపగా ఆర్థికాభావం కారణంగా అది వీలుపడదని తెలియజేసింది.

(పై సమాధానం రోడ్లు భవనాల శాఖమంత్రిగారి ఆమోదం పొందింది) రవాణా రోడ్లు భవనాల శాఖ యు. ఒ. నోటు నెం. 3366/పి2/80-3 తేది 23-3-1981

ప్రశ్న నెం. 8306 శ్రీ జూపూడి యజ్ఞనారాయణ ఎం.ఎల్.సి.

గౌరవనీయులైన ప్రత్యేక ఉపాధికల్పన సాంస్కృతిక వ్యవహారాల శాఖమంత్రిగారు దయచేసి ఈ కింది సమాచారం తెలియజేస్తారా?

ఎ) 29. 7. 81 తేదీగల మెమోనెం. 1029/ఎస్.ఆర్.ఇ.పి/11/81-1,

ద్వారా అన్ని సిమెంటు పనులను వాయిదా వేయవలసిందిగా పంచాయతీ రాజ్యశాఖ సూచనలు జారీచేసించా?

బి) అయితే అందుకుగల కారణాలేమిటి?

సమాధానం

ఎ) సిమెంటుకొరత ఉన్న చోట్లలో, సిమెంటు అవసరం లేని పనులను చేపట్టవలసిందిగా 29-7-81 తేదీగల ప్రభుత్వ మెమో నెం. 1029/ఎన్.ఆర్. ఇ.పి. 11/81-1లో కలెక్టర్లందరికి సూచించడమైంది. జాతీయ గ్రామీణ ఉపాధి కార్యక్రమం కింద పనులను ఎటువంటి పరిస్థితులలోనూ వాయిదా వేయరాదనికూడా వారిని జాగ్రత్త వహించవలసిందిగా కోరడమయింది.

బి) చేస్తున్న ఖర్చును బట్టి భారత ప్రభుత్వ నిధుల విడుదల ముడిపడి ఉన్నందున సిమ్మెంటు లేదనే కారణంగా జాతీయ గ్రామీణ ఉపాధికార్యక్రమం కింద పనులు నిలిచిపోకుండా ఉండాలనే దృష్టితో పై ఆదేశాలు జారీచేయడమయింది.

(పై సమాధానం ప్రత్యేక ఉపాధికల్పన, సాంస్కృతిక వ్యవహారాల శాఖ మంత్రిగారి ఆమోదం పొందింది.)

**33 వ సమావేశం, 1979**

ప్రశ్న నెం. 48-ఎన్ శ్రీ ఎం. హనుమంతరావు, ఎం.ఎల్.సి.

గౌరవనీయులైన పంచాయతీరాజ్య శాఖ మంత్రిగారు దయచేసి ఈ కింది సమాచారం తెలియజేస్తారా?

ఎ] గుంటూరుజిల్లా, వినుకొండ గ్రామంలో 1976లో ప్రారంభించిన రక్షిత నీటిసరఫరా పథకం ఇంకా పూర్తి కాని విషయం నిజమేనా?

బి) అయితే, దానికి గల కారణాలేమిటి?

సి] ఇప్పటివరకు ఖర్చుచేసిన మొత్తమెంత? ఈ పనిని పూర్తిచేయడానికి ఇంకా ఎంత మొత్తం కావలసి ఉన్నది?

డి] అది ఎప్పటికి పూర్తి అవుతుంది?

సమాధానం

ఎ) అవునండి.

బి] వినుకొండ తాలూకాలో సింగార చెరువు నీటిని ఈ పథకానికి వనరుగా ఉపయోగించడానికి నీటి పారుదల, విద్యుచ్ఛక్తి శాఖ సత్వర అనుమతి ఇవ్వని కారణంగా ఈ పథకం పూర్తి కాలేదు.

సి) ఇప్పటివరకు రూ. 17.57 లక్షల మొత్తం ఖర్చు అయింది. ఈపని పూర్తికావడానికి ఇంకా రూ. 9.30 లక్షల మొత్తం కావలసి ఉంది.

డి] 1982 మార్చినాటికి ఈ పథకం పూర్తి అవుతుంది. (పై సమాధానం గ్రామీణ నీటి సరఫరాశాఖ మంత్రి గారి ఆమోదం పొందింది.)

ప్రశ్న నెం. 72-సి శ్రీ కె. కోటేశ్వరరావు,
శ్రీ పి. భుజంగరావు, ఎం.ఎల్.సీ.లు

గౌరవనీయులైన పురావస్తు, సినిమాటోగ్రఫీశాఖ మంత్రిగారు దయ చేసి ఈ కింది సమాచారం తెలియజేస్తారా?

ఎ) పూనేలో మాదిరిగా ఆంధ్రప్రదేశ్‌లోకూడా "ఫిల్మ్ శిక్షణ కేంద్రాన్ని" ఏర్పాటు చేయాలనే ప్రతిపాదన ఏదయినా ప్రభుత్వంవద్దఉన్నదా?

బి) అయితే, దాని వివరాలేమిటి?

సమాధానం

ఎ) - బి) హైదరాబాదులో ఫిల్మ్ సంస్థను ఏర్పాటుచేయటానికిగాను ఆంధ్రప్రదేశ రాష్ట్ర ఫిల్మ్ అభివృద్ధి కార్పొరేషను లిమిటెడ్ ఒక పథకాన్ని రూపొందిస్తున్నది.

(పై సమాధానం పురావస్తు, సినిమాటోగ్రఫీ శాఖల మంత్రిగారి ఆమోదం పొందింది.)

యు.ఓ.నోటు నెం. 869/స. పాసం/ఏ2/81-9 తేదీ. 11-11-81.

ప్రశ్న నెం. 80-ఎఫ్ శ్రీ ఎమ్. మాధవరావు,
శ్రీ ఎమ్. జె. మాణిక్యరావు, ఎం.ఎల్.సీ.లు

గౌరవనీయులైన భూగర్భజలశాఖ మంత్రిగారు దయచేసి ఈకింది సమాచారం తెలియజేస్తారా?

ఎ) రాష్ట్ర నీటి పారుదల అభివృద్ధి సంస్థకు ఎన్ని డ్రిల్లింగు రిగ్గులు ఉన్నాయి? 1-3-1981 తేదీకి వాటిలో ఎన్ని పనిచేసే స్థితిలో ఉన్నాయి?

బి) ఒక్కొక్క రిగ్గును సంవత్సరానికి సగటున ఎన్నిసార్లు వినియోగిస్తారు?

సి) ప్రభుత్వం అద్దెప్రాతిపదికపై ప్రయివేటు రిగ్గులను పొందుతున్న మాట నిజమేనా?

డి) ప్రయివేటు రిగ్గులను అద్దెకు తీసుకొనే విధానాన్ని నిరుత్సాహ పరచడానికి, ప్రభుత్వ రిగ్గుల వినియోగాన్ని పెంచేందుకు ప్రభుత్వం చర్యలు తీసుకుంటుందా?

సమాధానం

ఎ) 1-3-1981 తేదీ నాటికి రాష్ట్ర నీటిపారుదల అభివృద్ధి సంస్థకు 57 రిగ్గులు ఉన్నాయి. వాటిలో 37 రిగ్గులు పనిచేసే స్థితిలో ఉన్నాయి.

బి) రోటరీ రిగ్గు వార్షిక వినియోగశక్తి సంవత్సరానికి 300 మీ. లోతు

గల 5 నుంచి బోరింగుబావులు కాగా డి.టి.హెచ్. రిగ్గు సంవత్సరానికి 50 మీ. లోతుగల 30 బోరింగు బావులను త్రవ్వగలదు.

సి) మంచినీటి సరఫరాను ఎక్కువ చేయడానికి అనావృష్టి నిధులలో బోరింగు బావులను త్రవ్వే విస్తృత కార్యక్రమాన్ని నిర్వహించడానికి, పంచాయతీరాజ్ శాఖ జిల్లాలలో బోరింగు బావులను త్రవ్వేపనిని రేటు కాంట్రాక్టు ప్రాతిపదికపై ప్రయివేటు రిగ్గు యజమానులకు అప్పగించడం జరిగింది.

డి) పంచాయతీరాజ్ శాఖకు 59 రిగ్గులు ఉన్నాయి. అవి ప్రస్తుతం పనిచేసే స్థితిలో ఉన్నాయి. వాటిలో 47 రిగ్గులు 8 సంవత్సరాలకు పైగా ఉపయోగించబడుతున్నాయి. కాబట్టి వాటి వినియోగశక్తిని పెంచడం సాధ్యం కాదు.

(పై సమాధానాన్ని భూగర్భజలాలశాఖ మంత్రిగారు ఆమోదించినారు.)

నీటిపారుదల, విద్యుచ్ఛక్తిశాఖ యు.ఓ.నోటు నెం. 798-పం.రా. 1/2/81-3 తేది 12-11-1981.

# 5

# న్యాయవ్యవస్థ

**కోర్టులు :** 1956లో రాష్ట్రంలో ఏర్పడినప్పుడు ఆంధ్రహైకోర్టును, హైదరాబాదు హైకోర్టును కలిపి ఒకే హైకోర్టుగా హైదరాబాదులో ఏర్పరిచినారు. హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిని రాష్ట్రపతి నియమిస్తారు. మిగిలిన హైకోర్టు న్యాయమూర్తులను కూడా రాష్ట్రపతి నియమిస్తారు. ఈ నియామకాలకు సుప్రీంకోర్టు ప్రధానన్యాయమూర్తినీ, రాష్ట్రగవర్నర్‌ను న్యాయమూర్తుల విషయంలో హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిని, సంప్రదిస్తారు. హైకోర్టులో న్యాయమూర్తులు 62 సంవత్సరాలకు పదవీ విరమణ చేస్తారు. ఈలోగా న్యాయమూర్తిని, అక్రమ ప్రవర్తన, అసమర్థత కారణాలుగా రాష్ట్రపతి తొలగించవచ్చు. పార్లమెంటు ఇంపీచ్ చేయవచ్చు. న్యాయమూర్తి ఎవరయినా రాజీనామా చేయవచ్చు. అట్లా రాజీనామా చేసినవారు అదే హైకోర్టులో కాక, ఇతరచోట్ల మాత్రమే ప్రాక్టీసు చేసుకోవచ్చు. హైకోర్టు న్యాయమూర్తులను ఇతర హైకోర్టులకు బదిలీ చేయవచ్చు. న్యాయమూర్తిగా నియమించబడటానికి భారత పౌరులుగా ఉండటం, హైకోర్టులో 10 సంవత్సరాలపాటు న్యాయవాదిగా అనుభవం ఉండటం, కింది న్యాయస్థానాలలో 10 సంవత్సరాలపాటు న్యాయమూర్తిగా ఉండటం అర్హతలుగా పరిగణిస్తారు. హైకోర్టుకు మౌలికమయిన అధికారాలు, అప్పిలేట్ అధికారాలు, నియామక అధికారాలు ఉన్నాయి.

రాష్ట్రంలో 20 జిల్లాకోర్టులు, 24 అదనపు జిల్లా కోర్టులు ఉన్నాయి. సబార్డినేట్ జడ్జ్ కోర్టులు 60 ఉన్నాయి. జుడిషియల్ ఫస్ట్‌క్లాస్ మేజిస్ట్రేట్ కోర్టులు 238, జుడిషియల్ సెకండ్‌క్లాస్ మేజిస్ట్రేట్ కోర్టులు 29, రైల్వేలలో ఫస్ట్ క్లాస్ జుడిషియల్ మేజిస్ట్రేట్ కోర్టులు 4, రైల్వేలలోనే స్పెషల్ జుడిషియల్ మేజిస్ట్రేట్ సెకండ్‌క్లాస్ కోర్టులు 11, సెకండ్‌క్లాస్ స్పెషల్ జుడిషియల్ మేజిస్ట్రేట్ కోర్టులు 15, రెంట్‌కంట్రోలర్ కోర్టులు 4, క్రిమినల్ కోర్టులు 2, మొబైల్ కోర్టులు 5 ఉన్నాయి. చీఫ్‌జడ్జి, ఎడిషనల్ చీఫ్ జడ్జిలు 10, ఎడిషనల్ జడ్జిలు 6, అసిస్టెంట్ జడ్జిలు 14, స్మాల్‌కాజ్ కోర్టులలో ఎడిషనల్ చీఫ్ జడ్జిలు ఇద్దరు, స్మాల్‌కాజ్ కోర్టులలో ఎడిషనల్ జడ్జిలు 1, మెట్రోపాలిటన్ మేజిస్ట్రేట్లు 12, చీఫ్ మెట్రోపాలిటన్ మేజిస్ట్రేట్, చీఫ్‌సెషన్స్ జడ్జి 2, స్పెషల్ జ్యుడిషియరీ మేజిస్ట్రేట్లు, అఫీషియల్ రిసీవర్లు 14, గవర్న

మెంటు ప్లీడర్లు 34, ఎడ్వకేట్ జనరల్ 1, పబ్లిక్ ప్రాసిక్యూటర్ 1, ఎడిష నల్ పబ్లిక్ ప్రాసిక్యూటర్లు ఇద్దరూ ఉన్నారు.

సబార్డినేట్ జ్యుడిషియల్ కోర్టులంటే నగరాలలో, జిల్లాలలో, గ్రామా లలో ఉన్న సివిల్, నేర విచారణ న్యాయస్థానాలు మాత్రమే. వీటిలో స్మాల్ కాజ్ కోర్టులు, ట్రిబ్యునల్స్ కూడా చేర్చిచూడవలె. ఆయా న్యాయ స్థానాల ఏర్పాటుకు వివిధ చట్టాలున్నాయి. జిల్లా కేంద్రాలలో ఉన్న సెషన్స్ కోర్టులు నేరసంబంధమయిన కేసులను విచారణకు స్వీకరిస్తాయి. సబార్డినేట్ జడ్జికోర్టులుకూడా నేరాలను విచారిస్తాయి. అట్లాగే ఫస్ట్ క్లాస్ జుడిషియల్ మాజిస్ట్రేటు కోర్టుకూడా నేరాలను విచారణకు స్వీకరిస్తుంది. స్మాల్ కాజ్ కోర్టులు చిన్న కేసులను విచారిస్తాయి. రాజధానిలో మాత్రం రెండువేల రూపాయల వరకూ గల కేసులను ఇవి విచారణ చేయవచ్చు. గ్రామస్థాయిలో కలహాలు పరిష్కరించడానికిగాను మూడునుంచి 5 గ్రామాల వరకూ కలిపి న్యాయపంచాయతీలను జిల్లాకలెక్టర్ ఏర్పరుస్తాడు. జిల్లాజడ్జీలను, హైకోర్టుతో సంప్రదించి, రాష్ట్రగవర్నర్ నియమిస్తాడు.

జిల్లా కలెక్టర్లకు కొన్ని సందర్భాలలో మేజిస్ట్రేట్ అధికారాలు ఉన్నాయి. చిరకాల ఒత్తిడుల వలన న్యాయవిధానాన్ని పాలకవ్యవస్థనుంచి వేరుచేసి హైకోర్టు అజమాయిషీకింద జిల్లా, సబార్డినేట్ జడ్జీలను ఉంచినారు. వీటిపై పర్యవేక్షణాధికారాలు హైకోర్టుకు ఉంటాయి. అయితే నియామ కాలు మాత్రం హైకోర్టుతో సంప్రదించి గవర్నరు చేస్తుంటాడు.

రాష్ట్రంలో కోర్టులకు సంబంధించిన పాలనావ్యవస్థ శాఖకు ఒకమంత్రిత్వ శాఖ ఉన్నది. హోంశాఖ, న్యాయశాఖ ఈ విషయాలను ఇటీవలివరకూ చూస్తూండేవి. ప్రస్తుతం ప్రభుత్వ ప్లీడర్లను నియమించే అధికారాలన్నీ న్యాయశాఖ చూస్తూంది. కిందికోర్టులలో వ్యవహారాలన్నీ తెలుగులోనే నిర్వ హించవలెనని రాష్ట్రప్రభుత్వం నిర్ణయించింది. న్యాయశాఖకు ప్రస్తుతం రాష్ట్రబడ్జెట్ రూ. 10, 13, 13,000.

కేసులు త్వరగా పరిష్కరించే నిమిత్తం, ప్రజలకు అందుబాటులోఉండే నిమిత్తం, రాష్ట్రంలో సుప్రీంకోర్టు బెంచ్ ఏర్పాటు చేయవలెనని రాష్ట్ర ప్రభుత్వం కోరుతూంది. అట్లాగే హైకోర్టు బెంచ్ కూడా సర్కార్ జిల్లా లలోగాని, రాయలసీమలోగాని ఏర్పాటు చేయవలసిందిగా విజ్ఞప్తులు ఉన్నాయి.

# 6

# రాజకీయ పార్టీలు - ఒత్తిడి వర్గాలు

కాంగ్రెసు పార్టీ ప్రథమ అఖిల భారత పార్టీగా 1885 లో ఏర్పడింది. 1920 తరవాత ప్రాంతీయ, దేశపార్టీలు తలెత్తనారంభించినాయి. అఖిల భారత పార్టీలకు మన రాష్ట్రంలో శాఖలు ఏర్పడినాయి. అవికాక రాష్ట్రం లోనే ఆయా సందర్భాలలో కొన్ని ప్రాంతీయ పార్టీలు తలెత్తినాయి.

రాజకీయపార్టీ సర్వసాధారణంగా ఒక నిర్దిష్టమైన ప్రణాళికతోనూ, నియమ నిబంధనలతోనూ ఉంటుంది. ప్రతిపార్టీ కూడా తన ప్రణాళికను అమలు పరచేనిమిత్తం అధికారాన్ని చేపట్టాలని లక్ష్యంగా పెట్టుకొంటుంది. ఎన్నికలలో పోటీ చేస్తుంది. తగినంత సంఖ్య రాకుంటే ప్రతిపక్షంలో కూర్చుని, తన పార్టీ ప్రణాళిక దృష్ట్యా, ప్రభుత్వాన్ని వ్యతిరేకించటం, ప్రజలలో ప్రచారం చేయటం నిత్యకృత్యంగా పెట్టుకొంటుంది. పార్టీ విధానాలలో అనేకరకాలు ఉన్నాయి. రెండు ప్రధాన పార్టీలు మాత్రమే ఉండటం, ఒకేపార్టీ అధికారంలో పరిపాలన సాగించటం, అనేక పార్టీలు పోటీపడి ఎవరికి ఎక్కువ సంఖ్య వస్తే వారు పెత్తనంలోకి రావడం, ఏఒక్క పార్టీకీ బలంలేనప్పుడు మిశ్రమ ప్రభుత్వాలను ఏర్పరచడం-ఇత్యాదులన్నీ ఆయాదేశాలలో అమలులోఉన్నాయి. మనదేశంలో అఖిలభారత పార్టీలూ, ప్రాంతీయపార్టీలూ తమతమ ప్రణాళికలను ప్రజలలో ప్రచారం చేసుకొంటున్నాయి.

ఆంధ్రప్రదేశ్‌లోని ప్రధాన రాజకీయ పార్టీలన్నీ అఖిలభారత పార్టీలకు రాష్ట్రశాఖలు మాత్రమే. మజ్లీస్ మాత్రం స్థానికమయిన పార్టీగా ఉంది. రాష్ట్రం ఏర్పడినప్పటినుంచీ భారతజాతీయ కాంగ్రెస్ అత్యధిక సంఖ్యాబలంతో ఎన్నికలలో నెగ్గి రాష్ట్రాన్ని పరిపాలిస్తూంది. 1969లో కాంగ్రెస్ పార్టీ చీలిపోయినప్పుడు, 1978లో కాంగ్రెస్-(ఐ), కాంగ్రెస్-(ఒ) ఏర్పడినప్పుడు, ఇందిరాగాంధీ నాయకత్వాన ఉన్న పక్షానికే రాష్ట్రంలో బలం ఉంది. ఎన్నికల ప్రణాళిక, పార్టీ నియమ నిబంధనావళీ అంతా అఖిలభారత స్థాయిలోనే నిర్ణయించడం మన రాష్ట్రంలో అనుసరిస్తున్న విధానం. 1977లో దేశంలోని అనేక రాష్ట్రాలలో కాంగ్రెసుపార్టీ ఓడిపోగా ఆంధ్రప్రదేశ్‌లో 42 స్థానాలలోనూ 41 లోక్‌సభ స్థానాలు కాంగ్రెసుకు దక్కినాయి. ఇందిరాగాంధీ ప్రభావం ఈ రాష్ట్రంలో బాగా ఉందని రుజువయింది. ఆ తరవాత ఒక్క సంవత్స

రానికే శాసనసభకు ఎన్నికలు జరిగేనాటికి దేశస్థాయిలో కాంగ్రెసుపార్టీ చీలిపోయింది. దాని ప్రభావం రాష్ట్రంపైనకూడా పడింది. నాడు ముఖ్యమంత్రిగా ఉన్న జె. వెంగళరావు కాంగ్రెస్-(యు)ని అనుసరించగా, డా॥ ఎం. చెన్నారెడ్డి నాయకత్వాన కాంగ్రెస్-(ఐ) ఇందిరాగాంధీని అనుసరించినారు. 1978 శాసనసభ ఎన్నికలలో కాంగ్రెస్-(ఐ)కి అత్యధిక సంఖ్యాబలం లభించింది. రాష్ట్ర కాంగ్రెస్-(ఐ) అధ్యక్షుడుగానూ, ముఖ్యమంత్రిగానూ డా॥ చెన్నారెడ్డి కొనసాగినాడు. రాష్ట్ర కాంగ్రెస్ సంఘాన్ని నియమించినాడు. అట్లాగే జిల్లాస్థాయి సంఘాలనుకూడా తాత్కాలికంగా నియమించినాడు. చెన్నారెడ్డి స్థానంలో కాంగ్రెస్-(ఐ) రాష్ట్ర అధ్యక్షుడుగా ఎం.ఎ. అజీజ్‌ను నియమించి తాత్కాలిక సంఘాన్ని వేసినారు. 1980లో డా॥ చెన్నారెడ్డి స్థానే శ్రీ టి. అంజయ్య ముఖ్యమంత్రి అయినప్పుడుకూడా శ్రీ ఎం.ఎ. అజీజు మంత్రివర్గ సభ్యుడుగానూ, కాంగ్రెస్-(ఐ) రాష్ట్ర సంఘాధ్యక్షుడుగాను ఉన్నారు. 1981 సెప్టెంబరులో శ్రీ కోన ప్రభాకరరావు రాష్ట్ర కాంగ్రెస్-(ఐ) అధ్యక్షుడుగా నియమితుడయినాడు. ఆయన స్పీకర్ పదవికి రాజీనామా ఇచ్చి పార్టీ పదవిని చేపట్టినాడు. రాష్ట్రస్థాయి కాంగ్రెస్-(ఐ) కార్యవర్గ సంఘాన్నికూడా నియమించినాడు. జిల్లాస్థాయిలో పార్టీ సంఘాలను నియమించే నిమిత్తం అభిప్రాయ సేకరణకుగాను ఆయా మంత్రులను, కొందరు కాంగ్రెస్-(ఐ) ప్రముఖులను శ్రీ కోన ప్రభాకరరావు పురమాయించినాడు. కాంగ్రెస్-(ఐ)కి మహిళ, యువజన, విద్యార్థి, వెనకబడిన తరగతుల, హరిజన, గిరిజన విభాగాలు ఉన్నాయి. వీటికికూడా తాత్కాలిక సంఘాలను నియమించినారు. పార్టీ సభ్యత్వం చేర్పించటం, పార్టీలో ఎన్నికలు జరపటం చేపట్టవలసిఉంది. ఈ పార్టీని అసలయిన కాంగ్రెస్‌గా ఎన్నికల కమీషనరు గుర్తించినారు. కనక భారత జాతీయ కాంగ్రెస్ చరిత్రే ఈ పార్టీ చరిత్రగా భావించవచ్చు.

కాంగ్రెస్-(ఎస్)

ప్రస్తుతం రాష్ట్ర కాంగ్రెసు(ఎస్)పార్టీ అధ్యక్షుడుగా రాజ్యసభ సభ్యుడు శ్రీ వి. బి. రాజు ఉన్నారు. అఖిలభారతస్థాయిలో పార్టీ అధ్యక్షుడుగా మహారాష్ట్ర మాజీముఖ్యమంత్రి శరద్‌పవార్ ఎన్నికయినప్పటి నుంచీ ఈ పార్టీకి కాంగ్రెస్(ఎస్) అని వాడుకవచ్చింది. లోగడ ఈ పార్టీలో ప్రముఖుడుగా ఉన్న మాజీముఖ్యమంత్రి శ్రీ జె. వెంగళరావు 1981 అక్టోబరులో పార్టీ నుంచి వైదొలగినారు. 1978లో ఈ పార్టీకి 30 మంది శాసనసభ్యులు ఎన్నిక కాగా, 1981 నవంబరు నాటికి ఒక్కరుకూడా పార్టీలో లేరు. విధాన పరిషత్తులో ప్రధాన ప్రతిపక్షంగా ఈ పార్టీకి బలం ఉండేది. అక్కడకూడా క్రమేణ సభ్యులందరూ తొలగిపోగా శ్రీ రొండా నారపరెడ్డి మాత్రం నిలిచినాడు.

రాష్ట్రస్థాయిలోనూ, జిల్లాస్థాయిలోనూ తాత్కాలిక సంఘాలు నియమించటం తప్ప సభ్యత్వం చేర్పించటంగానీ, ఎన్నికలు జరిపించటంగానీ చేపట్టలేదు. అసలైన భారత జాతీయ కాంగ్రెసుగా గుర్తింపుకావాలని ఈ పార్టీ కోరినప్పటికీ ఎన్నికల కమీషనర్ పరిశీలించిన మీదట అందుకు నిరాకరించినారు.

**లోక్‌దళ్**

జనతాపార్టీ నుంచి చీలిపోయిన వివిధ పక్షాలలో, చరణ్‌సింగ్ నాయకత్వాన లోక్‌దళ్ ఒక పక్షంగా ఏర్పడింది. రాష్ట్రస్థాయిలో ఈ పార్టీ శాఖకు శ్రీ గౌతులచ్చన్న అధ్యక్షులు. ఆయనే శాసనసభలో లోక్‌దళ్ పక్షనాయకుడుకూడా. 1981 అక్టోబరు నాటికి విధానసభలో లోక్‌దళ్ సభ్యులు 7 గురు ఉన్నారు. రాష్ట్రస్థాయిలోనూ, జిల్లాస్థాయిలోనూ నియమించిన సంఘాలు మాత్రమే ఉన్నాయి.

**జనతా పార్టీ**

1977లో ఏర్పడిన జనతాపార్టీ 1980లో చీలిపోగా, మొరార్జీదేశాయి, చంద్రశేఖర్, సుబ్రమణ్యస్వామివంటివారి నాయకత్వాన జనతాపార్టీఏర్పడింది. రాష్ట్రంలో ఆపార్టీకి శాఖగా కొనసాగిన పార్టీకి పి. బాబుల్‌రెడ్డి అధ్యక్షుడుగా ఉన్నారు. రాష్ట్ర, జిల్లాస్థాయిలలో సంఘాలను నియమించినారు. విధానసభలో నలుగురు సభ్యులతోగూడిన ఈ పార్టీకి శ్రీ జయపాల్‌రెడ్డి నాయకత్వం వహించినారు. ఈ పార్టీకి యువకులలోనూ, మహిళలలోనూ, విద్యార్థులలోనూ అనుబంధ శాఖలు ఉన్నాయి.

**భారతీయ జనతా పార్టీ**

జనతాపార్టీలో చీలిక వచ్చిన తరవాత ఈ పార్టీ రూపొందినది. లోగడ జనసంఘ్ సభ్యులందరూ ఇందులో కొనసాగినారు. రాష్ట్రస్థాయిలో చలపతిరావు అధ్యక్షుడుగా ఒక సంఘాన్ని ఏర్పరచినాడు. సభ్యత్వం చేర్పించి, వివిధ స్థాయిలలో పార్టీఎన్నికలు జరిపించినాడు. విధానసభలో ముగ్గురు సభ్యులుగల ఈ పార్టీకి ఎం. వెంకయ్యనాయుడు నాయకత్వం వహిస్తున్నాడు. విధానపరిషత్తులో ఈ పార్టీకి నలుగురు సభ్యులున్నారు. కార్మిక, మహిళ, విద్యార్థి, యువజన రంగాలలో ఈ పార్టీకి అనుబంధశాఖలు ఏర్పడి పనిచేస్తున్నాయి. పార్టీ ప్రచార నిమిత్తం 'జాగృతి' అనే వారపత్రికను వెలువరిస్తున్నారు. 1981లో జరిగిన విశాఖపట్టణం మునిసిపల్ కార్పొరేషన్ ఎన్నికలలో భారతీయ జనతాపార్టీ అభ్యర్థులకు అధిక సంఖ్య చేకూరటంవల్ల మేరార్ పదవిలభించింది.

**మజ్లిస్-ఇత్తెహాదుల్ ముస్లిమీన్**

1930 నుంచి 1948లో పోలీసుచర్య వరకూ ఈ పార్టీ ఎదురులేని రాజకీయ పక్షంగా చెలామణి అయింది. పోలీసు చర్య సందర్భంగా కాశింరజ్వీ

పార్టీకి నాయకత్వం వహించినాడు. నిజాం పాలన అంతమై హైదరాబాదు సంస్థానం భారత దేశంలో విలీనమైన తరవాత పదేళ్ళపాటు మజిలీస్ అదృశ్య మయింది. 1957 లో తిరిగి అబ్దుల్ వహీద్ ఒవాసీ నాయకత్వాన మజిలీస్ మళ్ళీ ప్రారంభమయింది. 1958లో కొత్తపార్టీ రాజ్యాంగాన్ని ఏర్పరచి ఎన్ని కలలో పాల్గొనటానికి సంసిద్ధులయినారు. మున్సిపల్ ఎన్నికలలో పాల్గొనటం ప్రారంభించి క్రమేణ శాసనసభ ఎన్నికలల్లో అభ్యర్థిని నిలబెట్టేవరకూ వచ్చినారు. 1962 సాధారణ ఎన్నికలలో రాజధానిలోని 9 శాసనసభ స్థానా లలో ఎనిమిది స్థానాలకు పోటీచేసినారు. పోటీచేసిన నియోజక వర్గాలలో 24 శాతం ఓట్లు తెచ్చుకున్నప్పటికీ ఒక్కస్థానాన్ని మాత్రమే గెలుచుకోగలిగి వారు. 1967 సాధారణ ఎన్నికలలో మజిలీస్‌కు ప్రత్యర్థిగా జనసంఘ్ రంగంలోకి ప్రవేశించింది. ఆస్థానాలలో పోటీచేసిన మజిలీస్ 3 స్థానాలను రాజ ధానిలో గెలుచుకొంది. 1978 శాసనసభ ఎన్నికలలో మజిలీస్‌కు రాజధానిలో మళ్ళీ 3 స్థానాలు వచ్చినాయి. అయితే ఈసారి మజిలీస్ తెలంగాణాలో 14 స్థానాలలో పోటీ చేసినారు.

మజిలీస్‌కు ప్రధాన సమస్య ముస్లిముల సంక్షేమం మాత్రమే. నిర్దిష్టమైన ఎన్నికల ప్రణాళిక గానీ, పథకంగానీ వారికి లేదు. ప్రభుత్వం ముస్లిములపట్ల అశ్రద్ధ వహిస్తున్నదనేది వారి విమర్శలలో ఎక్కువగా కనిపిస్తూంది. శ్రీ సలా ఉద్దీన్ ఒవాసీ నాయకత్వాన మజిలీస్ బయట, శాసనసభలోనూ కొనసాగు తూంది. శ్రీయుతులు అమానుల్లాఖాన్, బాఖర్ ఆగా అనే ఇరువురుకూడా శాసనసభలో మజిలీస్ సభ్యులుగా ఉన్నారు. ఈ పార్టీకి ఎంతమంది సభ్యు లున్నారో, ఎన్నికలు ఎట్లా జరుగుతాయి అనేది తెలియదు.

**రిపబ్లికన్ పార్టీ**

భారత రిపబ్లికన్ పార్టీ రాష్ట్రశాఖగా, మాజీ శాసనసభ్యురాలు శ్రీమతి ఈశ్వరీబాయి నాయకత్వాన రాష్ట్రంలో ఈపార్టీ ఉంది. ఉభయ శాసనసభ లలో ప్రస్తుతం ఈ పార్టీకి సభ్యులులేరు. దళితజాతుల ఉద్ధరణకై అంబేద్కర్ ఆశయాల ఆధారంగా ఈ పార్టీ కృషి చేస్తూంది.

**కమ్యూనిస్టు పార్టీలు**

రాష్ట్రంలో కమ్యూనిస్టుపార్టీ ఏర్పడి నలభై ఐదు సంవత్సరాలుగా కృషిచేస్తూంది. 1964లో కమ్యూనిస్టుపార్టీ చీలిపోయేటంతవరకూ ఈపార్టీ అనేక ప్రజాఉద్యమాలను చేపట్టి పోరాటాలు సాగించింది. అందులో ప్రపంచ ప్రసిద్ధి చెందిన తెలంగాణా పోరాటం 1946 నుంచి 51 వరకూ జరిగింది. మూడు సాధారణ ఎన్నికలలో పాల్గొన్న అనంతరం కమ్యూనిస్టుపార్టీ ప్రథమంగా చీలిపోయింది. భారత కమ్యూనిస్టు పార్టీ అని (సి.పి.ఐ.) కమ్యూ నిస్టుపార్టీ (మార్క్సిస్టు) (సి.పి.ఐ.ఎం) అని వీటికి నామకరణం చేసినారు. ఈ

చీలికకు సిద్ధాంతపరంగానూ, ఆచరణపరంగానూ కారణాలు అనేకం ఉన్నాయి. 1967లో రెండు పార్టీలూ ఎన్నికలలో పాల్గొన్నాయి. 1968 నాటికి సి.పి.ఐ.(ఎం)లో మరొక చీలికవచ్చి విడిపోయిన వారంతా సి.పి.ఐ. (ఎం.ఎల్)గా రూపొందినారు. ఆ తరవాత జరిగిన సాధారణ ఎన్నికలలో ఉభయ కమ్యూనిస్టుపార్టీలు పోటీచేయగా ప్రప్రథమంగా 1978లో సి.పి.ఐ (ఎం.ఎల్)లోని ఒక వర్గంకూడా ఎన్నికలలో పోటీచేసింది. 1969లో జరిగిన ప్రత్యేక తెలంగాణా ఆందోళనలోనూ, 1972లో జరిగిన ప్రత్యేక ఆంధ్ర ఆందోళనలోనూ ఉభయకమ్యూనిస్టుపార్టీలుకూడా సమైక్య రాష్ట్రంకోసమే నిలబడినాయి. 1980లో అంతవరకూ భారత కమ్యూనిస్టుపార్టీ అధ్యక్షుడుగా ఉన్న డాంగే చీలిపోగా, ఆయన నాయకత్వాన ఇండియన్ కమ్యూనిస్టుపార్టీ ఏర్పడింది. ఈ రాష్ట్రంనుంచి చాలా కొద్దిమంది మాత్రమే డాంగే పక్షంలో చేరినారు. కమ్యూనిస్టు పార్టీలకు మహిళా, కార్మిక, కర్షక, విద్యార్థి, యువ జన రంగాలలో అనుబంధ సంస్థలుఉన్నాయి. పార్టీ సాహిత్యం విరివిగా ప్రచురించి ప్రచారం చేయడం, పత్రికలు ప్రచురించటం జరుగుతూంది. కమ్యూనిస్టు పార్టీ, మార్క్సిస్టు, లెనినిస్టువర్గం 1968 నుంచి నేటివరకూ అనేక ముఠాలుగా చీలిపోయింది. ప్రస్తుతం రాష్ట్రంలో తొమ్మిది పార్టీలుగా వ్యవహరిస్తూంది. వీటికి అఖిలభారత స్థాయిలో ఉన్నపార్టీలకు సంబంధం ఉంది. రాష్ట్రంలో ఉన్న పార్టీల పేర్లు :

సి.పి.ఐ(ఎం.ఎల్); చంద్రపుల్లా రెడ్డివర్గం, ప్రజాపోరాటవర్గం; రవూఫ్ వర్గం; లింపియావో వ్యతిరేక, చారు మజుందార్ అనుకూల వర్గం, లింపియావో అనుకూల వర్గం; దేవులపల్లి వెంకటేశ్వరరావువర్గం, చల్లపల్లి శ్రీనివాసరావువర్గం కొల్లా వెంకయ్య వర్గం, మామిడి అప్పలసూరి వర్గం, ఈ వర్గాలన్నిటికీ అనుబంధ సంస్థలుగా విద్యార్థి సంఘాలు, రైతుకూలీ సంఘాలూ' రచయితల సంఘాలూ, పౌరహక్కుల సంఘాలూ, కార్మిక సంఘాలూ, సాంస్కృతిక సంఘాలూ, భారత చైనామైత్రి సంఘాలూ ఉన్నాయి. వీరందరూ నడుపుతున్న పత్రికలు తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ కలిపి 24 వరకూ ఉన్నాయి. ఈ పార్టీలు రహస్య కార్యకలాపాలలో నిమగ్నమై ఉన్నందున, వీటి సభ్యత్వం ఎంతో, పార్టీలో ఎన్నికలు ఎట్లా జరుపుతారో తెలియదు. కాని ప్రణాళిక ఉన్నట్లు 1978 ఎన్నికలలో తెలిసింది.

సి.పి.ఐ.కి శాసనసభలో 6 స్థానాలుఉన్నాయి. శ్రీ సి. హెచ్. రాజేశ్వర రావు ఈ పార్టీకి నాయకత్వం వహిస్తున్నాడు. శ్రీ గిరిప్రసాద్ పార్టీకార్యదర్శిగా ఉన్నాడు.

సి.పి.ఐ.(ఎం)కు శాసనసభలో 8 స్థానాలు ఉన్నాయి. శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య నాయకత్వం వహిస్తున్నాడు. విధానపరిషత్తులో సి.పి.ఐ.కి కె.ఎల్. మహేంద్ర, సి.పి.ఐ(ఎం)కు మోటూరు హనుమంతరావు నాయకత్వం వహిస్తు

న్నారు. సి.పి.ఐ.కు విశాలాంధ్ర, సి.పి.ఐ.(ఎం)కు ప్రజాశక్తి అనే దినపత్రికలు ఉన్నాయి.

**ఒత్తిడి వర్గాలు :**

అధికారానికి రావాలనని తలపెట్టకుండా, పరిమిత వర్గ ప్రయోజనాన్ని సాధించుకొనే నిమిత్తం కొన్ని సంస్థలు, సంఘాలు కృషి చేస్తుంటాయి. వీటిని ఒత్తిడి వర్గాలు అని అంటారు. సంఘటితంగా ఉండే సంస్థలు తమలక్ష్యాలను, కోర్కెలను సాధించుకోడంలో కృత కృత్యులవుతుంటాయి. ఇటువంటివి కార్మిక, కర్షక, విద్యార్థి, యువజన, గిరిజన, హరిజన, వెనకబడిన తరగతులు, ఉద్యోగులు, ఉపాధ్యాయులు మొదలైన రంగాలలో స్పష్టంగా చూడవచ్చు. వాటిలో ప్రజలకు అత్యవసరమైన సర్వీసులకు సంబంధించిన వాటిలోపనిచేసేవారు ఒత్తిడి తెస్తే ప్రభుత్వాలు ప్రభావింతం కావడం గమనార్హం.

ప్రభుత్వంపై ఒత్తిడిచేసి తమకోర్కెలను సాధించు కోవడంలో అనేక వత్తిడి వర్గాలు కృతకృత్యులవుతున్నారు. ముఖ్యంగా సంఘటితంగా ఉండే సంఘాలు ఇటువంటి కృషిలో బాగాసఫలమవుతున్నాయి. ఈ వర్గాలు నగరాలలో ఎక్కువగా కనిపిస్తున్నాయి. కార్మిక సంఘాలలో కూడా వీటి ప్రభావం బాగా ఉంది. రాజకీయ పార్టీలు ఈ ఒత్తిడి వర్గాలను ఆకట్టుకోడానికి తమకు అనుబంధ సంస్థలుగా చేసుకోడానికి ప్రయత్నిస్తూంటారు. ప్రభుత్వ ఉద్యోగుల సంఘాలు, వైద్యుల సంఘాలు, నర్సుల సంఘాలు, ఉపాధ్యాయుల సంఘాలూ, ఇంజనీర్ల సంఘాలు, రవాణాశాఖ కార్మికుల సంఘాలూ, వర్తక సంఘాలూ, బాగా సమర్థవంతంగానూ సంఘటితంగానూ పనిచేస్తుంటాయి. ఈ సంఘాలు తమకోర్కెలను సాధించుకోటానికి అవలంబించే పద్ధతులలో ఊరేగింపులూ, కరపత్రాల ప్రచురణ, ధరణసత్యాగ్రహాలూ, నిరాహారదీక్షలూ, సమ్మెలూ,నియమబద్ధంగాపనిచేయడం, సహాయనిరాకరణ మొదలైనపద్ధతులను అవలంబిస్తుంటారు. ఇవిగాక ఘెరావ్, ఆమరణనిరాహారదీక్ష, ఆత్మాహుతి మొదలైన తీవ్రచర్యలను కూడా కొన్ని సందర్భాలలో అవలంబిస్తారు. సర్వసాధారణంగా ఆర్థిక పరమైన కోర్కెలతోనే ఈ ఒత్తిడి వర్గాలుప్రభుత్వంపై ప్రభావం చూపెట్టటానికి కృషిచేస్తాయి. సంఘటితం కాని వర్గాలు, ముఖ్యంగా రైతులు, వ్యవసాయ కూలీలు తమ కోర్కెలు తీర్చుకోవడానికి విజ్ఞప్తులపైన రాజకీయ పార్టీల ఆందోళనలపైన ఆధారపడవలసి వస్తూంది. అదీగాక, గ్రామాలలో ఉన్న వారిని సంఘటిత పరచటానికి, ఒకచోట చేర్చటానికి అనేక వ్యయ ప్రయాసలు పడవలసి వస్తూంది. నగరాలలో రవాణా సౌకర్యాలవల్ల, వార్తా ప్రసార సదుపాయాలవల్ల, వివిధ సంఘాలను సంఘటిత పరచటం సులభంగా ఉంది. ఒత్తిడి వర్గాలలో ప్రధానపాత్ర వహించే వారినిగా విద్యార్థులను, ముఖ్యంగా కళాశాల విద్యార్థులను పేర్కొనవచ్చు. విద్యారంగంలో ఆర్థిక సౌకర్యాల నిమిత్తం, తదితర విషయాలకై వీరు తమ సంఘటితశక్తిని ప్రయోగిస్తూంటారు.

ఉపాధ్యాయ వర్గాలు తమ కోర్కెలు సాధించుకొనే నిమిత్తం ఎన్ని మార్గాలు అవలంబించినా పరిష్కారం కానప్పుడు, పరీక్షల సమయంలో సమ్మె పిలుపును ఇచ్చి అదొక ఒత్తిడి పద్ధతిగా ప్రయోగించటం జరుగుతూంది. ప్రభుత్వం ఎన్ని హెచ్చరికలు చేసినప్పటికీ, ప్రత్యామ్నాయ మార్గాలు ఆలోచించినప్పటికీ, ఇట్లాంటి సమయంలో లొంగిరాక తప్పడంలేదు. అట్లాగే ఎన్నికల సమయం వచ్చినప్పుడు ఉద్యోగులు తమ కోర్కెల నిమిత్తం ఒత్తిడి చేస్తే పాలకవర్గం లొంగవలసి వస్తున్నది. అత్యవసర సర్వీసులుగా కొన్నిటిని గుర్తించి వారు సమ్మె చేయరాదని ఆర్డినెన్సులు జారీ చేసినప్పటికీ ప్రయోజనం లేకపోతోంది. విద్యుత్ సరఫరా, నీటిసరఫరా, రైల్వేలు, టెలిగ్రాఫ్, టెలిఫోన్ మొదలయిన శాఖలు అత్యవసరమైనవిగా ప్రభుత్వం గుర్తించింది. అయినప్పటికీ ఈ శాఖలలో సమ్మెలు జరుగుతూనే ఉంటాయి. అట్లాగే రవాణాశాఖలో పనిచేసే డ్రైవర్లు సిబ్బంది సమ్మెకు పూనుకుంటే, ప్రయాణీకులు ఇబ్బందులకు గురి అవుతారు. ప్రభుత్వం మార్గాంతరాలను ఏర్పరచవలసి ఉంటుంది. అయితే తాత్కాలికంగా మాత్రమే ఇట్లాంటి ఏర్పాట్లు సాధ్యమవుతాయి. శాసనసభలు సమావేశంలో ఉన్నప్పుడు ఒత్తిడివర్గాలు సభ్యుల ద్వారా ప్రభుత్వంపై ఒత్తిడి తేవడం, బయట ప్రదర్శనలు జరపటం గమనార్హం. తలవని తలంపుగా కొన్ని ఒత్తిడివర్గాలు బయలుదేరుతుంటాయి. స్త్రీలపై అత్యాచారాలు జరిగినప్పుడు, పోలీసులాకప్‌లో ఎవరయినా చనిపోయినప్పుడు, చాలామంది ప్రజలు నిరసన తెలియజేయడం, న్యాయవిచారణ కోరడం జరుగుతుంటుంది. ప్రభుత్వం మొండివైఖరి అవలంబిస్తే, ఆందోళన ఎక్కువై, పోలీసు కాల్పులు, కర్ఫ్యూలవరకూ పోయిన సంఘటనలు ఉన్నాయి. ఇటువంటి సందర్భాలలో న్యాయవిచారణ వంటివి ప్రకటించగానే ఆందోళన సమసిపోయి ఒత్తిడి వర్గాలు అదృశ్యమవుతాయి. ఈ విధంగా రాజకీయ పార్టీలేగాక, సంఘటితమయిన ఒత్తిడి వర్గాలు సమాజంపై, ప్రభుత్వంపై తమ ప్రభావాన్ని చూపెట్టడం జరుగుతున్నది.

# 7

# ఎన్నికలు-ఓటింగు సరళి

ఆంధ్రప్రదేశ్ ఏర్పడినప్పటినుంచి నేటివరకు రాష్ట్రంలో జరిగిన శాసన సభ సాధారణ ఎన్నికలన్నింటిలోనూ కాంగ్రెస్‌పార్టీ అత్యధిక సంఖ్యాబలాన్ని సమకూర్చుకొంది. కాంగ్రెస్‌పార్టీ 1969 లోనూ 1977 లోనూ రెండుపర్యా యాలు చీలిన అనంతరం, ఇందిరాగాంధి నాయకత్వానగల కాంగ్రెసుకే బలం వచ్చింది. ప్రతిపక్షాలకు చాలా తక్కువ స్థానాలు లభిస్తున్నాయి. 1978లో ఒకే ఒకసారి ప్రధాన ప్రతిపక్షం కావడానికి తగిన బలం ప్రతిపక్షానికి లభించింది. కాని ప్రతిపక్షాల చీలికవల్ల ఆ బలం అట్టేకాలం నిలవలేదు. అదీగాక, ప్రతి పక్షాలనుంచి కొందరు అధికార పక్షంలో చేరడంవల్ల కూడా ఇటువంటి పరిస్థితి ఏర్పడుతూ వచ్చింది.

రాష్ట్రం ఏర్పడినప్పటినుంచీ నేటివరకూ పార్టీల పరిస్థితికూడా చాలా మారింది. 1956 తరవాత మొట్టమొదట ఏర్పడిన సోషలిస్టు డెమోక్రటిక్ పార్టీ ఎన్నికలలో పాల్గొనకుండానే అంతరించింది. 1969లో ప్రారంభమయిన ప్రజాసమితి 1970లో రాజకీయపార్టీగా మారింది. 1971 లోక్‌సభ ఎన్నికలలో 10 స్థానాలుగెలుచుకొన్న ఈపార్టీ 1972శాసనసభ ఎన్నికలనాటికి కాంగ్రెస్‌లో విలీనం అయిపోయింది

1962 లో ఎన్నికలలో పాల్గొని 1972 వరకూ ప్రతి ఎన్నికలో పోటీ చేసిన స్వతంత్రపార్టీ అఖిలభారత స్థాయిలోనే రద్దు అయింది. ఆపార్టీ వ్యక్తులు ఇతర పార్టీలలో చేరినారు. 1952 నుంచీ ఎన్నికలలో పోటీచేస్తూ వచ్చిన జనసంఘ్ 1977 నాటికి జనతాలో విలీనం అయింది. ఆ తరవాత 1980లో చీలి భారతీయ జనతాపార్టీగా మారింది.

ప్రజా సోషలిస్టు పార్టీ, కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ, సంయుక్త సోష లిస్టు పార్టీ, భారతీయ క్రాంతిదళ్ ఇత్యాది పార్టీలుకూడా రూపాంతరాలు చెందినాయి. ఆ ప్రభావం రాష్ట్రస్థాయిలోనూ కొంత ఉంది.

కమ్యూనిస్టు పార్టీ 1956 నుంచీ ఎన్నికలలో రాష్ట్రంలో పాల్గొని కొన్ని స్థానాలు తెచ్చుకోగలిగింది. అయితే 1964లో పార్టీ చీలిన ఫలితంగా ఎన్నికల ఫలితాలలో కూడా మార్పు వచ్చింది. ముందుగా కమ్యూనిస్టుపార్టీకి ఆయా ఎన్నికలలో వచ్చిన ఓట్ల వివరాలు, ఓటింగ్ సరళి పరిశీలిద్దాము.

1978లో భారత కమ్యూనిస్టుపార్టీ, మార్క్సిస్టుపార్టీ, కమ్యూనిస్టుపార్టీ మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీ పోటీ చేసినాయి. కమ్యూనిస్టు పార్టీ 31 స్థానాలకు

పోటీచేసి ఆయుచోట్ల నెగ్గగా, మార్క్సిస్టుపార్టీ 22 స్థానాలకు పోటీచేసి 8 స్థానాలను గెలుచుకోగలిగింది. మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీకి ఒకే ఒకస్థానం వచ్చింది. ఆ ఒక్కరుకూడా తరవాత కాంగ్రెసు 'ఐ'లో చేరిపోవటంవల్ల శాసనసభలో ఉభయ కమ్యూనిస్టు పార్టీలే మిగిలినాయి. ఈ రెండు పార్టీలుకూడా సమంగా ఓట్లశాతంలో నిలబడటం విశేషం. 2.4 శాతం ఇద్దరికీ వచ్చినాయి.

1977 లో జరిగిన లోక్‌సభ ఎన్నికలలో భారత కమ్యూనిస్టు పార్టీ 10 స్థానాలకూ, మార్క్సిస్టుపార్టీ 6 స్థానాలకు పోటీచేసినా, ఒక్కస్థానంకూడా రాలేదు. అయితే సి.పి.ఐ.కి 4,46,044 ఓట్లు వచ్చినాయి. మార్క్సిస్టుపార్టీకి 7,86,719 ఓట్లు వచ్చినాయి.

కాంగ్రెస్ పార్టీలు :

1978 శాసనసభ ఎన్నికల నాటికి కాంగ్రెసుపార్టీ రెండుగా చీలిపోయింది. ఇందిరాగాంధీ నాయకత్వానగల కాంగ్రెసుకు కాంగ్రెసు-(ఐ) అని పేరురాగా, రెండవకాంగ్రెసును భారతజాతీయకాంగ్రెసు అన్నారు. ఈఎన్నికలలో కాంగ్రెసు-(ఐ)కి 175 స్థానాలు రాగా భారత జాతీయ కాంగ్రెసుకు 30 స్థానాలు వచ్చినాయి. కాంగ్రెసు-(ఐ)కి 39 శాతం, భారతజాతీయ కాంగ్రెసుకు 17.10 శాతం ఓట్లు లభించినాయి. క్రమేణ, భారత జాతీయ కాంగ్రెసులోని వారంతా కాంగ్రెసు-(ఐ)లో చేరిపోగా శాసనసభలో ఒక్కరు మాత్రమే ఆ పార్టీలో మిగిలినారు. రాష్ట్ర కాంగ్రెసు-(ఐ) అధ్యక్షుడుగా డాక్టర్ మర్రి చెన్నారెడ్డిని, కాంగ్రెసు-(ఐ) అధ్యక్షురాలు ఇందిరాగాంధీ నియమించింది. ఎన్నికల అనంతరంకూడా ఆయనకొన్నాళ్ళు ఈ స్థానాన్ని నిర్వహించినాడు. ఇందిరాగాంధీ 170 నియోజకవర్గాలలో పర్యటించడం ఓటర్లను చాలా విశేషంగా ప్రభావితం చేసింది. పేదవర్గాలకు జరిగిన ప్రయోజనాలు ఆమెపేరిట జరగటంవల్ల ఆ వర్గాలు కాంగ్రెసు-(ఐ) పార్టీకి ఓటు చేసినాయి. స్త్రీలు అధికంగా వచ్చి ఓటింగులో పాల్గొని కాంగ్రెసు-(ఐ)ని గెలిపించటంలో తోడ్పడినారు. జనతాపార్టీ, భారత జాతీయ కాంగ్రెసుకూడా పేద వర్గాలకు అనుకూలం కాదనే ప్రచారం తోడ్పడింది. జనతాపార్టీకి 59 స్థానాలు లభించినాయి. 28.74 శాతం ఓట్లు వచ్చినాయి. ఈ పార్టీ ఎన్నికలలో ఇందిర వ్యతిరేక ప్రచారం చేసింది. అత్యవసర పరిస్థితి పౌరహక్కులను హరించిన విధానాన్ని వివరించింది. ఈ పార్టీ శాసనసభలో ప్రధాన ప్రతిపక్షంగా రూపొందింది. ఐతే దేశస్థాయిలో జనతాపార్టీ చీలిపోయినపుడు రాష్ట్రంలో అదేవిధంగా పార్టీ చీలిపోయింది. భారతీయ జనతాపార్టీ, లోక్‌దళ్, జనతా పార్టీ అనేవి రాష్ట్రంలో ఏర్పడినాయి. శాసనసభలో ఆయా పార్టీలలో చేరినవారుగాక కొందరు కాంగ్రెసు-(ఐ)లో చేరిపోయినారు. శాసనసభలో ప్రధానప్రతిపక్షస్థానంకూడా కోల్పోయినారు. భారతీయ జనతాపార్టీకి 3, జనతాపార్టీకి 4, లోక్‌దళ్‌కు 7 స్థానాలు శాసనసభలో మిగిలినాయి.

1978 శాసనసభ ఎన్నికలలో మజ్లిస్‌కు 3 స్థానాలు లభించినాయి.

మొత్తం ఆరుస్థానాలలో పోటీచేసి 8 స్థానాలు గెలుచుకొన్నారు. రాజధానిలో మాత్రమే నెగ్గిన ఈ మూడు స్థానాలు 32.10 శాతం ఓట్లు కలవి. మొత్తం 71 స్థానాలలో అన్ని పార్టీలకు చెందిన ముస్లిం అభ్యర్థులు నిలబడగా 8 స్థానాలు గెలుచుకొన్నారు. అంటే మజిలీస్ కానివారు 5 మంది ఉన్నారన్నమాట.

రాష్ట్రంలో ఓటర్లు అత్యధిక సంఖ్యాకులుగా హిందువులు ఉన్నారు. 82.6 శాతం వీరికి దక్కుతుంది. మొత్తం ఓటర్లలో ఐదింట నాల్గువంతులు హిందువులన్నమాట. మిగిలిన ఓటర్లలో ముస్లిములు 13.8 శాతం కాగా, క్రైస్తవులు 3.4 శాతం ఉన్నారు. మొత్తం ఓటర్లను వివరించిచూస్తే, హిందువులలో 27.5 శాతం అట్టడుగు వర్గాలకు చెందినవారు ఉన్నారు. కేవలం హరిజనులకు, గిరిజనులకు చెందినవారు ఇందులో 16.1 శాతం ఉన్నారు. ఎన్నికల సమయంలో ఓటర్లను ఆయాపార్టీల అభ్యర్థులూ, పార్టీ కార్యకర్తలూ కలుసుకోవడం, బహిరంగ సభలు ఏర్పరచడం, ఊరేగింపులు జరపడం, కరపత్రాలూ, గోడలపై వ్రాతలద్వారా ప్రచారం చేయటం, పత్రికలూ, రేడియో వల్ల వార్తలు తెలిసికొనడం ప్రధానంగా జరుగుతూంటుంది. కులమూ, మతమూ, ప్రాంతం, ఎన్నికల ప్రణాళికలూ ఇత్యాదులన్నీ పని చేస్తాయి. ధనం, సారాయి, ఇతర వసతులేర్పరచటంకూడా జరుగుతుంది. వీటిలో ఏది ఓటర్ను ఎంతవరకు ప్రభావితం చేసిందనేది నిర్ధారించడానికి సమగ్రమయిన, నిష్పాక్షికమైన సర్వే జరగవలసి ఉంది. సాధారణంగా ఎన్నికలలో జరిగిన అవినీతి పనులు, చట్టవిరుద్ధ చర్యలు న్యాయస్థాన విచారణలో బయట పడుతూంటాయి. అయితే కోర్టుకు ఫిర్యాదుచేసిన స్థానాలవరకే ఈ విషయాలు పరిమితమవుతాయి. కోర్టులో రుజువు కానివి ఉండవచ్చు. ఎన్నికలలోజరిగే వాటన్నిటికీ సాక్ష్యాలు సేకరించడం, రుజువు చేయడం సాధ్యమయ్యేపనికాదు. ఎన్నికలలో ప్రవర్తించవలసిన తీరును గురించి, ఓటు విలువను గురించి ఎన్నికల కమీషనర్ సాధ్యమయినంతవరకూ తెలియచెప్పడానికి ప్రయత్నిస్తూఉంటాడు. ఓటు పవిత్రమైనదనీ, ఎవరికి ఓటు వేసినదీ ఎట్టిపరిస్థితులలోనూ బయటకు తెలియదు గనక నిర్భయంగా ఓటు చేయవచ్చునని స్పష్టం చేస్తారు. అయినప్పటికీ ఓటర్లందరూ తమ ఓటును వినియోగించరు. ఎక్కడో అరుదుగా తప్ప నూటికి నూరుశాతం ఓట్లు పోలుకావు. ఆయాపార్టీల వారూ, అభ్యర్థుల పక్షాలవారూ ఓటర్లను పోలింగ్ బూత్‌లకు తీసుకురావడానికి ఎన్నో విధాల ప్రయత్నిస్తారు. అటువంటి అవసరం కూడా లేకుండా నడిచివెళ్ళి ఓటు వేసివచ్చేటంత సమీపంలోనే పోలింగ్‌బూత్‌లను ఏర్పరుస్తున్నారు. ఏమైనప్పటికీ ఓటర్లపై పార్టీల ప్రచార ప్రభావం ఉంది.

## అసెంబ్లీలో రాజకీయ పార్టీ బలాబలాలు [ప్రాంతాలవారీగా 1955-78]

### కాంగ్రెస్ (ఐ)

| క్ర.సం. | ప్రాంతం | ఎన్నిక | మొత్తం సీట్లు | పోటీచేసినవి | గెలిచినవి | పోలైనఓట్లు % |
|---|---|---|---|---|---|---|
| 1 | సర్కారు జిల్లాలు | 1955 | 141 | — | — | — |
| | | 1962 | 140 | — | — | — |
| | | 1967 | 134 | — | — | — |
| | | 1972 | 134 | — | — | — |
| | | 1978 | 134 | 118 | 75 | 37.17 |
| 2 | రాయలసీమ | 1955 | 55 | | | |
| | | 1962 | 54 | | | |
| | | 1967 | 52 | | | |
| | | 1972 | 52 | | | |
| | | 1978 | 53 | 50 | 35 | 40.76 |
| 3 | తెలంగాణా | 1957 | 105 | — | — | — |
| | | 1962 | 106 | — | — | — |
| | | 1967 | 101 | — | — | — |
| | | 1972 | 101 | — | — | — |
| | | 1978 | 107 | 106 | 65 | 38.64 |

అసెంబ్లీలో రాజకీయపార్టీల బలాబలాలు (ప్రాంతాలవారీగా 1955-78)

సి. పి. ఐ (ఎం)

| క్ర.సం. | ప్రాంతం | ఎన్నిక | సీట్లు | పోటీచేసినవి | గెలిచినవి | పోలైన ఓట్లు% |
|---|---|---|---|---|---|---|
| 1. | సర్కారు జిల్లాలు | 1955 | 141 | — | — | — |
| | | 1962 | 140 | — | — | — |
| | | 1967 | 134 | 44 | 3 | 8.4 |
| | | 1972 | 134 | 14 | 0 | 2.7 |
| | | 1978 | 134 | 12 | 3 | 3.2 |
| 2. | రాయలసీమ | 1955 | 55 | — | — | — |
| | | 1962 | 54 | — | — | — |
| | | 1967 | 52 | 11 | 2 | 4.7 |
| | | 1972 | 52 | 2 | 0 | 0 7 |
| | | 1978 | 53 | 1 | 0 | 0.26 |
| 3. | తెలంగాణా | 1957 | 105 | — | — | — |
| | | 1962 | 106 | — | — | — |
| | | 1967 | 101 | 29 | 5 | 8.5 |
| | | 1972 | 101 | 16 | 1 | 5.2 |
| | | 1978 | 107 | 9 | 5 | 3.14 |

అసెంబ్లీలో రాజకీయపార్టీల బలాబలాలు (ప్రాంతాలవారీగా 1955-78)

కమ్యూనిస్టులు (సి. పి. ఐ)

| క్ర.సం. | ప్రాంతం | ఎన్నిక | సీట్లు | పోటీచేసినవి | గెలిచినవి | పోలైనఓట్లు% |
|---|---|---|---|---|---|---|
| 1. | సర్కారు | 1955 | 141 | 29 | 16 | 34.7 |
| | జిల్లాలు | 1962 | 140 | 73 | 28 | 21.9 |
| | | 1967 | 134 | 51 | 5 | 8.4 |
| | | 1972 | 134 | 27 | 4 | 6 |
| | | 1978 | 134 | 15 | 3 | 2.71 |
| 2. | రాయలసీమ | 1955 | 55 | 39 | 0 | 21.1 |
| | | 1962 | 54 | 13 | 5 | 9.6 |
| | | 1967 | 52 | 8 | 1 | 2.8 |
| | | 1972 | 52 | 6 | 0 | 2.9 |
| | | 1978 | 53 | 3 | 0 | 0.56 |
| 3. | తెలంగాణా | 1957 | 105 | 65 | 20 | 26.1 |
| | | 1962 | 106 | 42 | 4 | 8.9 |
| | | 1967 | 101 | 42 | 4 | 8.9 |
| | | 1972 | 101 | 26 | 3 | 7.6 |
| | | 1978 | 107 | 13 | 3 | 3.08 |

## అసెంబ్లీలో రాజకీయపార్టీల బలాబలాలు (ప్రాంతాలవారీగా 1955-78)

### కాంగ్రెసు

| క్ర.సం. | ప్రాంతం | ఎన్నిక | మొత్తం సీట్లు | పోటీచేసినవి | గెలిచినవి | పోలయిన ఓట్లు% |
|---|---|---|---|---|---|---|
| 1. | సర్కారు జిల్లాలు | 1955 | 141 | 92 | 74 | 35.5 |
| | | 1962 | 140 | 139 | 89 | 46.7 |
| | | 1967 | 134 | 134 | 72 | 44.4 |
| | | 1972 | 134 | 136 | 100 | 52·1 |
| | | 1978 | 134 | 119 | 15 | 17 54 |
| 2. | రాయలసీమ | 1955 | 55 | 50 | 44 | 51.3 |
| | | 1962 | 54 | 52 | 24 | 43.7 |
| | | 1967 | 52 | 52 | 29 | 47.2 |
| | | 1972 | 51 | 51 | 36 | 56,6 |
| | | 1978 | 53 | 45 | 3 | 13.06 |
| 3· | తెలంగాణా | 1957 | 105 | 105 | 70 | 47.3 |
| | | 1962 | 106 | 103 | 64 | 50.5 |
| | | 1967 | 101 | 102 | 64 | 46.1 |
| | | 1972 | 101 | 94 | 78 | 51.4 |
| | | 1978 | 107 | 93 | 12 | 17.28 |

అసెంబ్లీలో రాజకీయ పార్టీల బలాబలాలు [ప్రాంతాలవారీగా 1955-78]

జనతాపార్టీ

| క్ర.సం. | ప్రాంతం | ఎన్నిక | మొత్తం సీట్లు | పోటీచేసినవి | గెలిచినవి | పోలైన ఓట్లు% |
|---|---|---|---|---|---|---|
| 1 | సర్కారు జిల్లాలు | 1955 | 141 | — | — | — |
| | | 1962 | 140 | — | — | — |
| | | 1967 | 134 | — | — | — |
| | | 1972 | 134 | — | — | — |
| | | 1978 | 134 | 121 | 33 | 30.46 |
| 2 | రాయలసీమ | 1955 | 55 | — | — | — |
| | | 1962 | 54 | | | |
| | | 1967 | 52 | | | |
| | | 1972 | 52 | | | |
| | | 1978 | 53 | 50 | 12 | 30.96 |
| 3 | తెలంగాణా | 1957 | 105 | — | — | — |
| | | 1962 | 106 | — | — | — |
| | | 1967 | 101 | — | — | — |
| | | 1972 | 101 | — | — | — |
| | | 1978 | 107 | 97 | 15 | 22.92 |

# 1983 లో ఓటింగ్ సరళి

1983 జనవరి 5న శాసనసభకు జరిగిన సాధారణ ఎన్నికలలో తెలుగు దేశం 290 స్థానాలకు పోటీచేసి 198 స్థానాలను గెలుచుకున్నది. కాంగ్రెస్'ఐ' పార్టీకి పోటీచేసిన 294 స్థానాలకుగాను 60మాత్రమే వచ్చాయి. సి.పి.ఐ. (ఎం)కు 5, సి.పి.ఐ.కు 5, మజిలీస్-ఇత్తేహాదుల్-ముస్లిమీన్‌కు 5, సంజయ్ విచార్ మంచ్‌కు 4, భారతీయ జనతాపార్టీకి 3, జనతాపార్టీకి 1, ఇండి పెండెంట్లకు 12 వచ్చాయి. (శ్రీ) ఎన్. టి. రామారావు గుడివాడ, తిరుపతి నియోజకవర్గాలలో పోటీచేసి రెండూ గెలిచి, తిరుపతి స్థానానికి రాజీనామా ఇచ్చారు. ఎమ్మిగనూరు (కర్నూలు జిల్లా) స్థానంలో గెలిచిన కాంగ్రెసు(ఐ) అభ్యర్థి కె. విజయభాస్కరరెడ్డి ఆ స్థానానికి రాజీనామా ఇచ్చి తమ లోక్‌సభ స్థానాన్ని అట్టిపెట్టుకున్నారు. హిమాయత్‌నగర్‌లో గెలిచిన తెలుగుదేశం అభ్యర్థి నారాయణ్ గౌడ్ ఫలితాలు ప్రకటించిన అనంతరం చనిపోయారు. ఎన్నికలు జరగకముందే మదనపల్లి (చిత్తూరుజిల్లా)లో పోటీచేస్తున్నవారిలో ఒక అభ్యర్థి చనిపోయినందున ఆ ఎన్నిక నిలిపివేశారు. తరవాత వీటన్నిటికీ ఉపఎన్నికలు జరిపారు. ప్రస్తుతం విధానసభలో పార్టీల బలాబలాలు :-

| పార్టీలు | స్థానాలు |
|---|---|
| తెలుగుదేశం | 199 |
| కాంగ్రెస్(ఐ) | 59 |
| ప్రోగ్రెసివ్‌డెమోక్రాటిక్ ఫ్రంట్ | 11 |
| సి.పి.ఐ.(ఎం) | 5 |
| సి.పి.ఐ. | 5 |
| మజిలీస్ | 5 |
| సంజయ్‌విచార్‌మంచ్ | 4 |
| భారతీయ జనతాపార్టీ | 4 |
| జనతాపార్టీ | 1 |
| ఇండిపెండెంట్ | 1 |
| నామినేటెడ్ స్థానం | (ఖాళీ) |

తెలుగుదేశం 46.75 శాతం, అనగా 98, 33, 182 ఓట్లు తెచ్చుకున్నది. కాంగ్రెసు(ఐ) 70,59,572 ఓట్లతో 33 56 శాతం పొందింది. సి.పి.ఐ కి 5 90,370 ఓట్లు అనగా 2.81 శాతం వచ్చాయి. సి.పి.ఐ (ఎం)కు 4,25.664 ఓట్లు అనగా 2.02 శాతం లభించింది. జనతాకు .96 శాతం అనగా 2,01, 948 ఓట్లు వచ్చాయి. లోక్‌దళ్‌కు .92 శాతం అనగా 1,92,522 ఓట్లు వచ్చాయి. కాని, వీరికి ఒక్కస్థానంకూడా లభించలేదు. కాంగ్రెస్(ఎస్)కు 43,( 96 ఓట్లు అనగా 20 శాతం వచ్చాయి. కాని ఒక్క స్థానమూరాలేదు. కాంగ్రెస్(జె) ఒకస్థానాన్ని నెగ్గి .52 శాతంఓటు తెచ్చుకున్నది. మొత్తం ఈ

పార్టీకి వచ్చిన ఓట్లు 1,08,078 వచ్చాయి. బి.జె.పి.కి 5,81,180 ఓట్లు అనగా 2.76 శాతం వచ్చాయి. మిగిలిన వారందరికీ కలిపి 19,99,246 ఓట్లు వచ్చాయి. ఇది 9.50 శాతం ఉన్నది. ఇందులో 5 గురు మజ్లిస్ వారు, హైదరాబాద్ నగరంలోనే నెగ్గారు. సంజయ్ విచారమంచ్ ని తెలుగుదేశం బలపరిచింది. తెలుగుదేశంఅభ్యర్థులలో 28మంది పోస్టుగ్రాడ్యుయేట్లు, 125 గ్రాడ్యుయేట్లు, 33 మంది ఇంటర్మీడియెట్లు ఉండగా 86 మంది హైస్కూలు విద్యతో ఉన్నారు. 30 సంవత్సరాలు లోబడినవారు తెలుగుదేశంలో 33 మందిఉన్నారు. 31-35 సం॥రాల మధ్యవారు 68 మంది ఉన్నారు. 35-40 సం॥రాల మధ్య 55 మంది ఉన్నారు. 41-50 సం॥రాల మధ్య 40 మంది ఉన్నారు. ఈ ఎన్నికలలో మొత్తం 69 మంది స్త్రీలు పోటీ చేశారు. 8 మంది తెలుగుదేశం పక్షాన, ఒకరు కాంగ్రెసు (ఐ) పక్షాన, ఒకరు సి.పి.ఐ.(ఎం) పక్షాన స్త్రీలు శాసనసభకు నెగ్గారు. మొత్తం 1052 మందికి ధరావత్తులు పోయాయి. పోటీచేసిన మొత్తం అభ్యర్థులు 1714 మంది. ఇందులో 806 మంది ఇండిపెండెంట్లు పోటీ చేయగా 752 మంది డిపాజిట్ కోల్పోయారు. కాంగ్రెసు(జె) 80 స్థానాలకు పోటీచేయగా 79 స్థానాలలో డిపాజిట్లు పోగొట్టుకున్నది. బి.జె.పి. 80 స్థానాలలో పోటీచేసి 62 స్థానాలలో డిపాజిట్లు పోగొట్టుకున్నది. జనతాపార్టీ 45 స్థానాలకు పోటీచేసి 40 స్థానాలలో డిపాజిట్లు కోల్పోయింది. సి.పి-ఐ 48 స్థానాలకు పోటీచేసి 29స్థానాలలో డిపాజిట్లుపోగొట్టుకున్నది. సి.పి.ఐ(ఎం) 28 స్థానాలకు పోటీచేసి 14 స్థానాలకు డిపాజిట్లుపోగొట్టుకున్నది. లోక్ దళ్ 38 స్థానాలకు పోటీచేయగా 26 స్థానాలలో డిపాజిట్లు పోగొట్టుకున్నది. కాంగ్రెస్(ఎస్) 9 స్థానాలలో పోటీచేసి 7 స్థానాలలో డిపాజిట్లు కోల్పోయింది. కాంగ్రెస్(ఐ) మొత్తం స్థానాలకు పోటీచేసి 15 స్థానాలకు డిపాజిట్లు కోల్పోయింది. తెలుగుదేశం 28 చోట్ల డిపాజిట్లుకోల్పోయింది.

1983 ఎన్నికల ఫలితాల విశ్లేషణకు పుస్తకంచివర పట్టికద్వారా తెలుసుకోవచ్చు.

# 8

# తెలంగాణా ఆందోళన

1956 లో రాష్ట్రం ఏర్పడినప్పటినుంచీ గమనిస్తే 1969 లో జరిగిన ప్రత్యేక తెలంగాణా ఆందోళన, 1972లో జరిగిన ప్రత్యేక ఆంధ్ర ఆందోళన రాజకీయంగా చాలా ప్రాధాన్యం వహిస్తాయి. ఇటువంటి ఆందోళన ఫ్రాన్సు వంటి దేశంలో జరిగి ఉంటే మహా విప్లవం అనేవారు ఈ ఆందోళనలలో రాజకీయ, ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక కారణాలు ఇమిడి ఉన్నాయి. తెలంగాణాకోసం జరిగిన ఆందోళన ఫలితంగా ఒక ప్రత్యేక రాజకీయపార్టీ ఏర్పడింది. ఆంధ్రలో పార్టీ ఏర్పడబోయి ఆగింది. రెండు ఆందోళనలలోనూ కొందరు మంత్రులు రాజీనామాలు చేసినారు. కేంద్ర ప్రభుత్వం జోక్యం చేసుకొని, కొన్ని పథకాలను రూపొందించి రాజీకి ప్రయత్నించింది. తెలంగాణా ఆందోళన సందర్భంగా ప్రధానమంత్రి, హోంమంత్రి హైదరాబాద్ రావలసిన పరిస్థితి ఏర్పడింది. తెలంగాణా ఆందోళన ఫలితంగా బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రిత్వాన్ని కోల్పోగా, ఆంధ్ర ఆందోళన ఫలితంగా పి. వి. నరసింహారావుకు అదే స్థితి కలిగింది. తెలంగాణా ఆందోళనవల్ల కర్ఫ్యూలు, కాల్పులు సర్వ సాధారణంగా జరిగినా, కొన్ని సందర్భాలలో సైన్యం రావలసి వచ్చినా రాష్ట్రపతిపరిపాలన విధించేవరకూ పోలేదు. కాని ఆంధ్రలోఆందోళనజరిగినప్పుడు రాష్ట్రపతిపాలన విధించినారు. ఈ రెండు ఆందోళనలలోనూ కమ్యూనిస్టు పార్టీలు రాష్ట్ర సమైక్యత కోసమే నిలిచి పోరాడినాయి. కాంగ్రెసు పార్టీలో సమైక్యతావాదులు, వేర్పాటు వాదులు ఉండటమేగాక, మారుతూ కూడా వచ్చినారు. అయితే కాంగ్రెసు పార్టీవారు ఆందోళనలో ప్రధానపాత్ర వహించినారు అని మాత్రం చెప్పక తప్పదు. రెండు సందర్భాలలోనూ ఆందోళనకు నాంది పలికింది విద్యార్థులే. చివరివరకూ నిలిచింది వారే. మిగిలిన వర్గాలు మధ్యలో ప్రవేశించటం, సమయానుకూలంగా వైదొలగటం జరిగింది. వీటన్నిటి దృష్ట్యా ఈ రెండు ఆందోళనలను సాధ్యమైనంత వివరంగా చర్చించినారు. ఎం.వి. రామమూర్తి ప్రత్యేకాంధ్ర ఉద్యమాన్ని గురించి, ఏ పార్టీకీ చెందని వ్యక్తిగా చాలా విపులంగా ఒక గ్రంథం వ్రాసినారు. దానిలోని ప్రధానాంశాలు స్వీకరించి, ఆంధ్రా ఆందోళన అధ్యాయంలో వ్రాయడమైంది.

### ప్రత్యేక తెలంగాణా ఆందోళన

ఆంధ్రులు వచ్చి తెలంగాణాతో కలసిన తరవాత, తెలంగాణా వారికి ఉద్యోగావకాశాలు సన్నగిల్లినాయనీ, ప్రమోషన్లలో అన్యాయాలు జరిగినా

యనీ, ఆర్థికంగా దోపిడీ జరిగిందనీ, రాజకీయంగా ఆధిపత్యం పెరిగిందనేది ప్రధానంగా ఈర్ష్య - ద్వేషాలకు కారణాలైనాయి. అవి 1956 నుంచి రగులుతూనే వస్తున్నాయి. 1969 లో ముల్కీ నిబంధనలు మళ్ళీ పొడిగించవలసిన గడువు వచ్చింది. సచివాలయంలో ఉద్యోగులు 1968 నవంబరు నుంచి ఈ విషయంలో జాగ్రత్త వహించి ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డిని అడుగుతూ వచ్చినారు. ఆయన తన సుముఖతను వెల్లడిస్తూ "ముఖ్యమంత్రిగా నేనేమి చేయగలను? మీరు గొడవ చేయండి. కేంద్రానికి గట్టిగా చెబుతాను" అని ధ్వనించే సలహా ఇచ్చినారు. ఇక కథ ప్రారంభమైంది. నవంబరు 30, 1968 న వరంగల్లులో తొలిమహాసభజరిగింది. ఇందులో శ్రీయుతులుటి. పురుషోత్తమరావు, ముత్తారెడ్డి, మృత్యుంజయలింగంగారలు ప్రధానంగా పాల్గొన్నారు. అక్కడే తొలిగా తెలంగాణా నినాదం ఇచ్చినాడు మృత్యుంజయలింగం. అప్పుడే ఒక కమిటీని ఏర్పరచినారు. ఆ కమిటీవారు ఖమ్మం తదితర ప్రదేశాలు పర్యటించి ముఖ్యమంత్రికి బహిరంగ లేఖలు వ్రాసినారు. ఈ కమిటీవారే 1969 జనవరి 8 న ఖమ్మం వెళ్ళి రవీంద్ర అనే విద్యార్థిని నిరాహారదీక్షలో కూర్చోబెట్టివచ్చినారు. ఆ తరవాత 12వ తేదీనుంచి వరంగల్లులో రిలే నిరాహారదీక్షలు మొదలైనాయి. కమిటీవారు కరీంనగర్, నల్గొండ, ఆదిలాబాద్ వెళ్ళి ప్రచారం ప్రారంభించి వచ్చినారు. ఖమ్మంలో నిరాహారదీక్ష ఉద్యమానికి స్థానిక కార్యకర్తలు మద్దతు ఇచ్చినారు. అట్లా ముందుగా తెలంగాణా జిల్లాలలో రగులుకొన్న రక్షణల ఉద్యమం వారం రోజుల్లో రాజధానికి పాకింది. రాజధాని వ్యవహారాలు పరిశీలిద్దాము.

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో విద్యార్థి ముఠాలు ఉన్నాయి. 1969 జనవరినాటి పరిస్థితినిబట్టి విద్యార్థి సంఘాధ్యక్షుడు వెంకటరాం రెడ్డి కాగా, మిగిలిన సంఘం అంతా ఆయనకు వ్యతిరేకము. బ్రహ్మానందరెడ్డి, విజయభాస్కరరెడ్డి, జయపాల్ రెడ్డికి అనుకూలురు. అధ్యక్షుడు వెంకటరాం రెడ్డి. ప్రధాన కార్యదర్శి మల్లిఖార్జున్ వీరికి వ్యతిరేకి. మాజీ విద్యార్థి సంఘాధ్యక్షుడు వెంకటేశ్వరరావు(జి. సుధాకరరావు బంధువు)కు సన్నిహితంగా ఉంటూ వచ్చినాడు. వీరంతా మాకల రామచంద్రారెడ్డి, చొక్కారావుల వర్గం. వీరికి అనుకూలంగా జనసంఘ్ ప్రాబల్యం కూడా కొంత ఉండేది. ఇట్లా ఉండగా విద్యార్థుల్లో ప్రాబల్యం పెంచుకోవడంకోసం, రాజకీయ ప్రయోజనాలదృష్ట్యా ముందుగా విద్యార్థి సంఘాధ్యక్షుడు వెంకటరాం రెడ్డి బయలుదేరి జనవరి 14న తెలంగాణా రక్షణల నినాదం ఇచ్చినాడు. దీనితో వ్యతిరేక విద్యార్థి వర్గం ప్రత్యర్థులను చిత్తు చేయటానికి ప్రత్యేక తెలంగాణా నినాదం ఇస్తూ జనవరి 16 న ఊరేగింపు సభ జరిపినారు. పోలీస్ లాఠీచార్జికి నాంది పలికినారు.

ఆనాడు ప్రత్యేక తెలంగాణా నినాదాన్ని వ్యతిరేకిస్తూ ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డి, స్వామి రామానందతీర్థ ప్రకటనలు చేసినారు. ఆందోళన రగులు

కోవడం చూసి, ముఖ్యమంత్రి జనవరి 18 న అఖిలపక్ష నాయకుల సమావేశం ఏర్పాటుచేసినారు. రెండురోజులు వారంతా తర్జనభర్జనలుచేసి, ఒక ఒప్పందంపై సంతకాలు చేసినారు. తెలంగాణాకు అన్యాయం జరిగినమాట నిజమేనని ఒప్పుకొని, పరిష్కారానికై కొన్ని సూచనలు చేయటం అందులో ప్రధానసారాంశం. సంతకాలు చేసిన "పెద్దమనుషులు" వీరు:-

తోక్కారావు, అచ్యుతరెడ్డి, వి.బి. రాజు, పి. నరసింగరావు, సి. హెచ్. రాజేశ్వరరావు, బద్రీవిశాల్ పిట్టి, వై.వి. కృష్ణారావు, పి.వి. నరసింహారావు, జాపూడి యజ్ఞనారాయణ, కుడిపూడి ప్రభాకరరావు, వి. రామారావు, రోడా మిస్త్రీ, సి. జంగారెడ్డి, ఎ. వాసుదేవరావు, సలాఉద్దీన్ ఒవేసీ, పి. నరసారెడ్డి, జె. రంగారెడ్డి, పి. గోవర్ధన్ రెడ్డి, జె. వెంగళరావు, టి. పురుషోత్తమరావు, కె. రామచంద్రారెడ్డి, ఎం. కమాలుద్దీన్, ఎర్రం సత్యనారాయణ, సి. హెచ్. మూర్తిరాజు, కె. రాజమల్లు, కె. సుదర్శన్ రెడ్డి, కాకాని వెంకటరత్నం, ఎం.ఎస్. లక్ష్మీనరసయ్య, కాజ రామనాథం, తోటరామస్వామి, శీలం సిద్ధారెడ్డి, నూకల రామచంద్రారెడ్డి, అరిగెరామస్వామి, ఎస్. ప్రసాదరావు, పి. తిమ్మారెడ్డి, కె.వి. నరసింగరావు, కె.వి. నారాయణరెడ్డి, బి.వి. గురుమూర్తి, ఇబ్రహీమ్, అన్సారీ, గౌతులచ్చన్న, వి. గోపాలకృష్ణయ్య, నరసింహారెడ్డి, చెంచురామానాయుడు, కొండాలక్ష్మణబాపూజీ, బ్రహ్మానందరెడ్డి.

**అఖిలపక్ష ఒప్పందం: ఉద్యోగాలు:**

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వోద్యోగుల నియామకం (ముల్కీ-నిబంధన) నిబంధనలక్రింద(1959) తెలంగాణా ప్రాంతీయులకు రిజర్వుచేసిన ఉద్యోగాలలో నేరుగా, లేక ప్రమోషన్‌ద్వారా, లేక బదిలీద్వారా నియమితులయిన ఇతరప్రాంతవాసులందర్నీ వెంటనే తొలగించటం జరుగుతుంది. అట్లాఏర్పడిన ఖాళీలను అర్హులయిన తెలంగాణా వాసుల నియామకంతో భర్తీచేయటం జరుగుతుంది. తగిన అభ్యర్థులులేని సందర్భాలలో అట్లాటివారు దొరికేవరకూ ఉద్యోగాలను ఖాళీగా ఉంచుతారు. ఈ విధంగా రక్షణకార్యక్రమం ప్రారంభమవుతుంది.

పై విధంగా ఉద్యోగాలను తొలగించిన వారికి సర్వీసు కొనసాగటానికి ఆంధ్రప్రాంతంలో ఉద్యోగాలు చూపుతారు. అవసరాన్ని బట్టి అదనపు ఉద్యోగాలను సృష్టిస్తారు. ఈ నిర్ణయాలను వెంటనే అమలుపరచే బాధ్యత నిర్వహించటానికి ఇద్దరు సీనియర్ అధికారులను నియోగిస్తారు.

దొంగముల్కీ సర్టిఫికెట్లతో కొందరు ఉద్యోగాలు సంపాదించినారన్న ఆరోపణలున్నాయి. అట్లాంటి ఫిర్యాదులపై దర్యాప్తు ప్రభుత్వం ఏర్పాటు చేస్తుంది.

చట్టప్రాతిపదికపై ఏర్పడిన సంస్థలు:- ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వోద్యోగుల నియామకపు (ముల్కీనిబంధన) చట్టం నిబంధనలు ప్రభుత్వోద్యోగాలకు, స్థానిక పరిపాలనలోగల ఉద్యోగాలకే అన్వయిస్తాయి. ఈ చట్టం ఆంధ్రప్రదేశ్ విద్యుచ్ఛక్తి బోర్డుకు వర్తించదని హైకోర్టు అంతకుముందు తీర్పు

ఇచ్చింది. ఈ సంస్థలు, రాష్ట్రవ్యాప్తమయినవి అయినందున, వాటిలోని ఉద్యోగాలలో కూడ ప్రభుత్వోద్యోగాల విషయంలో వలెనే తెలంగాణా ప్రాంతపు అభ్యర్థులకు రిజర్వేషన్ ఉండాలని ప్రభుత్వం భావిస్తూంది. కనక విద్యుత్ బోర్డు విషయంలో హైకోర్టు ఇచ్చిన తీర్పుపై రాష్ట్ర ప్రభుత్వం అప్పీలు దాఖలు చేస్తుంది.

*సీనియారిటీ లిస్టులు :* ఆంధ్ర-తెలంగాణా ఉద్యోగులకు వారి హోదాలు నిర్ణయిస్తూ ఒక జాబితాను కేంద్ర ప్రభుత్వం ఆమోదించిన అన్ని సందర్భాలలోనూ లేకపోతే అటువంటి జాబితాల తయారీకి, లేక వాటి సవరణలకు ఆదేశాలు ఇచ్చిన సందర్భాలలో అటువంటి ఆమోదం పొందిన జాబితాలనే, వారి ఉద్యోగ నిబంధనలను క్రమబద్ధం చేసే విషయంలో అనుసరిస్తారు. ఒకవేళ కేంద్ర ప్రభుత్వ ఆమోదం పొందిన జాబితాలు లేనిపక్షంలో అట్లాంటి జాబితాల తయారీ లేక సవరణలకు ఆదేశాలు జారీచేయని పక్షంలో కేంద్ర ప్రభుత్వ ఆమోదం లభించేంతవరకూ, రాష్ట్ర ప్రభుత్వం అనుసరిస్తున్న తాత్కాలిక జాబితాలనే అనుసరిస్తారు. పదవులను సమంగా ఉండేట్లు చూసే విషయంలోనూ, హోదాల నిర్ణయంలోను, ఉమ్మడి జాబితాలు తయారుచేసే విషయంలోను, కేంద్ర ప్రభుత్వం ఒకవేళ ఆదేశాలు జారీచేస్తే వాటిని రాష్ట్ర ప్రభుత్వం అనుసరిస్తుంది.

**తెలంగాణా మిగులు నిధులు :**

1) ఉభయ ప్రాంతాలకు, ఖర్చులను, ఆదాయాన్ని కేటాయించడంలో ప్రస్తుతం అమలులో ఉన్న పరిస్థితి కొనసాగిస్తారు.

2) ప్రతిఏడూ తెలంగాణా మిగులు నిధులను లెక్కగట్టటానికి, ఆ సంవత్సరం రాష్ట్ర మొత్తంలోని పెట్టుబడి వ్యయంలో మూడవవంతుకి, అటువంటి కాలంలో వాస్తవంగా తెలంగాణాలోని పెట్టుబడి ఖర్చుకూ మధ్య ఉన్న తేడా మొత్తాన్ని కలపడం ద్వారా తేల్చవలె.

3) చట్టప్రాతిపదికపై ఏర్పడిన ఇతర బోర్డులు, కార్పొరేషన్‌లు ఇత్యాది రాష్ట్రవ్యాప్త ప్రాతిపదికపై, రాష్ట్ర ప్రభుత్వనిధులతో నిర్వహించే వాటిని, తెలంగాణా మిగులు నిధుల విషయంలో రాష్ట్రవ్యాప్తమయిన ప్రభుత్వశాఖలుగానీ, వాటి జమా-ఖర్చులు ప్రభుత్వ జాబితాలలో చేరి ఉన్నట్టుగానే తీసుకొంటారు. ఆంధ్రప్రదేశ్ విద్యుచ్ఛక్తి బోర్డు విషయంలో, విద్యుత్ ఉత్పాదన, మైంటెనెన్స్ ట్రాన్స్మిషన్ లైన్ల విషయంలో మాత్రమే ఖర్చును పెరిగిన నిష్పత్తిలో ఉభయప్రాంతాలకూ కేటాయించటం జరుగుతుంది. విద్యుత్ సరఫరా లైన్‌లు, గ్రామాలకు విద్యుత్ సౌకర్యం విస్తరణ విషయంలో రెండు ప్రాంతాలకు అయిన ఖర్చుకే ఆయా ప్రాంతాలు లెక్కలోకి తీసుకొంటారు.

4) ప్రత్యేకంగా తెలంగాణాకే వినియోగిస్తున్న పారిశ్రామిక ట్రస్టునిధి అట్లాగే వినియోగిస్తారు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన నాటినుంచి జమ అవుతూవున్న మిగులు నిధులను పైన చెప్పిన సూత్రాలను ఆధారంగా ఖచ్చితంగా లెక్క

వేయడానికి అకౌంటెంట్ జనరల్ హోదాలో ఉన్న సీనియర్ అధికారిని నియమించవలెనని కంట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్‌ను కోరతారు. ఫిబ్రవరి 1969 నాటికి తమ నిర్ణయం తెలియజేయమని ఆ అధికారిని కోరతారు.

*అభివృద్ధి* : అట్లా మిగిలిన నిధులను 5 ఏళ్ళలోగా తెలంగాణా అభివృద్ధికే వెచ్చిస్తారు. భవిష్యత్తులో ప్రతిఏడూ తెలంగాణా మిగులు నిధులను లెక్కపెట్టి అమరుసతేడు తెలంగాణా అభివృద్ధికి వాటిని వినియోగిస్తారు. తెలంగాణాలో చేస్తున్న ఖర్చును 6 నెలల కొకమారు ప్రభుత్వం పరిశీలిస్తుంది. అట్లాంటి పరిశీలనా నివేదికను ప్రాంతీయసంఘానికి, శాసనసభ్యులకు అందజేస్తారు.

ఆంధ్రప్రాంతంలోకూడా వెనకబడిన ప్రాంతాలున్నాయి. వాటి విషయం తక్షణం పరిశీలించవలసిఉంది. అటువంటి ప్రాంతాల అభివృద్ధికి వెంటనే కృషిచేసి ప్రాంతీయ అసమానతలు తొలగించటానికి ప్రభుత్వం చర్యలు తీసుకొంటుంది. నిరుద్యోగుల పరిస్థితి మెరుగుకోసం ఉద్యోగావకాశాలు పెంపొందించే ప్రయత్నాలు చేస్తుంది.

*విద్యాసౌకర్యాలు* : ప్రాంతీయ ప్రసక్తిలేకుండా రాజధాని నగరంలో విద్యార్థులకు విద్యాసౌకర్యాలను పెంపొందించడానికి, వచ్చే విద్యాసంవత్సరంనుంచి చర్యలు తీసుకొంటారు. ఈ విధమయిన కార్యాచరణ ద్వారా తెలంగాణా ప్రాంతపు ప్రజలు వ్యక్తపరుస్తున్న ఇబ్బందులను నివారించగలమని ప్రభుత్వం నమ్ముతూంది. తెలుగుప్రజల ఆర్థికాభివృద్ధి, సాంస్కృతిక వికాసం ప్రభుత్వ ప్రధానాశయం. రాష్ట్రీ ఉన్నతిని ఉద్యోగ, ఆర్థిక అభివృద్ధికి పెట్టుబడులను రాష్ట్రానికి ఆకర్షించవలెనంటే ప్రశాంతవాతావరణం, సామరస్యం నెలకొనవలె. కనక సమాజంలో విచ్ఛిన్నకరమయిన కార్యక్రమాలుచేపట్టరాదు. రాష్ట్రీఆర్థికోన్నతికి, ఐక్యతకు భిన్నదృక్పథాలుగల రాజకీయ పార్టీలన్నీకలిసి కృషిచేస్తామన్నాయి. భారతదేశంలో ఆంధ్రప్రదేశ్ కు ప్రముఖస్థానంఉంది. జాతిసమైక్యతకు- ఆంధ్రప్రదేశ్ తమశాయశక్తులా కృషిచేస్తుంది. అందువల్ల ప్రత్యేక తెలంగాణా ఏర్పాటు కావాలంటూ కొన్నిచోట్ల తలెత్తుతున్న నినాదాలు అసంబద్ధమని అఖిలపక్ష ఒప్పందంవారు ఖండించినారు.

అంటే పార్టీలవారీగా, కాంగ్రెసు, కమ్యూనిస్టులు, సమైక్యతకే నిలబడ్డాయన్నమాట. మొదట స్వతంత్రజనసంఘ్ పార్టీలుకూడా అంతే.

ఈఒప్పందం ఫలితంగా శ్రీ టి.పురుషోత్తమరావు, శ్రీ జె. వెంగళరావు. వారి అనుచరులు ఖమ్మంలో రవీంద్రచే నిరాహారదీక్ష విరమింపజేసినా ఆందోళన మాత్రం ఆగలేదు.

పెద్దమనుషుల ఒప్పందంపై సంతకాలుచేసినవారు ఒక్కొక్కరేజారుకోవటం ప్రారంభించినారు.ఆంధ్రలోకూడా విద్యార్థులే ఆందోళన ప్రారంభించినారు.

కానిదానిని మొగ్గలోనే తుంచివేసినారు. తెలంగాణాలో ఆందోళనవ్యాపిస్తున్నా నాయకత్వం లోపించింది. విద్యార్థులు నాయకుల వెంటబడి ఉద్యమంలోకి దిగమని అడుగుతూనే ఉన్నారు. ప్రాంతీయ సంఘాధ్యక్షుడయిన చొక్కారావు ఒకవైపు పరోక్షంగా విద్యార్థులను ప్రోత్సహిస్తూ, తామమాత్రం తామరాకుపై నీటిబొట్టువలె ఉంటూ వచ్చినారు. పురుషోత్తమరావు బయటపడి ప్రత్యేక తెలంగాణాకు నిలబడినారు. డా॥ ఎం. చెన్నారెడ్డి ఎన్నికలకేసు సుప్రీం కోర్టులో ఉన్నందున ఆయన ఢిల్లీలోఉన్నారు. ఆయన అనుచరులు, ముఖ్యంగా యస్. వెంకట్రామరెడ్డి ఢిల్లీవెళ్ళి ఆయనతో సంప్రదిస్తూనేఉన్నారు. ఇట్లా జరుగుతుండగా ఫిబ్రవరి 23 న ఒక పత్రికావిలేఖరుల సమావేశంలో మార్చి 3న బంద్ పిలుపు ఇస్తున్నట్లు. ఎ మదన్ మోహన్ ప్రకటించినారు. ఉద్యమం వెనుకంజవేసినట్లున్నది. విద్యార్థులుకూడా తగ్గుముఖం చూపినారు. రక్షణలు కావాలనే విద్యార్థులు మౌనంవహించినారు. బంద్ పిలుపును వ్యతిరేకిస్తూ ప్రకటనలు ఇవ్వమని నూకల రామచంద్రారెడ్డి కొందరిని ప్రోత్సహించినారు.(1973 జులై 6న టి. పురుషోత్తమరావు ఈ విషయాన్ని ఇంటర్వ్యూలో వెల్లడించినారు.). ఒక కాశింనారాయణ మాత్రం అప్రకారమే పత్రికాప్రకటనలు చేసినారు.

మార్చి 3న బంద్ జయప్రదమయింది. ప్రత్యేక తెలంగాణా వాదులకు ఉత్సాహం పుంజుకొంది. మార్చి 8, 9 తేదీలలో హైదరాబాద్ రెడ్డిహాస్టల్ లో తొలి తెలంగాణాకన్వెన్షన్ జరిగింది. డా॥ రావాడ సత్యనారాయణ, ఉస్మానియా వైస్-ఛాన్సలర్ అధ్యక్షత వహించినారు. తెలంగాణా ప్రజాసమితి ఆవిర్భవించింది. జి. సుధాకర్ రావు అధ్యక్షతను జరిగిన సమావేశంలో ఏర్పాటైన ప్రథమ ఎడ్ హాక్ కమిటీలో కింద పేర్కొన్నవారు సభ్యులుగాఉన్నారు.

మదన్ మోహన్ (అధ్యక్షుడు), యస్. వెంకట్రామరెడ్డి (ప్రధానకార్యదర్శి), నాగంకృష్ణ (కోశాధికారి) సభ్యులు:- నగరంలో: జగన్ మోహన్ రెడ్డి, జి.పి. సక్సేనా, జి. నారాయణరావు, ఆదిరాజు వెంకటేశ్వరరావు, ఎస్. బి. గిరి; యస్. రఘువీరరావు, శాంతాబాయి.

వరంగంల్ నుంచి : పి. జనార్ధనరెడ్డి, ముచ్చర్ల సత్యనారాయణ, టి. పురుషోత్తమరావు, భూమారెడ్డి, రాజారెడ్డి, నిజామాబాద్ సభ్యులు. నల్గొండ నుంచి: టి. దామోదరరెడ్డి, జి. అనంతరెడ్డి; కరీంనగర్ నుంచి : సత్యనారాయణ; ఎ. నారాయణరెడ్డి; మెదక్ నుంచి : వీరప్రతాప్; సి. మానిక్ రావు; అదిలాబాద్ నుంచి : నాగయ్య, మహబూబ్ నగర్ నుంచి: నర్సిరెడ్డి; రాంరెడ్డి; ఖమ్మంనుంచి: అడపా గోపాలకృష్ణమూర్తి; శ్రీరామ్ దాస్.

ఎ. మదన్ మోహన్ వరంగల్ జిల్లా పరిషత్ అధ్యక్షుడు ధర్మారెడ్డి అనుచరుడుగాఉంటూ వచ్చినాడు. తొలుత బయటపడి ప్రజాసమితిలో పూర్తిగా దిగి, ప్రత్యేక తెలంగాణాకై కృషిచేసినారు. ఈ సందర్భంలో బ్రహ్మానందరెడ్డి మంత్రివర్గంలో గండిపడింది.

సమాచార శాఖమంత్రిగా ఉంటున్న శ్రీకొండాలక్ష్మణ్, ఒక ప్రతిపాదన చేస్తూ, స్వతంత్ర ప్రతిపత్తిగల ప్రాంతంగా తెలంగాణాను రూపొందించవలెన న్నారు. ఉద్యమం పుంజుకొంటుంటే ఆయన మార్చి 27 న మంత్రి పదవినుంచి తప్పుకొని ఉద్యమంలోకి దిగినారు ఒక పక్షం రోజులవరకూ ఆయనను రాజీనామా చేయకుండా ఆపగలిగిన శ్రీ బ్రహ్మానందరెడ్డి ఇక అదుపులోఉంచ లేకపోయినారు.

మరోపక్క తెలంగాణా వారివలె మాకూ ప్రత్యేక హక్కులు కావా లంటూ రాయలసీమ శాసన సభ్యులు శ్రీ పి. తిమ్మారెడ్డి అధ్యక్షతన మార్చి 4 వ సమావేశమై తీర్మానించినారు.

ఏప్రిల్ మొదటి వారంలో కమ్యూనిస్టులు, సికింద్రాబాద్‌లోని బూర్గు మహాదేవ్ హాలులో సమైక్యత సమావేశం జరిపినారు. ఆనాడు కాల్పులు జర గగా ఉద్యమం తీవ్రతరం అయింది. ఏప్రిల్ 11 న ప్రధాని ఇందిర ఢిల్లీలో నాయకుల సమావేశం ఏర్పాటుచేసినారు. అందులో శ్రీయుతులు బ్రహ్మానందరెడ్డి, కాకాని వెంకటరత్నం, చెన్నారెడ్డి, వి.బి. రాజు, జె. చొక్కారావు, నూకల రామచంద్రారెడ్డి, నిజలింగప్ప, చవాన్, కామరాజు ఉన్నారు. సమావేశ ఫలింగా ప్రధాని అష్టసూత్ర పథకం వచ్చింది. చెన్నారెడ్డి, చొక్కారావు, నూకల రామచంద్రారెడ్డి అసంతృప్తి ప్రకటిస్తూ మంత్రివర్గ ఉపసంఘాన్ని పంప నిరాకరించినందుకు విచారం వ్యక్తపరిచినారు. అప్పటికి వారింకా ప్రత్యేక తెలంగాణా కావలెనని అనలేదు.

## ప్రధాని అష్టసూత్ర పథకం

1. రిటైరైన, లేక ఇప్పుడు పదవి ఉన్న సుప్రీంకోర్టు న్యాయమూర్తి అధ్యక్షతన, రాష్ట్రఆర్థిక వ్యవహారాలు క్షుణ్ణంగా తెలిసిన ఒక ఆర్థికనిపుణుడూ కంట్రోలరు, ఆడిటర్ జనరల్ కార్యాలయం నుంచి ఒక సీనియర్ ప్రతినిధి, సభ్యులుగా ఉన్న ఒక ఉన్నతాధికార సంఘాన్ని నియమించడం జరుగుతుంది. తెలంగాణా నిధులకు సంబంధించిన, వేరు వేరుగా ఉన్న అంచనాలను, అభ్యర్థన లను పరిశీలించి తెలంగాణా ప్రాంతపు అభివృద్ధి పై ఖర్చు చేయవలసి ఉన్న మిగులు నిధులను ఈ సంఘం ధృవపరుసుంది. పై నెలలో ఈ సంఘం తన నివేదికను కేంద్రప్రభుత్వానికి సమర్పిస్తుంది.

2. మిగులు నిధుల మొత్తం ధనాన్ని ఎట్లా సేకరించవలెననే విషయం నిర్ణయించడానికి కేంద్ర ఆర్థిక, హోంమంత్రిత్వ శాఖల ప్రతినిధులు, ప్రణా శికా సంఘం ప్రతినిధులు, రాష్ట్ర ప్రభుత్వ ప్రతినిధులు వెంటనే చర్చలు ప్రారంభిస్తారు.

3. ముఖ్యమంత్రి సూచనమేరకు తెలంగాణా అభివృద్ధికి ఒక ఉన్నతాధి కార సంఘాన్ని వెంటనే ఏర్పరచవలెనని అంగీకరించడం జరిగింది. ఈ సంఘా నికి ముఖ్యమంత్రి అధ్యక్షులుగా ఉంటారు. ప్రణాళికా సంఘ సభ్యులు ఒకరు, రాష్ట్రమంత్రి వర్గంలో తెలంగాణా మంత్రులూ, తెలంగాణా ప్రాంతీయ సంఘ

అధ్యక్షుడూ ఇందులో సభ్యులుగా వ్యవహరిస్తారు. ఈ సంఘం ప్రధాన విధులు: పంచవర్ష ప్రణాళికల్లో తెలంగాణా ప్రాంతంలో అమలుజరపవలసిన పథకాలనూ, కార్యక్రమాలనూ, సాధించవలసిన భౌతిక, ఆర్థిక లక్ష్యాలను నిర్ణయించటం ఈ పథకాలూ, ప్రణాళికలూ సరిగా అమలు జరుగుతున్నాయా లేదా అని కూడ ఈ సంఘం సమీక్ష చేస్తుంది. ఈ మేరకు రాష్ట్ర ప్రభుత్వానికి అవసరమైన సలహాలను కూడా ఈ సంఘం అందజేస్తుంది.

4. ప్రణాళికలూ, పథకాలూ అమలుజరుగుతున్న తీరును విపులంగా సమీక్ష చెయడానికి ప్రణాళికల అమలు సంఘాన్ని ఒకదానిని నియమిస్తారు. ప్రణాళికా సంఘం ప్రతినిధి ఒకరు ఈ సంఘానికి అధ్యక్షులుగా ఉంటారు. కేంద్ర ఆర్థిక హోంశాఖల ప్రతినిధులు, రాష్ట్ర ప్రభుత్వ ప్రతినిధులు కూడా ఈ సంఘంలో ఉంటారు. ఈ సంఘం ప్రతి 3 నెలలకొకసారి సమావేశమై ప్రధానమంత్రికి, ముఖ్యమంత్రికి నివేదికలు సమర్పిస్తుంది.

5. ఈ నిర్ణయాలు సత్వరం శక్తిమంతంగా అమలుజరపడానికి, వాటిని సమన్వయపరచడానికి తెలంగాణా ప్రాంతపు సమస్యల బాధ్యత కలిగిన ప్రత్యేక అధికారులకు ఇంకా ఎక్కువ అధికారాలను ఇచ్చే విషయమై ముఖ్యమంత్రి పరిశీలిస్తారు.

6. తెలంగాణా ప్రాంతం ప్రజల ఉద్యోగాల విషయంలో, రాజ్యాంగ బద్ధమైన తగు హామీలు ఇచ్చే అవకాశాన్ని గురించి భారత ప్రభుత్వం, న్యాయ శాస్త్రవేత్తల బృందంతో కలిసి పరిశీలిస్తుంది.

7. తెలంగాణాలో ప్రభుత్వోద్యోగుల విషయంలోగల కష్టనిష్ఠూరాలను పరిశీలించడానికి 1956 రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ చట్టంక్రింద కేంద్ర పబ్లిక్ సర్వీస్ కమీషను చైర్మన్ అధ్యక్షతన నిర్ణయమైన కేంద్ర సలహాసంఘం త్వరలో హైదరాబాద్ వెళ్ళి కేంద్ర మంత్రికి తగు సిఫారసులు చేయగలదు. ఇందులో ఒక రిటైరైన హైకోర్టు న్యాయమూర్తి, కేంద్ర ప్రభుత్వంనుంచి రిటైరైన ఒక న్యాయశాఖా కార్యదర్శి సభ్యులుగా ఉంటారు. ఈ సంఘాన్ని నియమించవలెనని ముఖ్యమంత్రి సూచించినారు.

సర్వీసులకు సంబంధించి నిర్ణయం కాకుండా మిగిలిపోయిన కేసుల పరిష్కారానికి నిర్ణీత కాలంలోగా హోంశాఖ ఒక అత్యవసర కార్యక్రమాన్ని నిర్ణయిస్తుంది.

కేంద్ర సలహా సంఘంకాని, రాష్ట్ర సలహా సంఘంకాని ఇచ్చే సలహాల దృష్ట్యా కేంద్ర ప్రభుత్వం తీసుకొనే నిర్ణయాలను రాష్ట్ర ప్రభుత్వం వెంటనే అమలు జరపగలదని ముఖ్యమంత్రి కేంద్రానికి హామీ ఇచ్చినారు.

8. తెలంగాణా సమస్యలపట్ల కేంద్ర ప్రభుత్వం ఇకముందు కూడా ఎప్పుడూ శ్రద్ధ చూపడానికి ఆరునెలలకొకసారి ప్రధానమంత్రి ముఖ్యమంత్రితోనూ, తెలంగాణా అభివృద్ధి నిమిత్తం ఏర్పడిన ఉన్నతాధికారం సంఘంలోని

తదితరులతో నూ సమావేశమై పరిస్థితిని సమీక్షిస్తారు. ఈ సూచన కూడా ముఖ్యమంత్రి చేసిందే. ఈ సమావేశాలకు ఉప ప్రధాని, కేంద్ర హోం మంత్రి, ఇందుకు సంబంధించిన ఇతర కేంద్ర మంత్రులు, ప్రణాళికా సంఘం ఉపాధ్యక్షులూ హాజరవుతారు.

రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలోని ప్రజలమధ్య పరస్పర అవగాహన, సహకారభావం ఉన్నప్పుడు, రాష్ట్రంలో ప్రశాంత వాతావరణం నెలకొన్నప్పుడూ తెలంగాణా ప్రాంతం త్వరిత అభివృద్ధి, రాష్ట్ర సమగ్రాభివృద్ధి సాధించగలరు.

ఈ లక్ష్య సాధనకు తోడ్పడేటట్లు తగిన రాజకీయ ఏర్పాట్లు చేయగలవని, ఇట్లా చేసేముందు ప్రధానితో చర్చిస్తామని ముఖ్యమంత్రి ఆమెతో చెప్పినారు.

ఆంధ్రప్రదేశ్ లో పరిపూర్ణ శాంతి సుహృద్భావ వాతావరణాన్ని తిరిగి నెలకొనేటట్లు చేయడానికిగల ప్రాధాన్యం విస్తృతంగా జరిగిన చర్చలవల్ల గుర్తించడమైంది.

ఏప్రిల్ 11 నుంచి సామూహిక సత్యాగ్రహాలు ప్రారంభమైనాయి. శ్రీయుతులు కె. అచ్యుతరెడ్డి, టి. అంజయ్య, ఎం. మానిక్ రావు, ఎం. ఎం. హాషిం బయటపడి ప్రత్యేక తెలంగాణావైపు నిలబడినారు.

ఏప్రిల్ 14 న దామోదరం సంజీవయ్యగారు హైదరాబాద్ వచ్చి తాను ముఖ్యమంత్రిగా తెలంగాణావారికి చేసిన సేవ జ్ఞప్తికి తెచ్చి, అప్పటి ముఖ్యమంత్రి చేస్తున్న పనిని వ్యంగ్యంగా విమర్శించినారు.

ఏప్రిల్ లోనే హైదరాబాద్ స్థానిక సంస్థల నియోజక వర్గంనుంచి శాసన మండలికి ఎన్నిక జరిగింది. ప్రజాసమితి తరపున శ్రీ వెంకట్రామా రెడ్డి, కాంగ్రెసునుంచి సమైక్యతావాదిగా శ్రీ ప్రభాకర రెడ్డి పోటీ చేసినారు. శ్రీ వెంకట్రామా రెడ్డి గెలుపొందగా ఉద్యమానికి ఆదరణ లభించింది. శ్రీ వెంకట్రామా రెడ్డిని కాంగ్రెసునుంచి బహిష్కరించినారు.

డా॥ చెన్నా రెడ్డికి వ్యతిరేకంగా సుప్రీంకోర్టు తీర్పు చెప్పింది. ప్రజా సమితిలో చెన్నా రెడ్డివర్గం ఆయనని అధ్యక్షుణ్ణి చేయవలెనని తలపెట్టింది. దీనిని కొందరు తీవ్రంగా వ్యతిరేకించినారు. మొత్తంమీద ఉద్యమ దృష్ట్యా శ్రీ చెన్నా రెడ్డి ప్రవేశం అవసరమనే ప్రజాసమితిలో అందరూ భావించినారు. అయిష్టంగానే ఆయనను సమీపించినారు. తాను చెప్పినట్లు వింటారంటే ప్రజాసమితిలో చేరతాననీ, అట్లా వ్రాసి యివ్వమనీ అన్నారు చెన్నా రెడ్డి. గత్యంతరం లేక అట్లాగే వ్రాసి ఇచ్చినారు. 1969 మే 1 న జరిగిన ఊరేగింపులో సైతం డా॥ చెన్నా రెడ్డి పాల్గొనలేదు. వెనకనుంచి సలహాలిస్తూ వచ్చినారు. ఇట్లా డా॥ చెన్నా రెడ్డి ప్రజాసమితిలోకి రావటం పైనే అభిప్రాయభేదాలు పొడ

చూపినాయి. ఆయన 1969 మే 22న అధ్యక్షపదవి స్వీకరించటంతోనే శ్రీ వందే మాతరం రామచంద్రరావు, శ్రీ శ్రీధర రెడ్డి, డా॥ చెన్నారెడ్డికి వ్యతిరేకంగా బయటపడి పోటీ ప్రజాసమితి పెట్టినారు. డా॥ చెన్నారెడ్డిగారి ప్రవేశాన్ని బలపరిచినవారు శ్రీయుతులు వెంకట్రామారెడ్డి, జనార్ధనరెడ్డి, సుధాకరరావు, పురుషోత్తమరావు, వ్యతిరేకించినవారు: శ్రీయుతులు, ఎ. మదన్‌మోహన్. ఎస్.బి. గిరి, డా॥ గోపాలకిషన్, రఘువీరరావు.

డా॥ చెన్నారెడ్డి అధ్యక్ష బాధ్యతలను స్వీకరించగానే 1969 మే 22న ప్రకటించిన కార్యనిర్వాహక వర్గంలో ఈ క్రిందివారు ఉన్నారు : ఉపాధ్యక్షులు శ్రీ అచ్యుతరెడ్డి, శ్రీమతి టి.యన్. సదాలక్ష్మి శ్రీయుతులు ఎ. మదన్ మోహన్, జి. పి. సక్సేనా, టి. అంజయ్య, డా॥ జి. యస్. మేల్కొటే, శ్రీమతి సంగం లక్ష్మీబాయి, శ్రీమతి ఈశ్వరీబాయి.

కార్యదర్శులు : శ్రీయుతులు యస్. వెంకట్రామారెడ్డి, పి. నరసింగరావు, బి. సత్యనారాయణరెడ్డి, కె.ఎస్. నారాయణ, యం. యం. హాషిం, ఎం. మానిక్‌రావు, జి. వెంకటస్వామి.

ఆర్గనైజింగ్ కార్యదర్శులు : శ్రీయుతులు నాగంకృష్ణ, జి. నారాయణరావు, జగన్‌మోహన్‌రెడ్డి, టి. గోవింద్‌సింగ్, ఎ. వెంకటేశ్వరరావు, రామకృష్ణారెడ్డి, మానిక్‌రావు, శ్రీమతి శాంతాబాయి. కోశాధికారి శ్రీ రామకృష్ణన్ ధూతే.

కార్యవర్గ సభ్యులు : శ్రీయుతులు హయగ్రీవాచారి, బి. సి. జైన్, ఎన్. నరోత్తమరెడ్డి, నర్సిరెడ్డి పి. జనార్ధనరెడ్డి, ఎ. నారాయణరెడ్డి, డి. వెంకటేశం, బొజ్జం నరసింలు, షహాబుద్దీన్ అహమద్, శంకరరావు బిలోలికర్ మేజర్ రంగస్వామి యం. రామచంద్రరావు, గోపాలరెడ్డి మొదలైనవారు

కార్యాచరణ సంఘం ; శ్రీయుతులు జి.వి. సుధాకరరావు, ఎం.మానిక్‌రావు, జి.సి. సక్సేనా, మదన్‌మోహన్, ఎస్. వెంట్రామారెడ్డి, జి. నారాయణరావు, పి. నర్సారెడ్డి.

ప్రత్యేక ఆహ్వానితులు : శ్రీయుతులు కొండాలక్ష్మణ్ బాపూజీ, బద్రీవిశాల్ పిత్తి.

కార్యనిర్వాహకవర్గ సభ్యులలో కొందరి నియామకం జూన్‌మాసంలో జరగగా, అప్పటినుంచి కార్యాచరణ సంఘాన్ని రద్దుచేసి, కార్యనిర్వాహక వర్గంలో ఉన్నవారందరితో కార్యాచరణ సంఘం రూపొందినట్టు ప్రకటించినారు. ఆ తరవాత కూడా మరికొందరిని కార్యనిర్వాహక వర్గంలోకి తీసుకొన్నారు.

డా॥ చెన్నారెడ్డి తెలంగాణ ప్రజాసమితి అధ్యక్షుడు కాగానే శ్రీయుతులు యస్.బి. గిరి, మదన్‌మోహన్, మల్లిఖార్జున్ ఆయనకు సన్నిహితులైనారు.

అంతవరకూ శ్రీ వెంకట్రామారెడ్డికి దగ్గరగా ఉంటూ వచ్చిన శ్రీ శ్రీధర్ రెడ్డి శ్రీ పుల్లారెడ్డి వంటి విద్యార్థి ఉద్యమకారులు దూరమైనారు.

డా॥ చెన్నారెడ్డి ప్రజాసమితి అధ్యక్షుడు కాగానే శ్రీ హయగ్రీవాచారివంటి తన సన్నిహితులను మాత్రమే చేరదీస్తున్నాడనే ఉద్దేశంతో శ్రీయుతులు రాజారాం, అచ్యుతరెడ్డి, సుధాకర్ రావులు, డా॥ చెన్నారెడ్డిని వ్యతిరేకిస్తూ వచ్చిగారు.

అంతవరకూ ప్రత్యేక తెలంగాణాకు స్పష్టంగా అనుకూలత చూపని శ్రీ నూకల రామచంద్రారెడ్డి బయటపడటానికి శ్రీయుతులు రాజారాం, నరసింగరావు సుధాకర్, సురేంద్రరెడ్డి, కారకులైనారు. డా॥చెన్నారెడ్డికి వ్యతిరేకంగా ఎప్పుడూ ఉంటున్న శ్రీ నూకల రామచంద్రారెడ్డి, తెలంగాణా ఆందోళనలోనూ శ్రీ చొక్కారావు, శ్రీ కొండాలక్ష్మణ్‌లతో కలసి ఏకపక్షంగా వ్యవహరిస్తూ వచ్చినారు.

ఉస్మానియా విశ్వవిద్యాలయ వైస్‌ఛాన్సలర్‌గా శ్రీ రావాడ సత్యనారాయణను నియమించటంతో అంతవరకు మౌనంగా ఉంటూ వచ్చిన శ్రీ నూకల నరోత్తమరెడ్డి ప్రత్యేక తెలంగాణా అనుకూల ప్రకటన చేసినారు. (ఏప్రిల్ 25న)

ప్రజా సమితితోనూ, బయటా అభిప్రాయభేదాలు ఎట్లా ఉన్నప్పటికీ, డా॥ చెన్నారెడ్డి నాయకత్వం చేపట్టినప్పటినుంచి, ఆందోళన ఉధృతమయింది.

డా॥ చెన్నారెడ్డి నాయకత్వం ఇష్టపడని శ్రీ కొండాలక్ష్మణ్ తెలంగాణా ప్రదేశ్ కాంగ్రెసును 1969 జూన్ 2న గాంధీభవన్‌లో శ్రీ కొండా వెంకటరంగారెడ్డిచే ప్రారంభోత్సవం చేయించినారు.

డా॥ చెన్నారెడ్డి ప్రజాసమితి అధ్యక్షుడు అయిన నాలుగు రోజులకే 1969 మే 26న సామూహిక సత్యాగ్రహ కార్యక్రమం ముమ్మరంగా చేపట్టినారు. సమ్మెలను నిషేధిస్తూ రాష్ట్ర ప్రభుత్వం ఒక ఆర్డినెన్స్ జారీ చేసింది. తెలంగాణా ఎన్.జి.ఓ. సంఘ నాయకుడు శ్రీ అమోస్‌ను డిస్మిస్ చేసినారు. తెలంగాణా ఉపాధ్యాయ సంఘానికి గుర్తింపు రద్దు చేసినారు.

1969 మే 25న నాగర కర్నూల్ (మహబూబ్‌నగర్ జిల్లా)లో సమైక్యవాదుల సభకు ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి వెళ్ళినారు. తీవ్ర భాషలో తెలంగాణా ఏర్పాటుకు వ్యతిరేకంగా ప్రసంగించినారు. ఆనాడు జడచర్ల సమీపంలో జరిగిన పోలీస్ కాల్పులలో ఒకరు మరణించగా, అనేకమంది తుపాకి గుండ్లకు గురిఅయినారు. తెలంగాణా అంతటా దీని ప్రభావంవల్ల ఇంకా ఆందోళన పెరిగిపోయింది.

ఈ ఆందోళన మూలంగా బయటి రాష్ట్రాలనుంచి వ్యాపారస్తులు రాకపోవడంవల్ల రాష్ట్రానికి 50 కోట్ల రూపాయలమేరకు నష్టం వాటిల్లినట్లు ముఖ్య

మంత్రి ప్రకటించినారు (మే 11, 1969) రాజధానిలో సమైక్యతావాదులు కొందరు 1969 మే 27 న ఊరేగింపు జరిపి, కాలేజీలు తెరవాలని నినాదాలిచ్చినారు. అప్పుడే హైదరాబాద్ మేయర్ ఎన్నిక కూడా వచ్చింది. అందులో ప్రత్యేకరాష్ట్రవాదులే నెగ్గినారు 1969 మే 25 రాత్రి తెలంగాణా వాదులలో ప్రముఖులను నిర్బంధించవలెనని పోలీస్ విఫల ప్రయత్నం చేసినారు దీనిని ముందే పసిగట్టినవారు అనేకమంది అజ్ఞాతవాసంలోకి పోయినారు. మేయర్ గా శ్రీ ఎ. లక్ష్మీనారాయణ, డిప్యూటీ మేయర్ గా శ్రీ మేడం రాంచంద్రయ్య ఎన్నికైనారు. అంతవరకూ దాగి ఉన్నవారు కార్పొరేషన్ ఎన్నికలలో పాల్గొనడమే ఇందుకు దోహదం చేసింది.

1969 మే 30 న రాజధానిలోని చంచల్ గూడ సెంట్రల్ జైలులో ఆంధ్ర ఖైదీలకు, తెలంగాణా సత్యాగ్రహులకు జరిగిన కొట్లాటలో 94 మందికి దెబ్బలు తగిలినాయనీ వార్త పొక్కింది. తక్షణమే జనం అక్కడ గుమిగూడినారు. ప్రజాసమితి నాయకులు వెళ్ళినారు. అక్కడ చేరిన వారిపై లాఠీచార్జి జరిగింది. ఈ సంఘటనకు నిరసనగా 1969 జూన్ 2 వ తెలంగాణా అంతటా హర్తాళ్ జరిపినారు. అనేకచోట్ల కాల్పులు జరపడంతో పరిస్థితి విషమించింది. జూన్ 3 వ తేదీ గూండాయిజానికి నిరసనగా హర్తాళ్ పిలుపు ఇచ్చినారు. అదే సమయంలో ప్రత్యేక తెలంగాణ ఏర్పరచబోవడంలేదని ప్రధాని ప్రకటించినారు. దీనితో రెచ్చిపోయిన ప్రజలు విజృంభించినారు. జూన్ 3 న రాజధాని కేవలం ప్రజాసమితిపాలన కిందఉన్నదా అన్నట్లువాతావరణం ఏర్పడింది.పగలు కూడా కర్ఫ్యూ విధించినారు. ప్రజాసమితి కార్యకర్తలు రోడ్లపై ఎలక్ట్రిక్ స్తంభాలు, రాళ్ళు అడ్డం పెట్టినారు. ప్రజా జీవితం స్తంభించింది.

అప్పటికే తెలంగాణా యాదవసభ, తెలంగాణ పత్రికా విలేఖరుల సంఘం ఏర్పడినాయి.

పరిస్థితి విషమించిన దృష్ట్యా 1969 జూన్ 4 న అర్ధరాత్రి హఠాత్తుగా ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి హైదరాబాద్ చేరుకొన్నారు. కర్ఫ్యూ ఉండటంవల్ల హడావుడిగా, ప్రభుత్వ వాహనాలు పంపించి ప్రజాసమితి నాయకులను పిలిపించినారు. ప్రధాని రాకవల్ల, చర్చలవల్ల, ప్రయోజనం లేకపోయింది. తెల్లవారు జామున ప్రధాని ఢిల్లీ వెళ్ళిపోయినారు. ఉదయం ఆమె ఆఫ్ఘనిస్తాన్ వెళ్ళినారు. తరవాత రెండు రోజులకు దేశీయాంగశాఖా మంత్రి శ్రీ వై.బి. చవాన్ హైదరాబాద్ వచ్చి, రెండు రోజులపాటు నిర్విరామంగా చర్చలు జరిపినా ప్రయోజనం లేకపోయింది. కర్ఫ్యూ కొంతవరకు సడలించినారు.

1969 జూన్ 3 నుంచి పాఠశాలల్లో పరీక్షలు నిర్వహించవలెనని ప్రభుత్వం ప్రయత్నించింది. చివరకు పరీక్షలు వాయిదా వేస్తున్నట్లు ప్రకటించక తప్పలేదు.

1969 జూన్ 7 నుంచీ విద్యుత్‌బోర్డు సిబ్బంది ప్రత్యేక తెలంగాణా నిమిత్తం సమ్మెకు దిగినారు. జూన్ 10 నుంచీ తెలంగాణా ఎన్. జి. ఓ లు ప్రత్యేక రాష్ట్రం కోరుతూ సమ్మె ప్రారంభించి, 35 రోజులు సమ్మె చేసినారు. సమ్మె మొదలుగాక పూర్వమే అనేకమందిని నిర్బంధంలోకి తీసుకొన్నారు. దానివల్ల సమ్మె ఆగలేదు.

ఒకవైపు సంఘటనలు ఇట్లా జరుగుతుండగా, 1969 జూన్ 12న ప్రభుత్వోద్యోగులకు భత్యాలు పెంచుతూ ముఖ్యమంత్రి ప్రకటించినారు. 2 లక్షల 50 వేలమంది ఉద్యోగులకు అదనపు భత్యం లభించే కార్యక్రమంవల్ల రాష్ట్రానికి సాలీనా 5 కోట్ల 50 లక్షల రూపాయల అదనపు వ్యయం అయింది.

కేంద్ర ప్రభుత్వ వైఖరికి నిరసనగా జూన్ 16 న ప్రజాసమితి ఇచ్చిన పిలుపుమేరకు తెలంగాణాలో హర్తాళ్ జరిగింది. భవిష్యత్తు కార్యక్రమాన్ని ఆరు సూత్రాలలో సమితి 1969 జూన్ 17 న ప్రకటించింది.

అప్పటికే తెలంగాణాలో నివసిస్తున్న ఆంధ్రులు వలస పోవడం జరిగింది. మిగిలిన వారిపై అత్యాచారాలు, అక్కడక్కడ జరిగినాయి. ఆస్తులకు నష్టం వాటిల్లింది. ఇట్లా వెళ్ళిపోయిన వారిని ఆదుకొనే నిమిత్తం విజయవాడలో శిబిరాలు నెలకొల్పినారు. అయితే పోటీ ప్రజాసమితి అధ్యక్షుడు శ్రీ శ్రీధర్ రెడ్డి మరికొందరు రాజధానిలో ఆంధ్రులు ఎక్కువగా నివసించే ప్రాంతాలకు వెళ్ళి తమ ఉద్యమం ఆంధ్రులకు వ్యతిరేకమైనది కాదని నచ్చచెప్పడానికి ప్రయత్నించినారు.

ఆంధ్రులపైనా, ముఖ్యమంత్రి ఆయన భార్య, తదితర ఆంధ్ర నాయకుల పైనా గోడలపై అశ్లీలమైన వ్రాతలు విపరీతంగా వెలసినాయి. జుగుప్స కలిగించే ఇటువంటి వ్రాతలవల్ల ఉద్యమానికి ప్రమాదం అని గ్రహించి, కుముద్ నాయక్ ప్రభృతులు స్వయంగా చెరిపివేసే కార్యక్రమం చేపట్టినారు.

ప్రజాసమితి ప్రకటించిన ఆరుసూత్రాల కార్యక్రమం : సత్యాగ్రహాలు భారీ ఎత్తున సాగించి జైళ్ళు నింపడం. ప్రజా ప్రతినిధులను ప్రత్యేకరాష్ట్రవాదానికి అనుకూలంగా మార్చే నిమిత్తం వారి గృహాలవద్ద ధర్నాలు చేయడం. పన్నులు కట్టకుండా ప్రభుత్వానికి సహాయ నిరాకరణ గావించడం ఎన్నికైన వారంతా రాజీనామాలుచేసి, ఆ ఖాళీలలో జరిగే ఉప ఎన్నికలలో ప్రజాభిప్రాయాన్ని తెలియజేయడం.

ప్రజాసమితి ఇచ్చిన కార్యక్రమం ప్రకారం కార్యకర్తలు సత్యాగ్రహానికి పూనుకొని 1969 జూన్ 19 నుంచి అరెస్టు గావడానికి ఆరంభించినారు.

కాంగ్రెస్‌పార్టీ కేంద్ర కార్యవర్గం చర్చ నిమిత్తం డా॥ చెన్నారెడ్డిని, శ్రీ కొండాలక్ష్మణ్ బాపూజీని, ఢిల్లీకి ఆహ్వానించింది. మొదట వారు నిరాకరించి, తరవాత వెళ్ళినారు. చర్చలు స్వేచ్ఛగా జరుగుతాయనే॥ మీసాల

ఢిల్లీ వెళ్ళిన వీరిద్దరు నిరాశతో తిరిగి వచ్చినారు. అయితే 2969 జూన్ 24 హైదరాబాద్‌కు వచ్చిన ఈ నాయకులకు ఘనస్వాగతం లభించింది.

1969 జూన్ 24 న రాజధానిలోని ముషీరాబాద్ సెంట్రల్ జైలులో సత్యాగ్రహులు ఇతర ఖైదీలమధ్య సంఘర్షణ జరిగినట్లు వార్త వచ్చింది. అనేక మంది ప్రజలు జైలువద్ద కూడినారు. శ్రీ జి. వెంకటస్వామి ఒక జీపులో వస్తుండగా ఎవరో కాల్పులు జరిపినారు. శ్రీ వెంకటస్వామికి జీపులోని వారికి గాయాలయినవి. వారిని ఆస్పత్రిలో చేర్చినారు. ప్రజలు ఉద్రేకం చెందినారు. ఈ సంఘటనకు నిరసనగా జూన్ 25 న తెలంగాణా అంతటా హర్తాళ్ జరగవలెనని డా॥ చెన్నారెడ్డి ప్రకటించినారు. అయితే ఆ రాత్రే డా॥ చెన్నారెడ్డిని, 8 మంది ఎం.ఎల్.ఏ.లను, మరికొందరు ప్రముఖులను నిర్బంధించి రాజమండ్రికి తీసుకొనిపోయినారు. కారులో వెళుతుండగా సూర్యాపేటవద్ద ప్రజలు అడ్డగించినారు. పోలీసులు సముదాయించలేకపోగా, నాయకులే సర్ది చెప్పడంతో, కారు రాజమండ్రి వెళ్ళగలిగింది. నాయకులు అనేకులు నిర్బంధానికి గురికాగా, శ్రీ వెంకట్రామారెడ్డ, శ్రీ పోల్సాని నరసింగరావు మాత్రం అజ్ఞాతంగా ఉంటూ ఆందోళనకు సారథ్యం వహించినారు.

1969 జూన్ 30 న, సులోచన, సరోత్తంరెడ్డి, బి. ఎస్. రెడ్డి ప్రభృతుల నాయకత్వాన మహిళలు ఊరేగింపుగా రాజ్‌భవన్‌కు వెళ్ళి గవర్నర్‌కు విజ్ఞాపన పత్రం సమర్పించినారు. ఆ తరవాత వరసగా టాక్సీ, ఆటో, సైకిల్ రిక్షా కార్మికులు రోజూ ఊరేగింపులు జరిపినారు. మహిళలు సత్యాగ్రహంలో పాల్గొని అరెస్టు అయినారు. శ్రీమతులు సావిత్రి చెన్నారెడ్డి, లక్ష్మిరెడ్డి, ఈశ్వరీబాయి, సంగం లక్ష్మీబాయి, కుముద్ నాయక్ ప్రభృతులు మహిళలకు నాయకత్వం వహించి ముందున్నారు.

1969 జులై 5, 6 తేదీలలో సామూహిక నిరాహారదీక్షలు, మౌనంగా ఊరేగింపులు జరిగినాయి. అల్లర్లు జరగడం, పోలీసులు లాఠీచార్జి చేయడం, ప్రజలు రెచ్చిపోవడం సహజంగా జరిగినాయి. బహిరంగ సభలలో ప్రజలు విరివిగా పాల్గొన్నారు.

ఈలోగా జరిగిన రాజకీయ పరిణామం గమనార్హమైంది. 1969 జూన్ 26న తెలంగాణా అభివృద్ధిమండలి సమావేశంలో పాల్గొన్న మంత్రులు కొందరు రాజీనామా ఇవ్వడానికి నిశ్చయించినారు. ఇందులో శ్రీయుతులు వి. బి. రాజు గురుమూర్తి, శీలం సిద్ధారెడ్డి, కె. వి. నారాయణరెడ్డి, ఇబ్రహీం అలీఅన్సారీ ఉన్నారు. కాని అందరికంటెముందు శ్రీ గురుమూర్తి తన రాజీనామాను ముఖ్యమంత్రికి పంపినారు. అయితే రాజీనామాల ఖ్యాతి మంత్రులకు దక్కనీయకుండా, ముఖ్యమంత్రి తానే రాజీనామా ఇస్తున్నట్లు ప్రకటించినారు. అయితే ఆయన రాజీనామా గవర్నర్‌కుగాక, కాంగ్రెస్ పార్టీ అధ్యక్షుడైన

శ్రీ నిజలింగప్పకు పంపినారు. ఈ వార్త తెలియగానే రాజధానిలో ప్రజలు ఆనందోత్సాహాలతో వీధుల్లోకి వచ్చేసినారు. పరిస్థితి అదుపు తప్పింది. ప్రజా సమితి నాయకులే మైకులలో ప్రజలను ప్రశాంతంగా ఉండవలసిందిగా విజ్ఞప్తి చేయవలసి వచ్చింది. ముఖ్యమంత్రి రాజీనామా వార్త విని, అంతవరకూ సమైక్యతా వాదులుగా ఉన్నవారు, తామూ ప్రత్యేకరాష్ట్రాన్ని కోరుతున్నట్లు ప్రకటనలు చేసినారు.

మంత్రిమండలిలో రాజీనామా ఇవ్వదలచినవారు 1969 జూన్ 28న తమ రాజీనామాలను ముఖ్యమంత్రికి అందించినారు. అయితే తాము సమైక్యతకే కృషి చేస్తామని పేర్కొన్నారు.

రాజీనామా విషయాన్ని, నాయకత్వ సమస్యను తీర్చే నిమిత్తం కాంగ్రెస్ పార్టీ శాసనసభా సభ్యుల సమావేశాన్ని 1969 జులై 6న హైదరాబాద్‌లో ఏర్పాటుచేసినారు. కాంగ్రెస్ పార్టీ అధ్యక్షుడు శ్రీ నిజలింగప్ప, కాంగ్రెస్ ప్రముఖుడు శ్రీ కామరాజ్ నాడార్ సమక్షంలో సమావేశం జరిగింది. బ్రహ్మానందరెడ్డి నాయకత్వంపై సంపూర్ణ విశ్వాసాన్ని ప్రకటిస్తూ, రాజీనామా ఆమోదించవలెనని ఒత్తిడి చేయరాదంటూ తీర్మానంచేసినారు. శ్రీ పి. వి. నరసింహారావు ప్రతిపాదించిన ఈ తీర్మానాన్ని, శ్రీ అక్కినేని భాస్కరరావు బలపరచగా ఏకగ్రీవంగా ఆమోదించినారు. అంతకు ముందే ప్రసంగాలుపూర్తి అయినాయి. ఎం. ఎల్. ఏ. లలో 166 (మొత్తం 194), ఎం. ఎల్. సి. లలో 62 (మొత్తం 90) మంది సమావేశంలో పాల్గొన్నారు. తెలంగాణా కావాలని పట్టుబడిన శాసనసభ్యులు 24 మంది రాలేదు.

తెలంగాణా వ్యవహారాలు ఇట్లా ఉండగా కాంగ్రెస్ పార్టీ బెంగుళూరులో సమావేశమై రెండుగా చీలిపోయింది. అందులో శ్రీ బ్రహ్మానందరెడ్డి మాత్రం శ్రీమతి ఇందిరాగాంధి నాయకత్వాన్ని ఆమోదించి, బలపరచినాడు.

1969 జులై 18న ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి, బెంగుళూరు నుంచి తిరిగివచ్చి, అనుకొన్న ప్రకారం మంత్రుల పేర్లు ప్రకటించినారు. శ్రీ నీలం సంజీవరెడ్డి అల్లుడు శ్రీ రాంభూపాల్ రెడ్డి, తెలంగాణా ప్రముఖుడు శ్రీ మ్యాకల రామచంద్రారెడ్డి మాత్రం మంత్రి మండలిలో చేరడానికి నిరాకరించినారు.

శ్రీ సంజీవయ్య కాలంలో మాత్రం ప్రవేశపెట్టిన ఉపముఖ్యమంత్రి పదవిని తిరిగితోడి శ్రీ జె.వి. నరసింగరావుకు ఇచ్చినారు. ఆ విధంగా, 1956లో జరిగిన పెద్ద మనుషుల ఒప్పందంలో ఒక సూత్రాన్ని గౌరవించినట్లయింది. మిగిలిన కేబినెట్ హోదామంత్రులు : శ్రీయుతులు పెద్దిరెడ్డి, తిమ్మారెడ్డి, తోటరామస్వామి, పి.వి. నరసింహారావు, కాకాని వెంకటరత్నం, ఎం. ఎన్. లక్ష్మీనరసయ్య, ఎన్. తెంచురామానాయుడు, కె. విజయభాస్కరరెడ్డి, రుద్రరాజు సత్యనారాయణరాజు, శిల్లం నర్దారెడ్డి, ఇబ్రహీం అలీ అన్సారి, జలగం వెంగళ

రావు, అన్నగాని భగవంతరావు, వాసిరెడ్డి కృష్ణమూర్తినాయుడు, జి. సంజీవరెడ్డి డి. పెరుమాళ్ళు.

స్టేట్ హోదామంత్రులు :

శ్రీయుతులు అక్కిరాజు వాసుదేవరావు, ఎ. సంజీవరెడ్డి, రామచంద్రరావు కళ్యాణి, రొండా నారప్పరెడ్డి, జి.సి. వెంకన్న, వి. పురుషోత్తంరెడ్డి, టి. రాజనరసింహా, పాములపాటి అంకినీడు, ప్రసాద్‌రావు, ఎస్.ఆర్.ఎ.ఎస్. అప్పలనాయుడు, శ్రీమతి రోడామిస్త్రీ. తెలంగాణా మంత్రులకు ప్రణాళిక, హోం, భారీనీటి పారుదల, రవాణా, విద్య, ఆరోగ్యం ఇచ్చినారు.

ప్రత్యేక తెలంగాణా ఆందోళన జరుగుతుండగా, కొన్ని న్యాయస్థాన నిర్ణయాలు వచ్చినాయి. తెలంగాణావాసులుకాని 37 మంది ఉపాధ్యాయులను ప్రభుత్వం తొలగించగా, వారు హైకోర్టులో రిట్ దరఖాస్తు పెట్టుకొన్నారు. హైకోర్టు న్యాయమూర్తి చిన్నప్పరెడ్డి ప్రభుత్వ ఉత్తరువు చెల్లదంటూ కొట్టివేసినారు. రాష్ట్ర ప్రభుత్వం వెంటనే డివిజన్ బెంచ్‌కి అప్పీలు చేసింది. హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి పింగళి జగన్మోహనరెడ్డి, న్యాయమూర్తి ఆవుల సాంబశివరావు ముల్కీ నిబంధనలు కొన్ని పరిమితులలో చెల్లుతాయని తీర్పు చెప్పినారు. దరఖాస్తుదారులు సుప్రీంకోర్టుకు వెళ్ళినారు. 1969 మార్చి 6 న ముల్కీ నిబంధనలు చెల్లవంటూ సుప్రీంకోర్టు తీర్పురాగా, ఆందోళనలో ఆజ్యం పోసినట్లయింది. రాష్ట్ర ప్రభుత్వం అప్పీలు చేసింది.

1969 ఆగస్టు మాసం అంతా ఆందోళన కొనసాగింది. ఆగస్టు 11 నుంచి నిరవధిక సమ్మె జరపమని పిలుపు ఇచ్చిన శ్రీ శ్రీధర్ రెడ్డిని ఆగస్టు 2 న నిర్బంధంలోకి తీసుకొన్నారు. ప్రివెంటివ్ డిటెన్షన్ క్రింద నిర్బంధంలో ఉన్న డా॥ చెన్నారెడ్డి, తదితరులను హైకోర్టు విడుదల చేయవలసిందిగా ఉత్తరువులు జారీ చేసింది. ఆగస్టు 26 న వారు విడుదలయినారు అయితే రాజమండ్రిలో ఉన్న డా॥ చెన్నారెడ్డి మొదలైనవారిని సుప్రీంకోర్టు ఎదుట ప్రవేశపెట్టే నిమిత్తం ఢిల్లీ తీసుకొని వెళ్ళినారు. ఢిల్లీలోనే వీరంతా విడుదల అయినారు. డా॥ చెన్నారెడ్డి, మిగిలినవారు కేంద్ర కాంగ్రెస్ నాయకులతో చర్చలు జరిపి, హైదరాబాద్‌కి తిరిగి వచ్చినారు. వారికి గొప్ప స్వాగతం లభించింది.

తెలంగాణా ఏర్పాటుకై ఆందోళన జరుగుతుండగా శాసనసభా సమావేశాలు 1969 ఆగస్టు 14 నుంచి సెప్టెంబరు 23 వరకూ జరిగినాయి. తెలంగాణా సమస్యను నాలుగు రోజులపాటు శాసనసభ చర్చించింది. ఈ సమావేశాల్లో పాల్గొన్న ప్రత్యేక తెలంగాణావారు తమ ప్రాంతాల్లో జరుగుతున్న అన్యాయాలను అనేక సందర్భాల్లో ప్రభుత్వ దృష్టికి తీసుకొని రాగలిగారు. అంతక్రితం మార్చిలో జరిగిన బడ్జెట్ సమావేశంల్లో కొందరు విద్యార్థులు అసెంబ్లీ భవనంలో ప్రవేశించి నినాదాలు చేసినారు. తొలినాడు ఉభయ సభల

నుద్దేశించి ప్రసంగించవలసిన గవర్నరు కూడా ప్రసంగించ వీలులేని వాతావరణం ఏర్పడింది. తెలంగాణా కావాలని కోరుతున్న సభ్యులు నినాదాలు చేసినారు. అప్పుడు గవర్నరుగా ఉన్న శ్రీ ఖండూభాయ్ దేశాయ్ తన ప్రసంగం చదివి నట్లే భావించమని వెళ్ళిపోయినారు. ఈ అనుభవాలదృష్ట్యా వర్షాకాల సమా వేశాలలో శాసన సభలలోకి ప్రేక్షకుల నెవరినీ అనుమతించలేదు. రాజధానిలో మంత్రులు కాపలాతోనే తిరగవలసి వచ్చింది. శాసన సభ్యుల పరిస్థితి కూడా ఇంచుమించు అట్లాగే ఉంది. ప్రధాని ప్రకటించిన సూత్రాల ననుసరించి భార్గవ, కుమార్ లలిత్ రాష్ట్రానికివచ్చి మిగులు నిధుల విషయం, సర్వీసుల విషయం పరిశీలించినారు. మిగులు నిధులు నూట పదికోట్లు ఉండవలెనని ప్రజాసమితి ప్రకటించింది. 38 కోట్ల రూపాయలు ఉన్నట్లు కుమార్ లలిత్ తమ నివేది కలో పేర్కొన్నారు. ఇది తమకు ఆమోద యోగ్యంకాదని ప్రజాసమితి ప్రక టించింది.

1969 సెప్టెంబరు, 21 న తిరిగి కళాశాలలకు హాజరు కావలెనని విద్యా ర్థులు నిర్ణయం తీసుకొన్నారు. దీని ఫలితంగా కళాశాలలు మళ్ళీ పని చేయ నారంభించినాయి.

ఉభయ శాసన సభలలోనూ ప్రత్యేక తెలంగాణా కోరినవారుయునైటెడ్ ఫ్రంట్ గాఏర్పడ్డారు.ఇందులోకొందరు నాయకత్వం మారవలెనని కోరినవారూ ఉన్నారు. శాసన సభలో శ్రీ వి.బి. రాజు యునైటెడ్ ఫ్రంట్‌కు నాయ కత్వం వహించినారు. మిగిలిన సభ్యులు : శ్రీయుతులు కె. అచ్యుతరెడ్డి, టి. అంజయ్య, ఆర్. భీమారావు, ఎం. ఎం. హాషిం, సి. జగన్నాథరావు, ఎం. మాణిక్యరావు, పి. నరసింగరావు, జి. రాజారాం, ఎన్. రామచంద్రారెడ్డి, ఎ. మదన్ మోహన్, ఎం. శ్రీనివాసరావు.శాసనమండలిలో సభ్యులు: శ్రీయుతులు ఐరేని లింగయ్య, ఎం. ఆర్. శ్యామ్‌రావ్, జి.వి. సుధాకరరావు, వెంకటరాం రెడ్డి, వరిసిరెడ్డి, టి. గోవింద్ సింగ్, శ్రీమతి ఎస్. లక్ష్మిరెడ్డి.

శాసన సభకు జరిగిన రెండు ఉప ఎన్నికలలో రాజధానిలోని ఖైరతా బాద్ నుంచి నాగంకృష్ణ, మెదక్ జిల్లా సిద్దిపేటనుంచి శ్రీ ఎ. మదన్ మోహన్ గెలిచినారు.

సామూహిక సత్యాగ్రహాలపట్ల, ఆందోళనలు, నిరసనవ్రతాలపట ఆసక్తి సన్నగిల్లుతూ వచ్చింది. అక్టోబరు పదినుంచీ సత్యాగ్రహంలో పాల్గొనని ప్రజా సమితి కార్యనిర్వాహక సభ్యులపై చర్య తీసుకుంటామని సమితి ప్రకటించింది. ఈ నిర్ణయంతో శ్రీ కొండాలక్ష్మణ్ బాపూజీ విభేదించినారు. కార్యక్రమాలు తొందరపడి ఏర్పాటు చేస్తున్నారని ఆయన ప్రజాసమితి కార్యాచరణ సంఘం నుంచి రాజీనామా చేసినారు. డా॥ చెన్నారెడ్డికి, శ్రీ కొండాలక్ష్మణ్ బాపూ జీకి ఉత్తరప్రత్యుత్తరాలు జరిగినాయి. వారిద్దరిమధ్య ఉన్న అభిప్రాయభేదాలు బయట పడినాయి. 1969, అక్టోబరు 10 నుంచి శ్రీ మల్లికార్జున్ అమరణ

నిరాహారదీక్ష పూనినారు. కొద్దిరోజులకే ఆయనను ఆసుపత్రికి తరలించినారు. అక్టోబరు 22, 23 తేదీలలో ప్రజాసమితి కార్యవర్గ సమావేశం జరిపింది. నవంబరునుంచి చేపట్టవలసిన కార్యక్రమాన్ని చర్చించినారు. జిల్లా స్థాయిలో సమ్మేళనాలు, ఎన్నికలు డిశంబరు 15వ తేదీ లోపల పూర్తి చేయవలెనని, తరవాత రాష్ట్రస్థాయి సమితి ఎన్నికలు జరపవలెనని, నిర్ణయించినారు. శ్రీ ఎ. మదన్‌మోహన్‌కూ, డా॥ చెన్నారెడ్డికి నిర్ణయాలపై అభిప్రాయ భేదాలు వచ్చినాయి. సమావేశంనుంచి కొందరు బయటికి వెళ్ళిపోయినారు. డా॥ చెన్నారెడ్డి సమితి అధ్యక్ష పదవికి రాజీనామా చేసినారు. కాని ఆయనే కొనసాగవలెనని సమితి కార్యవర్గం తీర్మానించటంతో ఆ రాజీనామా ఉప సంహరించుకొన్నారు. విద్యార్థులలో కూడా మల్లిఖార్జున్ వర్గానికీ, ఇతరులకూ ఉన్న అభిప్రాయభేదాలు బయటపడినాయి. ఇతర రాష్ట్రాలనుంచి హైదరాబాద్ వచ్చిన కొందరు పార్టీనాయకులూ, చిన్నరాష్ట్రాల కనుకూలంగా ప్రకటలు చేసినారు. అక్టోబరు 26న మళ్ళీ నిరసన వ్రతాలు జరిగినా, వాటిలో ఉత్సాహం తగ్గినట్లు కనిపించింది. నవంబరు 1న ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవాలకు వ్యతిరేకంగా ప్రజాసమితి ఊరేగింపులూ, బహిరంగ సభలూ జరిపింది.

తెలంగాణా ప్రజాసమితి ప్రథమ వార్షిక మహాసభ 1970 జనవరి 10, 11 న సికింద్రాబాద్‌లో జరిగింది. జనవరి 15న మృతవీరుల దినం జరపాలని నిర్ణయించినారు. అంతేగాక ప్రజాసమితిని రాజకీయపార్టీగా మార్చమని తీర్మానం చేసినారు. అయితే ఈ విషయమై చర్చించి నిర్ణయించడానికిగాను ఒక సంఘాన్ని ఏర్పరచినారు. 22 మంది సభ్యులుగల ఈ సంఘం శ్రీ వి. సత్యనారాయణరెడ్డి సమావేశకర్తగా 11 మంది సభ్యులతో ఒక ఉపసంఘాన్ని నియమించింది. ఇందులో శ్రీయుతులు ఎం.ఎం. హాషిం, పి. నరసింగరావు, కె. రాజారాం, జి. వెంకటస్వామి, టి. గోవింద్‌సింగ్, టి. అంజయ్య, ఎస్. పురోత్తమరెడ్డి, జి.వి. సుధాకరరావు, టి. హయగ్రీవాచారి, బద్రీవిశాల్‌పిట్టి, శ్రీమతి ఈశ్వరీబాయి సభ్యులుగా ఉన్నారు. వీరంతా చర్చలు జరిపి ప్రజా సమితిని రాజకీయపార్టీగా మార్చవలెనని, ఎన్నికల చిహ్నం పెట్టుకొనవలెనని నిర్ణయించినారు. ఈ నిర్ణయానుసారం ప్రజాసమితి 1970 ఆగస్టులో రాజకీయ పార్టీగా రూపొందింది. పార్టీలో చేరదలచినవారంతా బయటికి వెళ్ళిపోవలెనని, అంతవరకూ ప్రజాసమితిలో ఉన్న సంయుక్త సోషలిస్టుపార్టీ, రిపబ్లికన్‌పార్టీ, కాంగ్రెసుపార్టీవారు కొందరు తప్పుకోవలసి వచ్చింది.

బంగ్లాదేశ్ ఏర్పడటంలో భారతదేశం అపూర్వమైన పాత్ర నిర్వహించటంవల్ల శ్రీమతి ఇందిరాగాంధీకి, ఆమె ఆధ్వర్యాన ఉన్న కాంగ్రెస్‌పార్టీకి ప్రజలలో పలుకుబడి బాగా పెరిగిపోయింది. 1971 లోనే లోక్‌సభకు మధ్యంతర ఎన్నికలు జరపవలెనని నిర్ణయం తీసుకొన్నారు. అప్పుడు ప్రజాసమితి

నాయకుడు డా॥ చెన్నారెడ్డిని ఢిల్లీ పిలిపించి చర్చలు జరిపినారు. ఆమె కొన్ని ప్రతిపాదనలు చేసినారు : 1. తెలంగాణాలో ప్రజాసమితి ఎన్నికలలో పోటీ చేయరాదు. 2. ఎనిమిది సూత్రాల పథకానికి 1977 వరకూ వ్యవధి ఇవ్వవలె. 3. తెలంగాణాలో ఎన్నికైన శాసన సభ్యులలో మూడింట రెండు వంతులమంది కోరితే 1977 లో ప్రత్యేక రాష్ట్రాన్ని ఏర్పాటు చేయటానికి వీలుంటుంది. ఈ ప్రతిపాదనలు డా॥ చెన్నారెడ్డి ప్రజాసమితి ముందు పెట్టినారు. ఆయన తీవ్ర విమర్శలకు గురిఅయినారు. తరవాత ప్రధాని ప్రతిపాదనలు నిరాకరిస్తూ ఎన్నికలలో పోటీ చేయవలెనని నిర్ణయించుకొన్నారు. ఎన్నికల గుర్తుగా పారను ఎన్నుకున్నారు. ప్రజాసమితి అభ్యర్థులపై పోటీ పెట్టవద్దని, ఏకగ్రీవంగా ఎన్నిక జరిగే అవకాశం కల్పించవలెననీ, డా॥ చెన్నారెడ్డి రాజకీయ పార్టీలకు విజ్ఞప్తి చేసినారు. ప్రజాసమితి ఒకే ఒక లక్ష్యంతో ఎన్నికలలో పోటీ చేసింది. ప్రత్యేక రాష్ట్రాన్ని ఏర్పాటు చేయటంమాత్రమే కర్తవ్యంగా పేర్కొంది. కాంగ్రెసు పార్టీని, ముఖ్యంగా శ్రీమతి ఇందిరా గాంధీని తీవ్రంగా విమర్శించినారు. డా॥ చెన్నారెడ్డి ప్రారంభించిన తెలంగాణా సెంటినల్ అనే వారపత్రిక శ్రీమతి ఇందిరాగాంధీని విచారణ జరపాలంటూ వ్రాసింది. ప్రజాసమితి తెలంగాణాలో 14 స్థానాలకు అభ్యర్థులను నిలబెట్టింది. అందులో 10 స్థానాలు సమితి గెలుచుకొంది.

హైదరాబాద్‌లో ప్రజాసమితి అభ్యర్థి శ్రీ జి. ఎస్. మేల్కోటేకు 1,84,925 ఓట్లురాగా, కాంగ్రెసు బలపరచిన స్వతంత్ర అభ్యర్థికి 85, 518 ఓట్లు వచ్చినాయి. సికింద్రాబాద్‌లో సమితి అభ్యర్థి శ్రీ ఎం.ఎం. హాషింకు 98,598 ఓట్లురాగా కాంగ్రెసు అభ్యర్థికి 74,909 ఓట్లు వచ్చినాయి.సిద్దిపేటలో శ్రీ జి. వెంకటస్వామికి 1,69,414 ఓట్లురాగా, కాంగ్రెస్ బలపరచిన కమ్యూనిస్టుపార్టీ అభ్యర్థికి 79, 851 ఓట్లు వచ్చినాయి. మెదక్‌లో శ్రీ మల్లిఖార్జున్‌కు 1,52,968 ఓట్లురాగా కాంగ్రెసుకు 99, 5,28 ఓట్లు వచ్చినాయి. నాగరు కర్నూలులో ఎం. భీష్మదేవ్‌కు సమితి అభ్యర్థిగా 1,49, 774 ఓట్లు రాగా, కాంగ్రెస్ అభ్యర్థికి 79, 851 ఓట్లు వచ్చినాయి. పెద్దపల్లిలో సమితి అభ్యర్థి శ్రీ వి. తులసీరాంకు 1,65, 084 ఓట్లురాగా, కాంగ్రెసు అభ్యర్థికి 56, 819 ఓట్లు వచ్చినాయి. కరీంనగరులో సమితి అభ్యర్థి శ్రీ ఎం. సత్యనారాయణ రావుకు 1,19, 831 ఓట్లురాగా, కాంగ్రెసు అభ్యర్థికి 1, 09, 824 ఓట్లు వచ్చినాయి. వరంగల్లులో సమితి అభ్యర్థి శ్రీ ఎస్.బి. గిరికి 1,82, 193 ఓట్లు రాగా, కాంగ్రెసు అభ్యర్థికి 88, 612 వచ్చినాయి. నల్గొండలో సమితి అభ్యర్థి శ్రీ రామకృష్ణారెడ్డికి 1, 11, 692 రాగా, కాంగ్రెసు అభ్యర్థికి 1, 06, 294 ఓట్లు వచ్చినాయి. మహబూబ్‌నగర్ లో సమితి అభ్యర్థి శ్రీ జె. రామేశ్వర రావుకు 1, 27, 873 ఓట్లురాగా, కాంగ్రెసు అభ్యర్థికి 1, 10, 440 ఓట్లు వచ్చినాయి. నిజామాబాద్, అదిలాబాద్, ఖమ్మం, మిర్యాలగూడాలో సమితి అభ్యర్థులు ఓడిపోయినారు.

దేశవ్యాప్తంగా శ్రీమతి ఇందిరాగాంధికి లోక్‌సభలో అత్యధిక స్థానాలు
ం లభించింది. అటువంటి పరిస్థితులలో తెలంగాణా ప్రజాసమితి 10 స్థానా
లో లోక్‌సభలో కొంతకాలంపాటు ప్రత్యేక పార్టీగా వ్యవహరించినప్పటికీ,
త్యేక రాష్ట్రం కోసం కీలకమైన పాత్ర నిర్వహించే అవకాశం లేకపోయింది.
త్యేక పార్టీగా కొనసాగటమూ, కాంగ్రెసులో విలీనం కావటమూ అనేది
నీయాంశమయింది. ప్రధానమంత్రి ఇందిరాగాంధీతో ప్రజాసమితి నాయ
కుగా డా॥ చెన్నారెడ్డి అనేక పర్యాయాలు కలిసి చర్చించిన ఫలితంగా ఆరు
త్రాల పథకం ఏర్పడింది. ఆ సూత్రాలు :

1. తెలంగాణాకు ప్రత్యేక బడ్జెట్, ప్రత్యేక ఆదాయ వ్యయ వివరాలు
2. ముల్కీ నిబంధనల కొనసాగింపు.
3. ప్రాంతీయ సంఘాన్ని చట్టబద్ధంగా కొనసాగించటం.
4. తెలంగాణాకు ప్రత్యేక కాంగ్రెసు సంఘాన్ని ఏర్పరచటం.
5. మూడేళ్ళ అనంతరం ఈ విషయాన్ని సమీక్షించటం.
6. ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి రాజీనామా ఇవ్వడం, తెలం
గాణా వ్యక్తిని ముఖ్యమంత్రిగా చేయడం.

తొలుత ఈ ఒడంబడిక వ్రాతపూర్వకంగా లేకపోయినప్పటికీ తెలం
గాణాకు ప్రత్యేక కాంగ్రెసు సంఘాన్ని ఏర్పరచవలెననేదే తప్ప, మిగిలినవి
రణలోనికి వచ్చినాయి. శ్రీ బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రిగా వైదొ
రు. 1971 సెప్టెంబరు 18న తెలంగాణా ప్రజాసమితివారు సమావేశమై
గ్రెసులో విలీనం కావలెనని ఏకగ్రీవంగా తీర్మానించినారు. ఆరుసూత్రాలు
డా తాము వైదొలగటంలోనే ఇమిడి ఉన్నాయని శ్రీ బ్రహ్మానందరెడ్డి
ఖ్యానించినారు. ప్రజాసమితి కాంగ్రెసులో విలీనం కావడం ఇష్టంలేని
రు డా॥ చెన్నారెడ్డిని విమర్శిస్తూ సంపూర్ణ తెలంగాణా ప్రజాసమితిని
రచినారు. దీనికి శ్రీ బి. సత్యనారాయణరెడ్డి నాయకత్వం వహించినారు.
ంగాణా పోరాటాన్ని కొనసాగిస్తామని రిపబ్లిక్ పార్టీ నాయకురాలు శ్రీమతి
శ్వరీబాయి ప్రకటించింది. సంపూర్ణ తెలంగాణా ప్రజాసమితి 1972 శాసన
ఎన్నికలలో 41 మంది అభ్యర్థులను నిలబెట్టగా పోలైన ఓట్లలో 1.8 శాతం
త్రమే వారందరికీ కలిపి వచ్చినాయి.

శ్రీ కొండాలక్ష్మణ్ బాపూజీ ఏర్పరచిన తెలంగాణా కాంగ్రెస్ కూడా
క్‌సభ ఎన్నికలలో ఎటువంటి బలాన్ని సమకూర్చుకోలేకపోయింది. రెండు
క మహాసభలు జరుపుకొన్న తెలంగాణా ప్రజాసమితి కాంగ్రెసులో
నం అయిన తరవాత ప్రత్యేక తెలంగాణా సమస్య అడుగున పడిపోయింది.

కాంగ్రెసును కాపాడండి - అనే నినాదం ఇస్తూ యునైటెడ్ ఫ్రంట్
యకుడుగా వ్యవహరించిన శ్రీ వి.బి. రాజు రాజ్యసభకు ఎన్నికగావడంతో
రువ ఢిల్లీకి రంగాన్ని మార్చినారు. తెలంగాణా ఆందోళనలో 300 మందికి

పైగా చనిపోయినారనీ, వీరంతా పోలీస్ కాల్పులలో మరణించినారని ప్రత్యేక రాష్ట్రవాదులు పేర్కొన్నారు. అధికార అంచనాలనుబట్టి 96 పర్యాయాలు కాల్పులు జరగగా అందులో హైదరాబాద్ నగరంలోనే 53 సార్లు జరిగినాయి. మొత్తం 57 మంది చనిపోగా, రాజధానిలోని 35 మంది ఇందులో ఉన్నారు. కేంద్ర ప్రభుత్వ ఆస్తులకు 12.04 లక్షలు, రోడ్డు రవాణా సంస్థకు 28.31 లక్షలు, ఇతర శాఖలకు 3.20 లక్షలు, వ్యక్తిగత ఆస్తులకు 18.61 లక్షల నష్టం వాటిల్లింది. ఆందోళన సందర్భంగా పోలీసు బందోబస్తు నిమిత్తం అయిన ఖర్చు 1, 37, 37, 900 రూపాయలు. అనేక పర్యాయాలు పరిస్థితిని అదుపులో పెట్టటానికి సైన్యాన్ని పిలిపించినారు. ఒక విద్యా సంవత్సరం నష్టమయింది. ఇటువంటివన్నీ అంచనాలు వేస్తే నష్టం ఇంకా చాలా ఉండవచ్చు.

# 9

# ప్రత్యేక ఆంధ్ర ఆందోళన

తెలంగాణాలో 1969 నుంచి జరిగిన ఆందోళన ఫలితంగా ఆంధ్రలో వేర్పాటు ధోరణి ప్రబలుతూ వచ్చింది. అట్లాంటప్పుడు సుప్రీంకోర్టు ఒక తీర్పు చెబుతూ ముల్కీ నిబంధనలు చెల్లుతాయన్నది (1972, అక్టోబరు 3). అగ్నిలో ఆజ్యం పోసినట్లుగా రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ పి.వి. నరసింహారావు, తెలంగాణావారి ఉద్యోగ హక్కులమీద సుప్రీంకోర్టు తీర్పు చివరిమాట అన్నారు. రాష్ట్రం ఏర్పడిన నాటినుంచీ ముల్కీ నిబంధనలు అమలుజరపవలెనని తెలంగాణాలో ప్రజలు కొందరు భావించినారు. ఇదంతా ప్రత్యేకాంధ్ర ఆందోళనకు దారి తీసింది. ఆంధ్రులు కొందరు ముల్కీ నిబంధనలంటే ఏమిటో తుణ్ణంగా పరిశీలించినారు. అవి అమలు జరిగితే ప్రమాదకరం అనుకొన్నారు. అమలు పరచరాని అంశాలు ఉండటమేగాక, అవి ప్రజాస్వామ్య ధోరణికి భిన్నంగా ఉన్నాయని వారు భావించినారు. ఇట్లాటి విషయాలను ప్రతిఘటించవలెనంటే ఆందోళనే శరణ్యం అనుకొన్నారు. విద్యార్థులూ, యువకులూ ఈ విషయాన్నే 1972 అకోబరు 22 న విజయవాడలో సమావేశమై చర్చించినారు. వారు ముల్కీ నిబంధనలవల్ల పొందబోయే నష్టాన్ని అంచనా వేసుకొన్నారు. విద్యార్థులు ఏలూరులో 1972 అకోబరు 24 న మహాసభ జరపగా ముఖ్యమంత్రి శ్రీ పి.వి. నరసింహారావు విద్యార్థులకు నచ్చచెప్పడానికి ప్రయత్నించినారు. కాని విద్యార్థులలో, పౌరులలో చోటు చేసుకొన్న అనుమానాలు, భయాలూ పోలేదు. సుప్రీంకోర్టు తీర్పు అమలుపరి_ ఆంధ్ర విద్యార్థులకు జంటనగరాలలో విద్యావకాశాలు ఉండవు. అప్పటివరకు లభిస్తున్నకొద్ది శాతం సీట్లు కూడా విద్యాలయాలలో వారికి లభించవు. ఇక ఆంధ్రులకు తెలంగాణాలో ఉద్యోగం సంపాదించటం దుర్లభమౌతుంది. పరిశ్రమలు, వ్యాపారాలు, బ్యాంకులు జాతీయం చేస్తే తెలంగాణాలోని ఉద్యోగాలకు ఆంధ్రులు అర్హత పోగొట్టుకొంటారు. ఇటువంటి అనుమానాలు, భయాలు ఆంధ్రులలో కోపాన్ని, రోషాన్ని కల్పించాయి. ముల్కీ నిబంధనలు అమలు జరిపితే ఆంధ్రుడు రాష్ట్రంలోని తెలంగాణా మునిసిపల్ కార్పొరేషన్లలో పనిచేయడమనేది అసంభవమై పోతుంది. వీటన్నిటి దృష్ట్యా విద్యార్థులకు భవిష్యత్తు ఆశాజనకంగా కనిపించ లేదు. కనుక ముల్కీ నిబంధనల అమలును ప్రతిఘటించవలెననుకొన్నారు. 1972 అక్టోబరు 26 నుంచి సమ్మె ప్రకటించినారు.

ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీకి ఈ విషయాలన్నీ చెప్పవలెనని ఉద్యోగుల నాయకులూ, మంత్రులూ ఢిల్లీకి తరలి వెళ్ళినారు. బి.వి. సుబ్బారెడ్డిగారి సారథ్యంలో విజ్ఞప్తులను ఆమెకు విశదపరచినారు.

తెలంగాణా ప్రాంతీయ సంఘం అధ్యక్షులు శ్రీ కోదాటి రాజమల్లుకు సలహాలనిచ్చే నిమిత్తం ఏర్పరచిన ఉపసంఘం తమ సలహాగా 12 అంశాలుగల ఒక ప్రతిపాదన చేసింది. అందులో ప్రధానాంశాలు :

1. ఏ ప్రతిపాదన చేసినా, అది ముల్కీ నిబంధనల పరిధిలోనే ఉండవలె.

2. తెలంగాణా ప్రాంతంలోని ప్రాంతీయ కార్యాలయాలల్లోనూ, జిల్లాల్లోనూ కేంద్ర సర్వీసులలో ఉన్న ఉద్యోగులకు ముల్కీ నిబంధనలు వర్తించవు. మిగతా అన్ని ఉద్యోగాలవారికీ ఇవి వర్తిస్తాయి.

3. ఆంధ్రులకూ, తెలంగాణావారికీ వేరు వేరుగా సచివాలయాలు ఉండవలె. కార్యాలయాలు, వాటి అధిపతులూ వేర్వేరుగా ఉండవలె.

4. 1956 నవంబరు 1 నుంచి ముల్కీ నిబంధనలు అమలుపరిచే విషయం ప్రాంతీయ సంఘం పరిశీలించవలె.

5. ఎంతకాలం ఈ నిబంధనలు అమలులో ఉండవలెనని నిర్ణయించవలసింది ప్రాంతీయ సంఘమే.

6. అధ్యక్షుడు, ప్రాంతీయ సంఘానికి ఉద్యోగాలపై పూర్తి పెత్తనం ఇచ్చే ఉత్తర్వు జారీ చేయవలె.

7. ఈ అంశాలను అమలు చేయడానికి కావలసిన సంఘాలను, తగిన అధికారులను నియమించవలె.

1972 నాటికి ముల్కీ నిబంధనల వంటివి దేశం మొత్తంమీద ఎక్కడా అమలులో లేవు. నైజాం నవాబు కాలంనాటి నిబంధనలు కొనసాగాలనుకోవటంలో ఆంధ్రప్రాంతం వారికి అర్థం గోచరించలేదు. ఆంధ్ర నాన్ గెజిటెడ్ ఉద్యోగులు ఉమ్మడి సంస్థలలో పనిచేసే ఆంధ్ర, తెలంగాణా ఉద్యోగుల సంఖ్య సేకరించినారు. జంతు ప్రదర్శనశాల, ప్రభుత్వ ముద్రణాలయం, రవీంద్రభారతి, స్టేట్ సెంట్రల్ లైబ్రరీ క్లబ్ మొదలైన 40 ఉమ్మడి సంస్థల ఖర్చును ఆంధ్ర తెలంగాణా 2 : 1 నిష్పత్తిలో భరిస్తున్నారు.

ముల్కీ నిబంధనలు లేనినాడే ఆంధ్రులకు ఉమ్మడి సంస్థలలో ఉద్యోగాలు దొరికే విషయంలో ఎన్నో అవకతవకలు జరిగినాయి. ఇక ముల్కీ నిబంధనలు పాటిస్తే వారి అగచాట్లు చెప్పనలవి కాదంటూ ఎన్. జి. వో. నాయకులు అన్నారు. 1972 నవంబరు ఒకటో తేదీని హక్కుల దినంగా జరిపి వారు ఆంధ్ర ప్రజల దృష్టిని ఆకర్షించినారు. ముఖ్యమంత్రి శ్రీ పి.వి. నరసింహారావు తమ మంత్రిమండలి సహచరులతో సంప్రదింపులు ప్రారంభించినారు. ఆంధ్ర

తెలంగాణా మంత్రులతో వేరు వేరు సమావేశాలు జరిపి, విషయాలు చర్చించినారు.

హైదరాబాదులోని న్యాయశాస్త్ర కళాశాలలో సీట్లవిషయంలో గొడవ ప్రారంభమయింది. ఆంధ్రులకు కేటాయించిన కొద్ది సీట్లను కూడా వారికి దక్కనీయడం లేదని, వాటిని ఖాళీగానైనా ఉంచటం జరుగుతున్నదిగాని మంచి మార్కులతో ప్రవేశార్హత పొందినా, ఆంధ్రులకు అవి నిరాకరిస్తున్నారని వార్త వెలువడింది. ఆంధ్ర, వెంకటేశ్వర యూనివర్సిటీ విద్యార్థులు బాపట్లలో సమావేశం జరిపినారు. (1972, నవంబరు 6, 7 తేదీలలో) వారి చర్చల సారాంశాన్ని తెలంగాణా విద్యార్థులతో ప్రత్యక్షంగా చర్చించ నిర్ణయించినారు. కాని వారి సంప్రదింపులు జయప్రదం కాలేదు.

1972 నవంబరు 9 న కొందరు ఆంధ్రమంత్రులు రాజీపడే ధోరణిలో కొన్ని షరతులు ఒప్పుకోమని కోరినారు. అవి : జంటనగరాలకు ముల్కీ నిబంధనలు వర్తించరాదు. తెలంగాణా అంతటా కూడా తహసీల్ దార్ గ్రేడ్ వరకూ మాత్రమే వీటిని వర్తింపజేయవలె. ఎటువంటి పరిస్థితిలోనూ అవి 1974 లో ముగియవలె. ఎన్.జి.ఓ.లు ప్రత్యేక సచివాలయాలు, వేర్వేరు శాఖాధికారులు కావలెనని పట్టుబట్టినారు. ఆంధ్ర ఎన్.జి.ఓ. లు ఆంధ్రఅంతటా పర్యటనలు జరిపి తెలంగాణా మిగులు నిధుల గురించి కొన్ని విషయాలు వెలికి తెచ్చినారు. తెలంగాణా మిగులు నిధుల బండారం అంటూ ఒక కరపత్రం ప్రచురించినారు. ఆంధ్ర ఎన్.జి.ఓ. లు 1972 నవంబరు 21 వ సమ్మె ఆలోచన ప్రాయంగా చేయవలెనని తలపెట్టినారు. 1959 లో రాష్ట్ర ప్రభుత్వం రూపొందించిన సూత్రాలు ఆంధ్రులకు ఎట్లాంటి ప్రయోజనాలు చేకూర్చేవి కావన్నారు. కేంద్ర ప్రభుత్వం వసూలు చేస్తున్న ఆదాయపు పన్ను, ఎస్టేట్ పన్నులలో రాష్ట్రానికి వచ్చే దానిని ఆంధ్ర-తెలంగాణా ప్రాంతాలమధ్య 2 : 1 నిష్పత్తిలో పంచవలెనన్నారు. కేంద్రానికి ఆదాయపుపన్ను, ఇతర పన్నుల రూపేణ రాష్ట్రంనుంచి వసూలు అయ్యేదానిలో ఆంధ్రనుండే ఎక్కువ మొత్తం వస్తుంది. ఆ పన్నులను వసూళ్ళ ప్రాతిపదిక, జనాభా ప్రాతిపదికల ఆధారంగా పంచవలె. కాని రాష్ట్రంలో వసూళ్ళ ప్రాతిపదికను పూర్తిగా వ్యతిరేకం చేస్తూండడం (అట్లా చేస్తే తెలంగాణాకు నష్టం వాటిల్లుతుండటం వల్ల) జరుగుతున్నదన్నారు. భూమిశిస్తు, స్టాంపు డ్యూటీ, వాణిజ్య పన్నుల రూపంలో ఏయే ప్రాంతంలో ఎంత వసూలవుతుందో చెప్పి, దానిని ఆ ప్రాంతపు ఆదాయంలో భాగంగా పరిగణించవలెనన్నారు. హైదరాబాద్‌లో వచ్చే ఆదాయం, ప్రత్యేకంగా ఆంధ్ర ప్రాంతానిది అని తెలియరాసిదంతా తెలంగాణా ఆదాయ భాగంగా జమకట్టవలె. రెండు ప్రాంతాలకు చెందిన ఉమ్మడి కార్యాలయాల (హైదరాబాదులోనివి) ఖర్చును ఆంధ్ర తెలంగాణాలు 2 : 1 నిష్పత్తిలో భరించవలె. రాష్ట్ర ప్రభుత్వ శాఖలమీద జరిగే

ఖర్చును ఆయా ప్రాంతాలకు సంబంధించినవి వాటికే కేటాయించవలె. హైకోర్టులో ఎక్కువ కేసులు ఆంధ్ర ప్రాంతానివే. అయినప్పటికి స్టాంపు డ్యూటీగా వచ్చే ఆదాయాన్ని తెలంగాణాకే ఎక్కువ పంచటం అభ్యంతర కరమన్నారు. హైదరాబాద్ నగర ఖర్చును ఆంధ్ర - తెలంగాణాలు 2: 1 నిష్పత్తిలో భరించినా, ఆదాయమంతా తెలంగాణాకు వర్తింపచేయడం మానవలెనన్నారు. పెద్ద పెద్ద కేంద్ర కార్యాలయాల సంస్థలు హైదరాబాదులో ఉన్నందున అమ్మకపు పన్ను వారు ఆ పట్టణంలోనే చెల్లిస్తారు. అదంతా కేవలం తెలంగాణాకే వర్తింపచేయడం అన్యాయం. భార్గవా సంఘ నిర్ణయానికి వ్యతిరేకంగా విద్యుచ్ఛక్తి ఉత్పత్తి, పంపిణీమీద అయ్యే ఖర్చును ఆంధ్ర-తెలంగాణాలు 2: 1 నిష్పత్తిలో భరించవలెనని పి.వి. నరసింహారావు నాయకత్వంలో జరిగిన నిర్ణయం మూలంగా ఆంధ్రులమీద 150 లక్షల అదనపుభారం పడింది. ఆర్.టి.సి. బస్సులవల్ల వచ్చే ఆదాయమంతా తెలంగాణా నిధులకు జమకట్టడం గర్హించినారు. హైదరాబాద్‌లో సిబ్బందికి కట్టిన ఇళ్ళ ఖర్చు రూ. 2 కోట్ల 38 లక్షలు కూడా ఆంధ్రుల ఖర్చులో వ్రాసినారు. సిబ్బందికి ఇచే ఇళ్ళ అద్దెలు మాత్రం తెలంగాణాకు జమచేసినారు. ఖర్చు ఇద్దరూ 2 : 1 నిష్పత్తిలో భరించవలె. లోటు బడ్జెట్ కారణంగా తెచ్చిన అప్పులూ, వడ్డీలు ఆంధ్ర భరించవలెనన్నారు. కొంతకాలం ఈ ఋణాల వడ్డీని 2 : 1 నిష్పత్తిలో లెక్కకట్టి ఆ తరవాత మానివేసినారు. లెక్కలు చూస్తే ఋణాలపై వడ్డీని ఆంధ్ర తెలంగాణాలు 180 : 50 నిష్పత్తిలో భరిస్తున్నట్లు తేలింది ఆంధ్రలో రెవెన్యూ కొరత గనుక కేంద్రంనుంచి వచ్చే గ్రాంటు అంతా ఆంధ్రకు రావలె. కాని ఆ 133 కోట్లు ఆంధ్రా-తెలంగాణాలకు 2 : 1 నిష్పత్తిలో పంచుతున్నారు. ఉమ్మడి సంస్థలైన రవీంద్రభారతి, పురావస్తు ప్రదర్శనశాల, స్పోర్ట్సు స్టేడియం, జంతు ప్రదర్శనశాల మీదవచ్చే ఆదాయమంతా తెలంగాణా నిధులకు జమకట్టినారు. జమీందారుల రద్దుకు ఆంధ్రలో ఇచ్చిన పరిహారాన్ని అభివృద్ధి వ్యయంగా చూపి అందులో 3వ వంతు తెలంగాణా నిధులకు జమకట్టినారు. అది అప్పుగా చూపవలసి ఉంది.

1972 నవంబరు 12న గుంటూరులో ఆంధ్రప్రదేశ్ మహాసభ జరిగింది. శ్రీ నిశ్శంకర వెంకటరత్నం (ఎం. ఎల్. ఏ.) అధ్యక్షత వహించినారు. శాసన సభ్యులు శ్రీయుతులు సి. వి. కె. రావు, ఎ. శ్రీరాములు, సోషలిస్టు డెమోక్రాటిక్ ఫ్రంట్ నాయకుడు శ్రీ ఎన్. శ్రీనివాసులరెడ్డి పాల్గొన్నారు. వారంతా ఏ నిబంధనలేకుండా ఆంధ్రప్రదేశ్ కావలెనని తీర్మానం చేసినారు. 1972 నవంబరు 18, 19 తేదీలలో జరిగిన మహాసభలలో పాతకాంగ్రెసు, స్వతంత్రపార్టీ, సోషలిస్టులు, జనసంఘ నాయకులూ ఇండిపెండెంట్లు పాల్గొన్నారు. బహిరంగ సభలలో ప్రజలు విరివిగా పాల్గొన్నారు. 1972 నవంబరు చివరినాటికి నిబంధనారహితమైన ఆంధ్రప్రదేశ్ నిర్మాణానికి అంగీకరించకపోతే ప్రత్యేక రాష్ట్రం సాధించడానికి కృషిచేస్తామని నిర్ణయాలు చేసినారు.

ఆంధ్ర ప్రజాపరిషత్తు ఏర్పడింది. శ్రీ గౌతులచ్చన్న అధ్యక్షులుగా ఎన్నికైనారు. ఆయన స్వతంత్రపార్టీ అధ్యక్షపదవికి రాజీనామా చేసినారు. ఆంధ్ర ప్రజా పరిషత్తుకు శ్రీ నడింపల్లి నరసింహారావు ఉపాధ్యక్షులుగానూ, శ్రీ జాగర్లమూడి చంద్రమౌళి కోశాధికారిగానూ, సోషలిస్టుపార్టీ సభ్యుడు శ్రీ తుమ్మలచౌదరి ప్రధానకార్యదర్శిగానూ ఎన్నికైనారు. శ్రీయుతులు జి. సి. కొండయ్య, సుంకర సత్యనారాయణ, రత్నసభాపతి, ఎన్. వీరాచారి, యలమంచిలి శివాజీ సభ్యులుగా ఉన్నారు.

1972 నవంబరు 21న తలపెట్టిన బంద్‌ను వెంకటేశ్వర విశ్వవిద్యాలయ విద్యార్థినాయకులు, ఆంధ్ర ప్రజా పరిషత్తు నాయకులు బలపరిచినారు. అప్పటికి కేంద్ర రిజర్వు పోలీసులు రంగంలో ప్రవేశించినారు. వారు ఒంగోలు, ఆదోని, తెనాలి పట్టణాలలో కాల్పులు జరిపినారు. తెనాలిలో 23 మంది, ఒంగోలులో ముగ్గురు, ఆదోనిలో ఒకరు కాల్పులలో చనిపోయినట్లు వార్తలు చేరినాయి. గుంటూరు జిల్లా కలెకరు కాల్పులు ఆపవలసిందిగా మైకుద్వారా కోరినా కాల్పులు ఆగలేదని వార్త వచ్చింది. బంద్ సంపూర్ణంగా సఫలమయింది. కాల్పులతాలూకు వార్తలు ఆంధ్రప్రజల కోపాన్ని మరీ ప్రజ్వలింపచేసినాయి. ఎన్. జి. ఓ. లు మరో మూడు రోజులు సమ్మెకొనసాగించినారు. న్యాయవాదులు కోర్టులకు హాజరుకావడం మానివేసినారు. రాష్ట్ర ప్రభుత్వం సైన్యాన్ని పిలిపించి, కృష్ణ, గుంటూరు, కర్నూలుకు పంపింది. శ్రీమతి ఇందిరాగాంధీ రాష్ట్రం విభజించబోమని ప్రకటించినారు. ఆమె ఒక పంచసూత్ర పథకాన్ని ప్రకటించినారు. తెలంగాణా, ఆంధ్ర మంత్రులు ఆమె తీర్పును శిరసావహిస్తామన్న దృష్ట్యా ఈ క్రింద తెలిపిన పంచ సూత్రపథకం వెలువడింది.

1. తెలంగాణా ప్రాంతంలోని ఎన్. జి. ఓ. ఉద్యోగాలకు వాల్గవ శ్రేణి ఉద్యోగాలకు, తహసీల్‌దారు, సివిల్ అసిస్టెంట్ సర్జను, జూనియర్ ఇంజనీర్లకు ముల్కీ నిబంధనలోని నివాసార్హత వర్తిస్తుంది. సచివాలయంలో, శాఖాధిపతుల కార్యాలయాల్లో, ఉమ్మడి సంస్థలకు సంబంధించిన కార్యాలయాల్లోనూ ప్రతి 3 ఖాళీలలో రెండవదానికి ముల్కీ నిబంధన వర్తిస్తుంది.

2. పై నిబంధనల అమలు జంటనగరాలలో 1977 వరకూ, తెలంగాణాలో 1980 వరకూ జరుగుతుంది.

3. మొదటి లేక రెండవ గెజిటెడ్ గ్రేడ్‌వరకూ ప్రమోషన్‌కు సంబంధించిన సర్వీసులను ప్రాంతీయకరణ చేస్తారు.

4. తెలంగాణావారికి సాంకేతిక, వృత్తి విద్యావకాశాలు పెంచుతారు. అదనంగా వచ్చే సదుపాయాలలో నివాసార్హత అవరోధం కాబోదు.

5. జంటనగరాలలో ఉమ్మడి పోలీసుదళం ఏర్పాటు చేస్తారు.

శ్రీమతి ఇందిరాగాంధీ రాజీమార్గం శాశ్వత పరిష్కారం కాదని ఆంధ్రులు కొందరు అనుకొన్నారు. విజ్ఞులు కొన్ని ప్రశ్నలు వేసినారు. తమరాష్ట్రంలోనే

ఆంధ్ర ప్రజలు రెండవ తరగతి పౌరులుగా ఉండటం ఎట్లా? తెలంగాణావారిని తృప్తిపరచటానికి ఆంధ్ర ప్రజల బాగోగులను పణంగా ఎందుకు పెట్టవలె? ఏ రాష్ట్రానికి లేని షరతులు ఒక్క ఆంధ్రప్రదేశ్‌లోనే ఎందుకు విధించవలె?

ఆంధ్ర, వెంకటేశ్వర విశ్వవిద్యాలయ విద్యార్థి నాయకులు 1972 నవంబరు 28 న గుంటూరులో సమావేశమై కొన్ని నిర్ణయాలు తీసుకొన్నారు. ఒక సంయుక్త కార్యాచరణ సమితిని ఏర్పరచుకొన్నారు. 1972 డిసెంబరు 5 వ తేదీ నాటికి ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర ప్రకటన జరగకపోతే ఆ రోజున బంద్ జరపవలెననుకొన్నారు. శ్రీయుతులు బి. జె. అగస్టిన్, కె. శ్రీధరరావు, ఐ. శశిధర రెడ్డి, ఎం. వెంకయ్యనాయుడు, హరిబాబు, డా॥ గోపాలరావు, వై. శివాజీ కార్యాచరణ సమితిలో సభ్యులు. న్యాయవాదులు 1972 నవంబరు 30 న రాజమండ్రిలో సభ జరిపినారు. వారు ప్రధాని సూచించిన పంచసూత్ర పథకాన్ని విమర్శించినారు. ప్రత్యేక రాష్ట్రనిర్మాణం కావలెనన్నారు. 1972 డిసెంబరు 7 వరకు కోర్టులకు హాజరు కారాదని, తరవాతి కార్యక్రమం ఆరోజు జరిపే సభలో నిర్ణయించుకోవలెననుకొన్నారు.

1972 డిసెంబరు 1 న తెలంగాణా ప్రాంతీయసంఘం ప్రధాని పంచసూత్రపథకాన్ని ప్రకటించినందుకు కృతజ్ఞతలు తెలిపింది. ఆ సూత్రాలను గురించి మరికొంత వివరణ కావలెనని వారు కోరినారు. ఆంధ్ర శాసన సభ్యుల సమావేశం జరిగింది ఆ రోజునే. శాసన సభ్యులు శ్రీయుతులు కుడిపూడి ప్రభాకరరావు, వసంత నాగేశ్వరరావు, పీటర్‌పాల్ ముఖ్యమంత్రిని కొన్ని ప్రశ్నలు వేసినారు. సమాధానాలకు మారుగా సభవారు ప్రధాని నిర్ణయానికి కట్టుబడిఉంటామని ఏకగ్రీవంగా ఆమోదించినట్లు ముఖ్యమంత్రి ప్రకటించినారు. 1972 డిసెంబరు 1, 2 తేదీలలో తిరుపతిలో ఆంధ్రప్రజా పరిషత్తు సభలు జరిగినాయి. అక్కడ పన్నుల నిరాకరణ, సత్యాగ్రహానికి ప్రజలను తయారుచేయడం మొదలైన విషయాలు నిర్ణయించినారు. 1972 డిసెంబరు 5న జరగనున్న బంద్ కార్యక్రమాన్ని నిర్ణయించే నిమిత్తం విద్యార్థి నాయకులు విజయవాడలో సమావేశమైనారు. 1972 డిసెంబరులో బంద్ సంపూర్ణంగా జరిగింది. ఆంధ్రరాష్ట్ర జెండా ఎగురవేసినారు. 1972 డిసెంబరు 4 వ తేదినే శ్రీయుతులు సుంకర సత్యనారాయణ, వేమవరపు వెంకటేశ్వర్లు, వై. ఆర్. కె. రెడ్డి, ఎన్. రాజగోపాల్ మొదలైనవారిని ఆంతరంగిక భద్రతా చట్టంక్రింద అరెస్టు చేసినారు. 1972 డిసెంబరు 13 నుంచి న్యాయవాదులు వివిధ పట్టణాలలో ఊరేగింపులు జరిపినారు. విశాఖలో శ్రీ తెన్నేటి విశ్వనాథంతోసహా చాలామంది న్యాయవాదులు 144 సెక్షన్ ఉత్తర్వులను ధిక్కరించి అరెస్టు అయినారు. 1972 డిసెంబరు 7 న విజయవాడలో జరిగిన న్యాయవాదుల మహాసభలో శ్రీయుతులు తెన్నేటి విశ్వనాథం, గౌతులచ్చన్న ఉపన్యసించినారు. జంటనగరాలను యూనియన్ ప్రాంతంగా ప్రకటించి,

ఆంధ్ర, తెలంగాణాలను వేర్వేరు చేయాలని తీర్మానం చేసినారు. లోగడ రాష్ట్ర మంత్రులు చేసిన తీర్మానం - శాసన సభ్యులు రాజీనామా చేయవలెనని - మరల చేసినారు. వివిధ జిల్లాలకు చెందిన 313 మంది న్యాయవాదులు ఒక కార్యాచరణ సమితిగా ఏర్పడినారు. ప్రత్యేకాంధ్ర ఉద్యమాన్ని తీవ్రతరం గావించటానికి, అట్లా కృషిచేసే వివిధ సంస్థలమధ్య సమన్వయం తేవటానికి ఈ సమితి కృషి చేస్తుంది. ఈ సమితికి న్యాయవాదులు శ్రీ ఎం.వి. రామమూర్తి, శ్రీ గొట్టిపాటి మురళీమోహన్‌లను అధ్యక్షుడు, కార్యదర్శిగా ఎన్నుకొన్నారు.

1972 డిసెంబరు 10, 11 తేదీలలో విజయవాడలో ఆంధ్రమహాసభ జరపమన్నారు. తెన్నేటి విశ్వనాథంగారిని ఆ మహాసభలలో పాల్గొనవలసిందని శ్రీ ఎన్. శ్రీనివాసులురెడ్డి, శ్రీ ఎ. శ్రీరాములు కోరినారు. న్యాయవాదులసభకు (7 వ తేదీన) వచ్చిన శ్రీ తెన్నేటి విశ్వనాథం, ఆంధ్ర మహాసభ సమావేశం దాకా, విజయవాడలో ఆగినారు. శ్రీ గౌతులచ్చన్న ఈ పరిణామానికి చాలా సంతోషించినారు. ఆహ్వానసంఘంలో శ్రీ జొన్నలగడ్డ రామలింగయ్య (సోషలిస్టు) శ్రీ త్రిపురనేని శివప్రసాదరావు (డి.ఎం.కె.) ముఖ్యమైనపాత్ర వహించినారు. అంతవరకూ జనసంఘ సభ్యులు శ్రీ జూపూడి యజ్ఞనారాయణ స్వతంత్ర ప్రతిపత్తిలో ఉద్యమంలో పాల్గొంటున్నారు. ఇంతలో జనసంఘంవారు ఉద్యమంలో పాల్గొనే నిమిత్తం కేంద్ర కార్యాలయంనుంచి అనుమతి సంపాదించినారు. శ్రీ ఎ. శ్రీరాములుగారు, శ్రీ లచ్చన్న, శ్రీ తెన్నేటి విశ్వనాథం మధ్య సఖ్యతకు ప్రయత్నాలు జరిపినారు. విజయవాడ మహాసభకు అధ్యక్షత వహించినారు. న్యాయవాదులు, డాక్టర్లు, రైతులు, టీచర్లు, ఎన్.జి.ఓ.లు, విద్యార్థులు, యువకులు - అన్ని వర్గాలవారు మహాసభకు వచ్చినారు. ప్రతి వక్త "ప్రత్యేకాంధ్ర సాధనే నా లక్ష్యం" అంటూ ప్రసంగాలు చేసినారు. ప్రతినిధులంతా 'ఆంధ్ర మహాసభ' బాడ్జీలు ధరించినారు. ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం కోరుతూ తీర్మానం చేసినారు. 1972 డిసెంబరు 10 రాత్రి మనోరమ హోటలులో సంఘ నిర్మాణ సభకానికిగాను సమావేశం జరిపినారు. చర్చలు తెల్లవారు జామువరకూ జరిగినాయి. గౌరవాధ్యక్ష, అధ్యక్ష మొదలైన పదవుల విషయంలో ఏకగ్రీవమైన నిర్ణయం చేయలేకపోయినారు. విద్యార్థులు తమకు సంఘంలో రెండు స్థానాలు కోరినారు. రాత్రి ఎట్లాగో ఒక అంగీకారానికి వచ్చినా, మరునాడు విద్యార్థులు తాము ఉద్యమానికి తోడ్పడతామని, విడిగానే ఉంటామని ప్రతిపాదన చేసినారు.

1972 డిసెంబరు 11 వ తేది 111 మందితో కూడిన కార్యవర్గ సంఘం తయారు అయింది. శ్రీ పసల సూర్యచంద్రరావు సభ్యుల పేర్లను ప్రకటించినారు. శ్రీ జొన్నలగడ్డ రామలింగయ్య అభ్యంతరం తెలపటంతో సభనుంచి వెళ్ళిపోయినారు. అధ్యక్షవర్గంలో శ్రీయుతులు తెన్నేటి విశ్వనాథం, గౌతు

లచ్చన్న (ప్రజా పరిషత్) జూపూడి యజ్ఞ నారాయణ (జనసంఘ్) శ్రీనివాసులు రెడ్డి (ఆంధ్ర మహాసభ) ఉన్నారు. శ్రీయుతులు ఎ. శ్రీరాములు, పసల సూర్యచంద్రరావు, ప్రగడ కోటయ్య, జి.సి. కొండయ్య ఉపాధ్యక్షులుగా ఉన్నారు. కార్యదర్శులు : శ్రీయుతులు తుమ్మలచౌదరి (సోషలిస్టు) పసుపులేటి కోటేశ్వరరావు (రంగా అనుచరుడు), ప్రకాశచంద్ర శతపథి (తెన్నేటి విశ్వనాథం సహచరుడు), కొమరగిరి కృష్ణమోహన్ (జనసంఘ్) జి. గంగాధర రెడ్డి (ఆంధ్ర మహాసభ) ఎం. సుబ్బరాజు (ఎం.ఎల్ సి) కోశాధికారి, శ్రీ గోలి ఆంజనేయులు, శాసనసభ్యులు శ్రీయుతులు సి.వి.కె. రావు, నిశ్శంకర వేంకటరత్నం, పీటర్ పాల్, వసంత నాగేశ్వరరావు, కుడిపూడి ప్రభాకరరావు, కార్యవర్గ సభ్యులు. గ్రామ మునసబు సంఘ ప్రతినిధి, సంఘ ప్రతినిధి శ్రీ శ్రీరామమూర్తిచౌదరి, ఆంధ్ర న్యాయవాదుల కార్యాచరణ సంఘాధ్యక్షులు శ్రీ ఎం. వి. రామమూర్తితో కలిసి అంతా 36 మందితో కార్యవర్గ సంఘం ఏర్పడింది. కార్యక్రమ నిర్ణయాలు కార్యవర్గం చేస్తుందని మహాసభ అధికారాలు ఇచ్చింది. 1972 డిసెంబరు 12 న కార్యవర్గ సమావేశం జరిగింది. ఈ కింది కార్యక్రమం రూపొందించింది. 1972 డిసెంబరు 15 వ తేదీ శ్రీ పొట్టి శ్రీరాములు దినోత్సవం జరపవలె. కేంద్ర ప్రభుత్వానికి చెల్లించవలసిన పన్నులు జనవరి 1, 1973 నుంచి చెల్లించకూడదు. ధాన్యంలెవీ ఇవ్వరాదు. రైళ్ళను రోడ్డు రవాణాశాఖ బస్సులను ఉదయం 10 గంటలనుంచి 11 గంటలవరకు నిలుపు చేయవలె అని ఉద్యమకారులను కోరింది.

ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం కావలెనని సంతకాల సేకరణ ప్రారంభించవలె. తెలంగాణా ప్రజాసమితి నాయకులు శ్రీ లచ్చన్నకు సౌహార్ద సందేశం పంపిన మీదట వారికి కృతజ్ఞతలు తెలిపినారు. ప్రత్యేకాంధ్ర రాష్ట్ర ప్రమాణాన్ని కార్యవర్గం సమావేశంలో రూపొందించినారు. ఆంధ్ర కేంద్ర కార్యాచరణ సమితి అనే పేరున ఐక్యత ఏర్పడింది.

ప్రభుత్వ ఉద్యోగులు 1972 డిసెంబరు 7 నుంచి సమ్మెపిలుపు ఇచ్చినారు. సంఘానికి సమావేశకర్త శ్రీ ఐ.బి. రామకృష్ణరావు (రాష్ట్ర ఎన్.జి.ఓ. సంఘ అధ్యక్షులు), మొత్తం 3 లక్షలమంది ప్రభుత్వోద్యోగులు సమ్మె జరిపినారు. వారివి 3 నినాదాలు : తెలంగాణా ప్రాంతీయ కమిటీ పోవలె. వేరు బడ్జెట్ విధానం ఎత్తివేయవలె; ఉద్యోగులమధ్య ఎట్లాంటి తేడాలు చూపరాదు.

ప్రధాని ప్రకటించిన పంచసూత్ర పథకాన్ని ఆందోళనకారులు వ్యతిరేకించినారు. ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర సాధనకు ప్రజలు గట్టిపట్టు పడుతూ ఉన్నారు. ఈ వాతావరణాన్ని గ్రహించి 9 మంది ఆంధ్ర మంత్రులు తమ రాజీనామా పత్రాలను కాంగ్రెసు అధ్యక్షునికి పంపినారు. వారు పంచసూత్ర పథకంపై వివరణ అడిగినారు. తమ భవిష్య కార్యక్రమాన్ని నిర్ణయించుకునేందుకు వారు 1972 డిసెంబరు 17 న సమావేశం ఏర్పాటు చేసుకొన్నారు

మంత్రులు, పురపాలక, పంచాయితీ సమితి అధ్యక్షులు, జిల్లా పరిషత్ అధ్యక్షులు, శాసన సభ్యులు సమావేశానికి రావలసిందిగా నిర్ణయం జరిగింది. శ్రీ బత్తిన సుబ్బారావు తమ రాజీనామా లేఖను 1972 డిసెంబరు 13 న ముఖ్యమంత్రికి, ప్రధానమంత్రికి పంపినారు. ఆంధ్ర అంతా ముల్కీ నిబంధనలను వ్యతిరేకిస్తూ విద్యార్థులు వంతులవారీ నిరాహారదీక్షలు ప్రారంభించినారు. ప్రతి వీథికొక నిరాహారదీక్షా శిబిరం వెలిసింది. జెండాను ప్రతిష్ఠించటం, 144 సెక్షన్‌ను ధిక్కరించడం, స్థానికంగా సత్యాగ్రహాలు, బంద్‌లు ముమ్మరమైనాయి. నిరాహారదీక్షా శిబిరాలతో జనం క్రిక్కిరిసి నిండినారు. చాలామంది అరెస్టయినారు. జూనియర్ ఇంజనీర్లు 1972 డిసెంబరు 12 నుంచి సమ్మె ప్రారంభించినారు. ఆంధ్ర అంతా అల్లకల్లోలంగా ఉద్యమం సాగింది. 1972 డిసెంబరు 13 న తెలంగాణా ప్రాంతీయ కమిటీ ప్రధాని ప్రకటించిన పంచ సూత్రాలగురించి వివరణ కోరింది. ఇంకా మరికొన్ని ఉద్యోగాలలో కూడా ముల్కీ నిబంధనలు వర్తింపచేయవలెనన్నారు. హైదరాబాద్‌లో ఈ నిబంధనలు ముగియడానికి వేరే కాలం నిర్ణయించడాన్ని వారు వ్యతిరేకించినారు. వేరే పోలీసు బలగం అవసరం లేదన్నారు.

1972 డిసెంబరు 17 న విజయవాడలో కాంగ్రెసువారి సమావేశం జరిగింది. సమావేశ ప్రారంభానికి ముందు పలువురు, మంత్రుల వద్దకు పోయి ఆంధ్రరాష్ట్రం ఏర్పరచమని కోరవలసిందిగా అడిగినారు. ఆంధ్ర, వెంకటేశ్వర అనుబంధ కళాశాలల అధ్యాపక సంఘ కార్యదర్శి శ్రీ యార్లగడ్డ రాజగోపాలరావు, ఇతర వృత్తులకు సంబంధించిన నాయకులు, మంత్రులను ప్రత్యేకాంధ్ర విషయమై కలిసినారు. న్యాయవాదుల సంఘం ప్రతినిధి కాంగ్రెసువారి సమావేశంలో మాట్లాడటానికి అనుమతి కావలెనన్నారు. కాని శ్రీ బి. వి. సుబ్బారెడ్డి తామే స్వయంగా న్యాయవాదుల సంఘానికివచ్చి మాట్లాడినారు. ముల్కీ చరిత్ర అంతా వివరించినారు. న్యాయవాది సంఘ అధ్యక్షులు, కార్యదర్శులు ప్రత్యేకాంధ్ర రాష్ట్ర నిర్మాణానికి అనుకూలంగా నిర్ణయం చేయవలసిందని ఒత్తిడి చేసినారు. అట్లా చేయని పక్షంలో వారు ఆంధ్రులకు అన్యాయం చేసినవారవుతారని, వారిని ఎవరూ క్షమించరని విశదపరచినారు. ఉపముఖ్యమంత్రి శ్రీ సుబ్బారెడ్డిలో ఉద్రేకం పెరిగింది. న్యాయవాదులు తమను పరీక్షకు గురిచేస్తున్నారన్నారు. న్యాయవాదులు ఆ పరీక్షకు నిలబడగలరా అని సవాలు చేసినారు. న్యాయవాదులు పరీక్షకు నిలబడతామని అన్నారు. తరవాత శ్రీ సుబ్బారెడ్డి కాంగ్రెసు సభకు వెళ్ళినారు. ఆ రోజు విజయవాడ పట్టణమంతా జనమయమై పోయింది. అన్ని జిల్లాలనుంచి, పట్టణాలనుంచి ప్రజా సంఘాల కార్యకర్తలు లారీలు, బస్సులు, ట్రాక్టర్లు, కార్లు, మోటారు సైకిళ్ళపై విజయవాడ చేరినారు. ఎక్కువమంది విద్యార్థులు, రైతులు, యువజనులు వచ్చినారు. ఆంధ్ర రాష్ట్ర నినాదాలు మారుమ్రోగినాయి. కాంగ్రెసు ఆఫీసురోడ్డు జన సందోహంతో కిటకిటలాడిపోయింది. విద్యార్థులు మంత్రులను బెదిరించినారు. వారు, ఆంధ్ర రాష్ట్రమే వారి ధ్యేయమని ప్రకటించకపోతే, చరిత్రహీనులవు

తారు. వారిని జనం బ్రతకనీయరనే ఉద్దేశం వ్యక్తపరిచినారు. సాయంత్రం దాకా, చర్చలు జరుగుతూనే ఉన్నాయి. పత్రికలవారు వార్తలకోసం వేచి ఉన్నారు. ప్రజలలో ఉద్రిక్తత పెరిగింది. సభవారిని 'బయటకు రండి' అంటూ కేకలు వేయప్రారంభించినారు. రాత్రి 7 గంటల ప్రాంతంలో ప్రత్యేకాంధ్ర రాష్ట్ర నిర్మాణానికి అనుకూలంగా కాంగ్రెసువారు తీర్మానం చేసినారు. ఆ సభకు 64 మంది శాసన సభ్యులు, 17( మంది పంచాయితీ సమితి అధ్యక్షులు, 11 మంది జిల్లా పరిషత్ అధ్యక్షులు హాజరయినారు. ప్రజలు తీర్మానంపట్ల సంతృప్తి వెల్లడిచేస్తూ వెనుదిరిగినారు, ప్రభుత్వ ఉద్యోగులు ప్రత్యేక రాష్ట్రమే వారి ధ్యేయమంటూ సమ్మెకొనసాగించినారు. తెలంగాణా ప్రాంతీయసంఘాన్ని రద్దు చేయమని ఇరవై ముగ్గురు పార్లమెంట్ సభ్యులు శ్రీమతి గాంధీని కోరి నారు. 1972 డిసెంబరు 20వ తేదీన ముల్కీ బిల్లు ప్రకటించినారు. బిల్లు షర తులు ప్రధాని పంచసూత్రాల పరిధిని అధిగమించి తెలంగాణావారికి మేలు చేసే విగా ఉన్నట్లు అర్థమయింది. తహసీల్దారు గ్రేడువరకు ముల్కీ నిబంధనలు నవంబరు 1, 1956 నుంచి అన్ని ఉద్యోగాలకు వర్తిస్తాయి. జూనియర్ ఇంజనీర్లు, సివిల్ అసిస్టెంట్ సర్జన్ ఉద్యోగాలకే ఇవి మినహాయింపు. ఈ బిల్లు ప్రకటనతో ఆంధ్రలో ఉద్యమం తీవ్రతరం అయింది. సభలు, సత్యాగ్రహాలు నిరాహారదీక్షలు, రైళ్ళు, బస్సుల అటకాయింపులు, ముమ్మరమైనాయి.

అన్నిరంగాలవారు ప్రత్యేక ఆంధ్ర ఉద్యమానికి తమ మద్దత్తు ప్రకటించి నారు. 9 మంది రాజీనామా చేసిన మంత్రుల అండతో అనేకమంది వేర్పాటుమ బలపరిచినారు. విద్యార్థులిచ్చిన పిలుపును అన్నివర్గాలు అందుకొన్నాయి. ఎన్.జి.ఓ లు తమ హక్కుల పరిరక్షణకు ప్రారంభించిన సత్యాగ్రహం ప్రత్యేకరాష్ట్ర వాదానికి దారి తీసింది. న్యాయవాదులు నవంబరు చివరికే ఉద్యమంలో చేరిపోయినారు. ఆంధ్ర కేంద్ర కార్యాచరణ సమితి నాయ కత్వాన్ని ఒప్పుకొన్న కాంగ్రెసువారు, ఇతరులు, ఉద్యమాన్ని బలపరిచినారు. పంచాయితీ సమితి అధ్యక్షులు, జిల్లా పరిషత్ అధ్యక్షులు, శాసన సభ్యులు. అధిక సంఖ్యాకులు ఒకే అభిప్రాయానికి వచ్చినారు. రాజీనామాలు చేసిన మంత్రుల చేరికతో ఆంధ్ర ప్రజలు ఉద్యమాన్ని నూతన ఉత్సాహంతో ఇనుమ డింప జేసినారు. పార్లమెంట్‌లో 1972 డిసెంబరు, 1 వ తేదిని శ్రీ కొత్త రఘురామయ్య ముల్కీ షరతులను విమర్శించినారు. గుంటూరులో లక్షలాది మంది ముల్కీ వ్యతిరేక ప్రదర్శన 1972 డిసెంబరు 22 న జరిపినారు.

1972 డిసెంబరు 24 న జరిగిన సంఘటనలు ఆంధ్ర ఉద్యమ చరిత్రలో ప్రధాన విషయాలు. కమ్యూనిస్టులు సమైక్యతకై విజయవాడలో ఊరే గింపు జరిపినారు. దానిని అటంక పరిచిన ప్రజలమీద కాల్పులు జరిగినాయి. ఆ రోజు చనిపోయినవారి సంఖ్య పెద్దది. కాకాని వెంకటరత్నం అదే రాత్రి

మరణించినారు. 1972 డిసెంబరు 17 న ఆంధ్ర మంత్రులను ఉద్యమానికి నడిపినవారు శ్రీ కాకాని వెంకటరత్నం. ప్రత్యక్షంగా రంగంలో ఉండి ఉద్యమాన్ని బలపరచిన కాకాని వెంకటరత్నంగారి మరణం ప్రజలకు తీవ్రమైన బాధను కలిగించింది.

శ్రీ పి.వి. నరసింహారావు, వారి మద్దతుదార్లు ఆంధ్రోద్యమాన్ని తేలికగా అంచనా వేసినారు. కొందరు కేంద్ర నాయకులు ఆంధ్ర ఉద్యమాన్ని పెట్టుబడిదారులు, భూస్వాములు నడిపిన ఉద్యమం అన్నారు. ఆంధ్రుల అభిమానాన్ని దెబ్బకొట్టగల ఉపన్యాసాలు చేయడం జరిగింది. పరిస్థితి చక్కబడకపోగా జనంలో ఉద్రిక్తత పెరిగింది. 1972 డిసెంబరు 24 వ తేదీ కమ్యూనిస్టులు, సమైక్యవాదులు జరిపే ఊరేగింపులో శ్రీ పి.వి. నరసింహారావు అనుయాయులు, మండలి కృష్ణారావు తదితరులు పాల్గొంటారని తెలియ వచ్చింది. విద్యార్థులు, యువకులు ఆ జరగనున్న ఊరేగింపును భగ్నం చేయ తలపెట్టినారు. కాకాని వెంకటరత్నం తమ అనుచరులకు అట్లా చేయటానికి అనుమతి ఇచ్చినారు. చుట్టుపట్ల గ్రామాలవారికి కూడా ఊరేగింపును ప్రతిఘటించమని ఆదేశాలు వెళ్ళినాయి. ఊరేగింపు జరిపేవారు ఆంధ్రపతాకాలను, న్యాయవాది సంఘ బానర్లను పీకి పారవేసినారు. వేయిమందిదాక స్త్రీలుగల పెద్ద సమూహం గన్నవరం విమానాశ్రయాన్ని ఆక్రమించుకొన్నారు. విమానంలో రానున్న శ్రీ పి.వి. నరసింహారావు అనుచరులను విజయవాడ రానీయమని వారు అక్కడ చేరినారు. విమానం దిగకుండానే తిరిగిపోయింది. విజయవాడలో కమ్యూనిస్టుల ఊరేగింపు ప్రారంభమయింది. మొదట తలపెట్టిన దారి గాక, మరోదారిన ఊరేగింపు మళ్ళించినారు. సి.ఆర్.పి. ఊరేగింపు వారికీ, ఆటంకపరిచే విద్యార్థులకూ మధ్యన ఉన్నది. కమ్యూనిస్టులు పెద్ద కర్రలకు జెండాలు తగిలించి బయలుదేరినారు. కొందరు పెద్దలు ఊరేగింపు నిలిపివేసి, జరగనున్న దారుణాన్ని అరికట్టమని కమ్యూనిస్టులను కోరినారు. విద్యార్థులు మేజిస్ట్రేట్ కోరిక ప్రకారం ప్రశాంతంగా కూర్చున్నారు. ఎంతోమంది ప్రజలు ఏమి జరగనున్నదో అని ఆతురతగా వేచిఉన్న సమయంలో బాష్పవాయువు ప్రయోగం, లాఠీల ప్రయోగం, లైట్లు ఆరిపోవడం, కాల్పులు వెనువెంటనే జరిగిపోయినాయి. ఎనిమిదిమంది యువకులు కాల్పులలో మరణించినారు. సి.ఆర్.పి.కి, ప్రజలకు మధ్య తీవ్రపోరాటం జరిగింది. శ్రీ కాకాని వెంకటరత్నం ఈ సంఘటనకు తట్టుకోలేక, అదేరాత్రి గుండెపోటుతో మరణించినారు. 1972 డిసెంబరు 25 కాకాని వెంకటరత్నంగారి భౌతిక కాయానికి అంత్యక్రియలు జరిపినారు. లక్షల సంఖ్యలో ప్రజలు కాకాని వెంకటరత్నంగారి అంతిమయాత్ర ఊరేగింపులో పాల్గొన్నారు. కాకాని వెంకటరత్నంగారి ఆశయమే ప్రజల ఆశయమని, అదే ప్రత్యేక ఆంధ్ర అని నినాదాలు లేచినాయి. శ్రీ బి.వి. సుబ్బారెడ్డి తమ మంత్రుల సహకారం సంపూర్ణంగా, ఆంధ్రకేంద్రాచరణ సమితికి ఉంటుందన్నారు.

ఆంధ్ర కేంద్ర కార్యాచరణ సమితి కార్యవర్గ సమావేశం 1972 డిసెంబరు 26 న జరిగింది. 1973 జనవరి 2 న ఆంధ్ర అంతటా బంద్ జరపవలెనని శ్రీ జి. సి. కొండయ్య ప్రవేశపెట్టిన తీర్మానాన్ని ఆమోదించినారు. 1972 డిసెంబరు 11 న శ్రీ తెన్నేటి విశ్వనాథం చేసిన నిధి వసూళ్ళ తాలూకు లెక్కలను గూర్చి ఒక యువకుడు ప్రశ్నించినాడు. శ్రీ తెన్నేటి విశ్వనాథం లెక్కల వివరాలందించినారు. ఆ తరవాత వారు నిధి వసూళ్ళకు తాముగా పూనుకోలేదు. శ్రీ తెన్నేటి విశ్వనాథంను లెక్కల విషయం అమర్యాదగా ప్రశ్నించినారని శ్రీ ఎ. శ్రీరాములు కోపగించుకొన్నారు. ఒక సారథ్య సంఘం వేసి దానిద్వారా కార్యక్రమాలను నడపవలెనని నిశ్చయించినారు. ఆంధ్ర కేంద్ర కార్యాచరణ సమితి కార్యాలయాన్ని నడిపే నిమిత్తం శ్రీ త్రిపురనేని శివ ప్రసాదు 1972 డిసెంబరు 12 న నియమితులైనారు. ఆయనకూ, కార్యదర్శులలో ఒకరైన శ్రీ ప్రకాశచంద్ర శతపథికి అభిప్రాయభేదాలు కలిగినాయి. అంతట శ్రీ ఎం.వి. రామమూర్తి కార్యాలయ పర్యవేక్షకుడుగా నియమితులైనారు. ఆయన ఇతర కార్యదర్శుల కార్యక్రమాలకు సమన్వయకర్తగా ఉన్నారు. ఆయన సారథ్య సంఘ సభ్యులుగానూ ఉన్నారు. కడప, విజయవాడ, విశాఖపట్టణాలలో ఆకాశవాణి పికెటింగు జరపవలెనని నిశ్చయించినారు. రైళ్ళు, ప్రభుత్వ వాహనాలను పూర్తిగా నిలపవలెనని నిర్ణయం జరిగింది. ఈ కార్యక్రమం శ్రీ బి. వి, సుబ్బారెడ్డితో సంప్రదించిన మీదట నిర్ణయించినట్లు తీర్మానంలో పేర్కొన్నారు.

1972 డిసెంబరు 27 న అనంతపురంలో జరిగిన కాల్పులలో 8 మంది మరణించినారు. ఆంధ్ర కాంగ్రెసు వేర్పాటు నాయకులు 1972 డిసెంబరు 31 న తిరుపతిలో సమావేశమైనారు. 132 మంది ఎం.ఎల్.ఏ.లు 11 మంది పార్లమెంట్ సభ్యులు హాజరైనారు. ఆంధ్ర కాంగ్రెసు కార్యాచరణ సమితి నిర్మాణం చేసినారు.

శ్రీయుతులు గౌతు లచ్చన్న, జూపూడి యజ్ఞనారాయణ తెన్నేటి విశ్వనాథం, శ్రీనివాసులరెడ్డిలను ప్రభుత్వం నిర్బంధంలోకి తీసుకొంది. సైకిలులో 1973 జనవరి 1 న కాల్పులు జరిగినాయి. నిరాహారదీక్షా శిబిరాన్ని పోలీసులు బలవంతంగా పీకివేయగా ప్రజలకు, పోలీసులకు ఘర్షణ జరిగింది. పోలీసు కాల్పులలో ఒకరు మరణించినారు. 1973 జనవరి 2 న బంద్ విజయవంతంగా జరిగింది. నెల్లూరులో ఆ దినం జరిగిన కాల్పులలో 13 మంది, అనంతపురం కాల్పులలో ముగ్గురు చనిపోయినారు. అప్పటికి కాల్పులలో చనిపోయినవారు మొత్తం 60 మంది. జనవరి నాలుగున తెనాలి తాలూకా కారేవేంద్రపాడులో ఆంధ్రకేంద్ర కార్యాచరణ సమితి సమావేశమయింది. అరెస్టుకాగా మిగిలిన సభ్యులు హాజరైనారు. కేంద్రమంత్రులు శ్రీయుతులు జగ్‌జీవన్‌రామ్ స్వరణ్‌సింగ్, ఫక్రుద్దీన్ అలీ అహమద్ ఆంధ్రకు రానున్నట్లు ఆకాశవాణి తెలిపింది. ఆ విషయం సమావేశంలో చర్చకు వచ్చింది. కేంద్ర రాయబార

వర్గాన్ని బహిష్కరించ నిశ్చయించినారు. వారి రాక సందర్భంగా నల్లజెండా ప్రదర్శనలు జరపవలెనన్నారు. హర్తాళ్ జరపవలెనన్నారు. సంభాషణలకు రావలసిందని ఆహ్వానాలు రాగా తిప్పికొట్టినారు. సత్యాగ్రహాలూ, పన్నుల నిరాకరణ, రైళ్ళు, ఆర్.టి.సి. బండ్లు నిలపడం కొనసాగవలెనన్నారు. 1973 జనవరి 10 వ తేదీ మృతవీరుల దినంగా పాటించవలెనన్నారు. ప్రభుత్వ ఆస్తులను నాశనం చేస్తేగాని ఉద్యమపు ఊపు, ప్రజల బలం, ప్రభుత్వానికి తెలిసిరాదనుకొన్నా, అట్లాంటివేవీ జరగకూడదనే నిశ్చయించినారు. ప్రజల ఆస్తులను ప్రజలే ధ్వంసం కావించేదం పొరపాటన్నారు. వీరి తీర్మానాలు వెనువెంటనే ప్రజలను ఆకట్టుకోకపోవడానికి అప్పుడే జరిగిన విద్యుత్తో పనివారి సమ్మె (5 రోజులపాటు) కారణమయింది. ఆంధ్ర - కేంద్ర కార్యాచరణ సమితికి చెందిన ముగ్గురు ఉపాధ్యక్షులూ, నలుగురు కార్యదర్శులు అరెస్టు అయినారు.

విద్యుత్ పనివారి సమ్మెవల్ల ప్రజలుచాలా ఇబ్బందులకు గురిఅయినారు. కాని వారు సహనాన్ని కోల్పోలేదు. విద్యుత్ పనివారిమీద సమ్మె విరమించమని ఒత్తిడి తేవలెనని కృష్ణాజిల్లా రైతులు పట్టుబట్టినారు. విద్యార్థులు, ఎన్.జి.ఓ.లు, కార్యాచరణ సమితి నాయకులు కలిసి పనిచేయుటవల్ల మధ్యలో సమ్మె ఆపటం జరగలేదు. తెలంగాణానుంచి విద్యుత్ శాఖవారిని తెచ్చి విజయవాడలో విద్యుత్ సరఫరా చేయించవలెనని చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. రేడియో సమ్మె విరమణ జరిగినట్టు ప్రచారం చేసింది. కాని రేడియో వార్తలు ప్రజలు నమ్మటం మానివేసినారు. "అసత్యవాణి" అంటూ ఆకాశవాణిని నిందించినారు. అరెస్టుకాని శ్రీయుతులు జి. సి. కొండయ్య, ఎం.వి. రామమూర్తి, తుమ్మల చౌదరి, పసుపులేటి కోటేశ్వరరావులు కార్యక్రమాన్ని కొనసాగించినారు. స్వతంత్రపార్టీ అధ్యక్షులు శ్రీ సుంకర సత్యనారాయణ జైలునుంచి విడుదలై వచ్చినారు. హైదరాబాద్‌లోని డిక్లెన్యూల్ల అభిప్రాయం శ్రీ గౌతులచ్చన్న తెలియజేసినారు. దాని ఆధారంగా వేర్పాటు కాంగ్రెసు నాయకులను కేంద్ర కార్యాచరణ సమితిలోకి తీసుకొని రావలెనని నిర్ణయం జరిగింది.

1973 జనవరి 7, 9 తేదీలలో విశాఖలో కాల్పుల ఫలితంగా 12 మంది చనిపోయినారు. కాల్పులు, లాఠీచార్జీలు, అరెస్టులు జరుగుతూనే ఉన్నాయి. కేంద్ర అంతరంగికశాఖ ఉపమంత్రి శ్రీ మీర్ధా, ప్రధాని పంచసూత్రాల గురించి ఇక తర్జన భర్జన బేరాలు సాగవన్నారు. 1973 జనవరి 8 న ముగ్గురు గెజిటెడ్ ఆఫీసర్లు సస్పెండ్ అయినారు. 1973 జనవరి 9 న 15 మంది పార్లమెంట్ సభ్యులు తెనాలిలో సమావేశమైనారు. 1973 జనవరి 26 అర్ధరాత్రికి ఆంధ్రరాష్ట్ర నిర్మాణం ప్రకటించని పక్షంలో కాంగ్రెసుపార్టీనుంచి బయట పడతామన్నారు. 1973 జనవరి 26 న మరల సమావేశం కావలెనని నిశ్చయించుకొన్నారు.

1973 జనవరి 11 న రాష్ట్ర కాంగ్రెసువర్గాన్ని రద్దుచేసి ఉన్నతాధికార సంఘాన్ని నియమించినారు. అదేరోజున ముఖ్యమంత్రి 8 మంది కొత్తమంత్రులను మంత్రివర్గంలోకి చేర్చుకొన్నారు. ఆంధ్రలో రాష్ట్రపతిపాలన విధించవలెనని 'హిందూ' దినపత్రిక సంపాదకీయం వ్రాసింది. ఆంధ్ర కాంగ్రెసు కార్యాచరణ సమితి తమ గుంటూరు సమావేశంలో 1973 జనవరి 21 లోగా ప్రత్యేకాంధ్ర నిర్మాణం ప్రకటించనట్లయితే పార్టీకి రాజీనామాలు సమర్పించడానికి నిశ్చయించినారు. ఆంధ్ర కార్యాచరణ సమితి, కాంగ్రెసు కార్యాచరణ సమితుల సంపూర్ణ కలయికను, ఉమ్మడి కార్యాచరణ సంఘ నిర్మాణాన్ని వ్యతిరేకించింది. శ్రీయుతులు సుంకర సత్యనారాయణ, యార్లగడ్డ రాజగోపాలరావు, పిన్నమనేని కోటేశ్వరరావు, కాసు వెంగళరెడ్డి, జి.సి. కొండయ్యలతో ఒక సంప్రదింపుల సంఘం ఏర్పడింది. జట్లు జట్లుగా (5 మంది ఒక జట్టుగా) సత్యాగ్రహాలు నడపనున్నట్టుగా ప్రకటించినారు. రాష్ట్రాన్ని విభజన చేస్తే రాయలసీమలో మరో ఉద్యమం రాగలదని శ్రీ చంద్రజిత్ యాదవ్ బెదిరించినారు. ఆకాశవాణి ప్రసారాలకు వ్యతిరేకంగా విజయవాడలో 17 న, గుంటూరులో 18న బంద్ జరిపినారు.

ముఖ్యమంత్రి శ్రీపి.వి. నరసింహారావు జనవరి17న రాజీనామాచేయవలసి వచ్చింది. కాంగ్రెసు ఉన్నతాధికార సంఘం అధ్యక్ష పరిపాలన కోరింది. 1973 జనవరి 18న అధ్యక్షపాలన విధించినారు. నరీన్ సలహాదారుగా ఉన్నారు. ఆనాటికి కాల్పులలో మరణించినవారు 72 అనీ, పోలీసు కృూరత్వానికి గురి అయినవారు 600 మంది అనీ తెల్పినారు. 1973 జనవరి 18న ప్రభుత్వోద్యోగుల నాయకుడు శ్రీ బి.బి. రామకృష్ణారావును అరెస్టు చేసినారు.

1973 జనవరి 18న గుంటూరు, విజయవాడ, అమరావతి, మాచర్ల, పిడుగురాళ్ళ, ఏలూరు, కాకినాడ, రాజమండ్రి, పొందూరు, బారువలలో పోలీసు కాల్పులు జరగగా అనధికారంగా తెలిసిన మరణాలసంఖ్య 238 ఉండవచ్చునన్నారు. పోలీసులవలన, ఇతర రకంగా హింసలకు గురైనవారు దాదాపు 3 వేలమంది ఉండవచ్చునని అంచనా వేసినారు. ప్రజలను భయపెట్టి ఉద్యమం కొనసాగకుండా చేయవలెనని పోలీసులు హింస సాగిస్తున్నారనుకొన్నారు. సి.ఆర్.పి. వాళ్ళు స్త్రీలను విచక్షణా రహితంగా కొట్టడం, ఇళ్ళలోనుంచి సామాన్లు తీసుకొనిపోవడం, వ్యక్తులను మోకాళ్ళమీద దేకించడం చేసినారు. ప్రజలు రోజుల తరబడి కర్ఫ్యూలో బ్రతికినారు. దౌర్జన్యం ప్రజలను లొంగదీయలేకపోయింది. సి.ఆర్.పి.తో ప్రజలు శక్తివంచన లేకుండా పోరాడినారు. నిరాయుధులుగా ఉన్న ప్రజలు ఒక నీటిబాంబు వంటిది తయారు చేసినారు. సోడాసీసాలో నీరు నింపి, గ్రామఫోనుకు ఉపయోగించే సూదులు అందులో వేయడం, వాటిని గాలిలో విసిరి, మరో సోడాసీసాతో దానిని పగులగొట్టి పోలీసువారిని గాయపరిచినారు.

1973 జనవరి 19 న ఆంధ్ర కేంద్ర కార్యాచరణ సమితి సారథ్య సంఘం రహస్యంగా విజయవాడకు దగ్గరలో సమావేశమయింది. వారు తీసుకున్న నిర్ణయాలు ఇట్లా ఉన్నాయి :

ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని సూత్రప్రాయంగా నిర్ణయించడం, వారి మీద పెట్టిన కేసులను పూర్తిగా ఉపసంహరించడం, ఆంధ్రనుంచి మిలిటరీని, రిజర్వు పోలీసును పంపివేయడం, పోలీసు కాల్పులపై దర్యాప్తులు జరిపించడం ఈ పై షరతులు అంగీకరించినమీదటే కేంద్ర ప్రభుత్వంతోగాని, కాంగ్రెసు ఉన్నతాధికార సంఘంతోగాని, చర్చలకు దిగగలరు. ఆంధ్ర కాంగ్రెసువారు 21న కాకినాడలో జరపబోయే సమావేశంలో పాల్గొని సలహా లివ్వడానికి కొందరు సభ్యులను పంపవలెనని నిశ్చయించినారు. 20వ తేదీన శ్రీ తెన్నేటి విశ్వనాథం విడుదలైనారు. 1973 జనవరి 26 ప్రజాస్వామ్య పరిరక్షణ దినంగా పాటించ నిశ్చయించినారు. కాకినాడ కాంగ్రెసు సమావేశానికి కూడా వేలాది జనం వచ్చినారు. కాంగ్రెసేతరులను సమావేశానికి రానిచ్చినందుకు శ్రీ ఎన్.జి. రంగా కోపగించినారు. కాంగ్రెసుకు రాజీనామా చేయనిశ్చయమయింది. సభ ప్రశాంతంగా జరగలేదు. రాత్రి సమావేశం జరిపి కార్యక్రమాన్ని రూపొందించినారు.

1973 జనవరి 26 రిపబ్లిక్ దినోత్సవ బహిష్కరణ, పై ఆంధ్రాపతాకం ఎగురవేయడం, సమ్మెలు, ఊరేగింపులు జరపడం, నల్లబాడ్జీలు ధరించడం, విమానం, రైళ్ళ రాకపోకలు అరికట్టడం, ప్రైవేటు టూరిస్టు వాహనాల యజమానులు టికెట్లధర పెంచకుండా ఆపడం, అన్ని ప్రభుత్వ కార్యాలయాల ముందు సత్యాగ్రహాలు, వార్తాపత్రికలు, టెలిఫోను, టెలిగ్రాఫ్ ఆఫీసుల పని కొనసాగనివ్వడం, వారి వాహనాలు తిరగనివ్వడం, బ్యాంకులు సోమ, మంగళ, శుక్రవారాలు మాత్రమే పనిచేయడం, నిషేధాజ్ఞ ఉల్లంఘన వల్ల జరగబోయే అరెస్టులకు సిద్ధపడడం, పన్నుల నిరాకరణ, ఉద్యమాన్ని తీవ్రతరం చేయడం - ఇదంతా కార్యక్రమంగా నిర్ణయించినారు. దీన్ని రూపొందించినవారు శ్రీ జి.సి. కొండయ్య. శ్రీ బి.వి. సుబ్బారెడ్డి దీనిని ఆమోదించినారు ఆంధ్ర, వెంకటేశ్వర విద్యార్థి సంఘ కార్యాచరణ సమితి అధ్యక్షుడు శ్రీ బి.జె. అగస్టీన్, ఆంధ్రసేన వ్యవస్థాపకుడు శ్రీ మాదాల జానకిరాం కూడా దీనిపైన సంతకాలు చేసినారు. శ్రీ బి.వి. సుబ్బారెడ్డి కాంగ్రెసువారి రాజీనామాలు 1973 ఫిబ్రవరి 5 వరకు చేయడానికి గడువు నిర్ణయించినారు. అప్పటికి ప్రత్యేకాంధ్ర ప్రకటించకపోతే మహావిప్లవం తెస్తామన్నారు.

1973 జనవరి 23న విడుదలైన శ్రీ గౌతులచ్చన్నను కేంద్ర కార్యాలయ పర్యవేక్షక కార్యదర్శి కలసి సంప్రదించినారు. కేంద్ర కార్యాచరణ సమితి 1973 జనవరి 24 న గుంటూరులో సమావేశమయింది. అందిన కార్య

క్రమాన్ని ఆమోదించింది. ప్రభుత్వ దౌర్జన్యాన్ని తీవ్రంగా ఖండించింది. శ్రీ లచ్చన్న పూనుకొని 85 మంది కాంగ్రెసు శాసన సభ్యుల రాజీనామా లను ఢిల్లీ పంపే ప్రయత్నాలు చేసినారు. శ్రీ చల్లా సుబ్బారాయుడు వాటిని హైదరాబాదు నుంచి ఢిల్లీ పంపిస్తామన్నారు. 1973 జనవరి 26న దాదాపు లక్షమంది మౌనంగా కాలినడకన కృష్ణ తీరానికి చేరినారు. శ్రీ బి.వి. సుబ్బా రెడ్డి సభకు హాజరు కాలేకపోయినారు. శ్రీయుతులు ఎన్.జి. రంగా, తెన్నేటి విశ్వనాథం, లచ్చన్న, విద్యార్థి నాయకుడు ప్రసాద్ ఉపన్యసించినారు. శ్రీ కొమ్మారెడ్డి సూర్యనారాయణ సభాధ్యక్షులు ప్రత్యేకాంధ్ర కోసరె పోరాడతామని ప్రతిజ్ఞలు చేసినారు. పోలీసు అత్యాచారాల గురించి శ్రీ తెన్నేటి విశ్వనాథం ప్రెసిడెంట్ శ్రీ వి. వి. గిరికి లేఖ పంపినారు. 1973 జనవరి 29న తాడేపల్లిగూడెంలో కేంద్ర కార్యాచరణ సాధక్య సంఘం సమా వేశం జరిగెను. కాంగ్రెసు, కార్యాచరణ సమితి వేరన్నట్లు, కేంద్ర కార్యా చరణ సమితి సంప్రదింపుల సంఘం, దాని కార్యక్రమం తమకు తెలియదన్నట్లు శ్రీ బి.వి. సుబ్బారెడ్డి విశాఖలో ప్రసంగం చేసినట్లు వార్తలు వచ్చినాయి. ఇది అన్నివర్గాల వారిని కలవర పరచింది. సంప్రదింపుల సంఘం అవసరం తీరింది గనక కాంగ్రెసు కార్యాచరణ సమితి కేంద్ర కార్యాచరణ సమితితో కలిసి పోవలసిందని కోరుతూ ఆంధ్ర కార్యాచరణ సమితి ఉపాధ్యక్షులు శ్రీ పి. సూర్యచంద్రరావు శ్రీ బి. వి. సుబ్బారెడ్డికి లేఖ నందజేసినారు. ఇది సంప్ర దింపుల సంఘం ఏర్పడటంలో బాగా తోడ్పడింది. శ్రీ బ్రహ్మానందరెడ్డి సోద రుడు శ్రీ కాసు వెంగళరెడ్డి (గుంటూరుజిల్లా పరిషత్ అధ్యక్షులు) నరసరావు పేటలో 1973 ఫిబ్రవరి 3, 4 తేదీలలో, సమావేశాలు ఏర్పాటు చేసినారు. తలె త్తిన సమస్యలగురించి అక్కడ పరిష్కారమార్గం కనుక్కోవలెనన్నారు.

ఆంధ్ర అంతా ప్రజా జీవనం స్తంభించింది. కేంద్ర ప్రభుత్వ ఆఫీసులు మూతపడినాయి. కోర్టులో కూడా మూతపడినాయి. ఎన్.జి.ఓ.లు ప్రభుత్వో ద్యోగులు సమ్మె కొనసాగిస్తూనే ఉన్నారు. ఎట్లాంటి పన్నులూ వసూలు కావ డంలేదు. రైళ్ళు, ఇతర వాహనాలు తిరగడంలేదు. పోలీసులు, మేజిస్ట్రేట్లు పనిచేస్తున్నారు. అదనపు రిజర్వు పోలీసు మధ్యప్రదేశ్, పంజాబ్, రాజస్థాన్‌ల నుంచి దిగినారు. సైన్యం దిగినా, ఇంకా కార్యరంగంలోకి దూకలేదు. వివిధ వృత్తులవారు 144 సెక్షన్‌ను ధిక్కరించి వివిధ పట్టణాలలో ఊరేగింపులు జరిపి నారు. విద్యార్థులూ, స్త్రీలూ ఊరేగింపులలో పాల్గొన్నారు. కొందరు అరెస్టయినారు. కృష్ణా, గుంటూరు జిల్లాలలో దాదాపు 140 మైళ్ళ పొడవున ఊరేగింపులు, రకరకాల వాహనాల సహాయంతో జరిపినారు. వారికి తోవ పొడవునా గ్రామీణులు చల్లనిపానీయాలు, పండ్లు అందించినారు. వాహనాల పెట్రోలు ఖర్చులు ప్రజలే చందాల రూపంలో భరించినారు. యజమానులు వాహనాలను ఉచితంగా ఇచ్చినారు.

నెల్లూరులో 1973 జనవరి 27న జరిగిన మహాసభలో విద్యార్థినాయకులు శాసన సభ్యులను రాజీనామాలు ఇవ్వమని కోరినారు. సాయుధపోరాటానికి వారు పిలుపు ఇవ్వవలెనని కూడా అన్నారు. న్యాయవాద సంఘం 29న సమావేశమై శాసన సభ్యులను రాజీనామా చేయమని అడిగింది. నరసరావు పేటలో జరిగిన ఆంధ్రకేంద్ర కార్యాచరణ సమితి, ఆంధ్ర కాంగ్రెసు కార్యాచరణ సమితి సంయుక్త సమావేశానికి విద్యార్థి నాయకులు కూడా హాజరైనారు. అరమరికలు లేకుండా చర్చలు జరిపినారు. న్యాయవాదుల తరఫు నుంచి శ్రీ ఎం.వి. రామమూర్తి, విద్యార్థుల ప్రతినిధి శ్రీ శ్రీధర రెడ్డి శాసన సభ్యులను రాజీనామా చేయమని కోరినారు. కాంగ్రెసు నాయకులకు ఈ సంగతి రుచించలేదు. శ్రీ సి.వి.కె. రావు వ్యతిరేకించినారు. రెండుపక్షాల లోనూ కొందరు అహింసా మార్గాన్నే బలపరిచినారు. మరికొందరు హింసా మార్గం అవలంబించనిదే లక్ష్యసాధన వీలుపడదన్నారు. కాని వార్తాపత్రికలలో కాంగ్రెసువారు మాత్రమే శాంతియుతమార్గాన్ని అవలంబించవలెనన్నట్లు వార్త వచ్చింది. ఒక సంయుక్త కమిటీ ఏర్పరచినారు. ఎన్. జి. రంగా దానికి ప్రత్యేక రాష్ట్ర సాధన సంయుక్త కమిటీ అని పేరు పెట్టినారు. కొంత చర్చ అనంతరం ఫిబ్రవరి నాలుగున సమావేశమై కార్యక్రమం నిర్ణయించుకొందామనుకొన్నారు. పెద్దలే కార్యక్రమం రూపొందించవలెనని నిర్ణయించినారు. ఆ రోజే కొన్ని తీర్మానాలు ఆమోదించినారు.

కమిటీ తీర్మానాలకు, అందులో భాగం పంచుకొన్న సంస్థలు బద్ధులు. కార్యాలయాలదగ్గర, ఇళ్ళవద్ద పికెటింగులు చేయవలె. రైళ్ళను, బస్సులను నిలిపివేయవలె. పోలీసులను సాంఘికంగా బహిష్కరించవలె. బ్యాంకులలో ప్రభుత్వ కార్యకలాపాలు అసలు జరగనీయరాదు. ఆంధ్రలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులనందరినీ ఉద్యమంలో చేరమని కోరినారు. రేవు కార్మికులను కూడా సమ్మె చేయమని అడిగినారు. ఢిల్లీలో ప్రత్యేక రాష్ట్ర అనుకూల ప్రచారానికి తగిన ఏర్పాట్లు చేయదలిచినారు. ఫిబ్రవరి 10న సామూహిక నిరాహారదీక్షలు జరపవలెనని నిశ్చయించినారు.

1973 ఫిబ్రవరి 4న జరిగిన సంయుక్త కార్యాచరణ కమిటీ సమావేశానికి శ్రీ బి.వి. సుబ్బారెడ్డి అధ్యక్షత వహించినారు. ఆయననే కమిటీ అధ్యక్షులుగా ప్రకటించవలసి వచ్చింది. ముగ్గురు ఆంధ్రమంత్రులు సంప్రదింపుల నిమిత్తం ఢిల్లీ వెళ్ళాలనుకొన్నారు. శ్రీ బి.వి. సుబ్బారెడ్డి వారికి అనుమతి ఇవ్వలేదు. ఈలోగా చేబ్రోలు హనుమయ్య, కృష్ణాజిల్లా పరిషత్ అధ్యక్షులు శ్రీ పిన్నమనేని కోటేశ్వరరావు, ఆంధ్ర - వెంకటేశ్వర విశ్వవిద్యాలయాల విద్యార్థిసంఘ కార్యాచరణ సమితి అధ్యక్షుడు శ్రీ బి.జె. ఆగస్టీన్‌లను ప్రభుత్వం అరెస్టు చేసింది.

నరసరావుపేటలో తీసుకొన్న నిర్ణయాలు పత్రికాముఖంగా తెలుసుకొన్న ప్రజలు ఉద్యమంపట్ల మరీ ఉత్సాహవంతులైనారు. కార్యక్రమాన్ని

మిక్కిలి ఉత్సాహంతో కొనసాగించవలెనని నిర్ణయించుకొన్నారు. 1973 ఫిబ్రవరి 6 నుంచి 21 వరకు విజయవాడనుంచి ఒక్క రైలును కూడా కదలనివ్వలేదు. కొంతమంది డ్రైవర్లను తీసుకొని వెళ్ళి దాచినారు. నెమ్మదిగా రాజమండ్రి, గుంతకల్లు, నంద్యాలకు రైళ్ళు ఆపే కార్యక్రమం విస్తరించింది. ఎన్నో వలంటీరుదళాలు ఈ పనికి పూనుకొన్నాయి. యువతీ, యువకులు ఎక్కువగా ఈ కృషి చేసినారు. రైల్వే కార్మిక సంఘాలు పికెటింగ్ వల్ల పనులకు హాజరు కాలేకపోతున్నామనీ, కాని వారి గైరుహాజరును డ్యూటీగానే పరిగణించవలెనని తీర్మానాలు చేసుకొన్నారు.

1973 ఫిబ్రవరి 5 నాటికి మహావిప్లవం తెస్తామని శ్రీ బి. వి. సుబ్బారెడ్డి లోగడ చెప్పి ఉండటంతో ప్రభుత్వం 80 వేలమంది రిజర్వు పోలీసులను ఆంధ్రలో దింపింది. శ్రీ బి.వి. సుబ్బారెడ్డి ఆ విప్లవ వివరాలు ఎవరికీ చెప్పలేదు. యువత ఆ విప్లవం కోసం ఎదురు చూసింది. రాకపోయేసరికి నిరుత్సాహ పడింది.

జనసంఘ నాయకులు శ్రీ వాజ్‌పాయ్ 1973 ఫిబ్రవరి 1 న విజయవాడ బహిరంగ సభలో ప్రసంగించినారు. 6వ తేదీ డి.ఎం.కె. నాయకుడు శ్రీ జి విశ్వనాథం ఉపన్యసించినారు. వారిద్దరూ ప్రత్యేకాంధ్ర ఉద్యమాన్ని బలపరిచినారు. ప్రధానమంత్రి 1973 జనవరి 7న ఖట్మండు వెళ్ళబోయేముందు పత్రికలవారితో ఉద్యమం గురించి మాట్లాడినారు. తాము అందరితో సంభాషణలకు సిద్ధమేనన్నారు. దౌర్జన్యకాండకు గురైన వారిపట్ల తమ సానుభూతి తెలిపినారు. నాయకులు దౌర్జన్యం చేయిస్తారని, తాము అనుకోవటం లేదన్నారు. అదేరోజున శ్రీ బి.వి. సుబ్బారెడ్డికి ఢిల్లీ సంప్రదింపులకు రావలసిందిగా ప్రధానమంత్రినుంచి ఆహ్వానం అందింది. ఆయన ప్రధానితో తప్ప మరెవరితోనూ సంప్రదించ నిరాకరించినారు. 1973 ఫిబ్రవరి 9 వ తేది ఆంధ్ర కార్యాచరణ సమితి ఉపాధ్యక్షులు శ్రీ బసిరెడ్డి, కార్యదర్శి శ్రీ వి. కృష్ణమూర్తినాయుడు, కోశాధికారి శ్రీ మూర్తిరాజు ఢిల్లీ వెళ్ళినారు. శ్రీ లచ్చన్న సంయుక్త కార్యాచరణ సమితి సమావేశం ఏర్పాటు చేయవలెనని కోరినారు. 1973 ఫిబ్రవరి 15 నాటికి తాము తీరికగా ఉండగలమని, సమావేశం అప్పటికి జరపమని శ్రీ బి.వి. సుబ్బారెడ్డి కబురు పంపినారు. 1973 ఫిబ్రవరి 10న నిర్ణయం ప్రకారం లక్షలాది ఆంధ్రులు సామూహిక నిరాహారదీక్షలు జరిపినారు. 1973 ఫిబ్రవరి 15న సంయుక్త కార్యాచరణ సమితి కారంచేడులో సమావేశమయింది. 1973 ఫిబ్రవరి 13న ఆంధ్రకేంద్ర కార్యాచరణ సమితి సారథ్య సంఘం రేవేంద్రపాడులో సమావేశం జరిపింది. అక్కడ ముగ్గురు ఆంధ్ర మంత్రులు సంప్రదింపులకు ఢిల్లీ వెళ్ళటాన్ని విమర్శించినారు. వాహనాల పన్నులు చెల్లించనందున వాటిని స్వాధీనం చేసుకుంటామని ప్రభుత్వం అన్నది. అందు మూలంగా వాహనాలు షెడ్లలోనే ఉండిపోయినాయి. రైతులు తమ

పంటలను మార్కెట్‌కు చేర్చటానికి వీలులేకపోయింది. ప్రైవేటు టాక్సీల వాళ్లు, పెట్రోలు బ్లాక్ మార్కెట్టులో కొంటున్నామని ఛార్జీలు పెంచినారు. కృష్ణ, గుంటూరు, పశ్చిమగోదావరి జిల్లాలలో బస్సులు జాతీయం చేసినారు. అక్కడ ప్రజలు ప్రయాణ సౌకర్యం బొత్తిగా లేక బాగా ఇబ్బందులు పడినారు.

కారంచేడు సమావేశ స్థలంగా నిర్ణయించటానికి కారణాలు సమితి వారు చెప్పవలసి వచ్చింది. గుంటూరు, బెజవాడలో ప్రశాంతంగా సమావేశం జరపలేక పోతున్నామని, కారంచేడులో అనుకూల వాతావరణం ఉన్నదనీ, పెద్దఇల్లు సమావేశానికి నిర్ణయించడమైందనీ, అక్కడ సహాయపడటానికి పెద్ద వలంటీరుదళం ఉన్నదనీ,అవన్నీ ఆలోచించే,అక్కడ సమావేశం జరపడానికి నిశ్చయమయిందనీ అన్నారు. అక్కడ సమావేశం రాత్రి ప్రారంభమైంది శ్రీ బి. వి. సుబ్బారెడ్డి హాజరు కాలేదు. కాంగ్రెసు సమితి తరపున వచ్చిన సభ్యులు శ్రీయుతులు వెంగళరెడ్డి, హనుమయ్య, పిన్నమనేని కోటేశ్వరరావు, మాజీమంత్రి చల్లా సుబ్బారాయుడు, గద్దె కృష్ణకుమారి, వసంత నాగేశ్వర రావు, పి. వెంకటరావు, లచ్చన్న, తెన్నేటి విశ్వనాథం, సి. వి. కె. రావు, ఎ. శ్రీరాములు, ఎం.వి. రామమూర్తి, శివాజీ, ఆంధ్ర కేంద్ర కార్యాచరణ సమితివారు హాజరైనారు. ఎన్.జి.ఓ.ల సహాయార్థం గుంటూరులో 50 వేల రూపాయలు పోగు పడగా, అది ఎవరు పోగు చేసినారనే దానిమీద వాదన జరిగింది. మంత్రులు ఢిల్లీ వెళ్ళి చేసిన సమాలోచనల ఫలితమేమని కొందరు ప్రశ్నించినారు. సమాలోచనలు ఆశాజనకం అని వార్త అందినట్లు శ్రీ చల్లా సుబ్బారాయుడు అన్నారు. శ్రీ బి.వి. సుబ్బారెడ్డి, ముగ్గురు మంత్రులు లేని కారంచేడు సమావేశ నిర్ణయాలకు ఎవరు కట్టుబడి ఉంటారనే ప్రశ్న తలెత్తింది. అప్పుడే సమావేశానికి వచ్చిన శ్రీ సాగి సూర్యనారాయణరాజు, శ్రీ బి.వి. సుబ్బారెడ్డి అనారోగ్యంవల్ల రాలేకపోయినారని, సమావేశ నిర్ణయాలకు కట్టుపడి ఉంటారనీ వార్త తెచ్చినారు.

శ్రీ నడింపల్లి నరసింహారావు అధ్యక్షతన సమావేశం తెల్లవారు జాము దాకా నడిచింది. శ్రీ ఎం.వి. రామమూర్తి పోరాటం దీర్ఘకాలం జరుగుతుందా లేక స్వల్పకాలం జరుగుతుందా అని ప్రశ్నించినారు. ఆ విషయం ముందు తేలితే తమ సహచరులను తయారుగా ఉంచటానికి వీలవుతుందన్నారు శ్రీ ఐ. బి. రామకృష్ణారావు, ఫిబ్రవరి 18 నుంచి పార్లమెంట్ సమావేశం జరుగుతుంది. కాబట్టి 1973 ఫిబ్రవరి 19 నుంచి 23 వరకు ఆంధ్రోద్యమం ఉధృతం చేయవలె నని శ్రీ ఎం. వి. రామమూర్తి సూచించినారు. ప్రజా జీవితాన్ని, ప్రభుత్వాన్ని స్తంభింపజేస్తే తప్ప విషయం తేలదని అన్నారాయన. కాని ఎక్కువ మంది ఆయన ప్రతిపాదనను బలపరచలేదు. వాహనాలు పన్నులు చెల్లించవలె నని నిర్ణయం తీసుకొన్నారు. ఆర్.టి.సి. బస్సులను కూడా తిరగనివ్వవలెనని

నిర్ణయించినారు. వేర్పాటు శాసన సభ్యులు పార్లమెంట్ ముందు ధర్నా జరపవలెనన్నారు. తీర్మానం మాత్రం చేయలేదు. 1973 ఫిబ్రవరి 19న బంద్ జరప నిశ్చయించినారు. 24 గంటల బంద్ జరపవలెనన్నారు. కేంద్ర కార్యాచరణ సమితివారు, కాంగ్రెసువారు ఉదయం 6 నుంచి 12 గంటలే జరపవలెనన్నారు. విద్యార్థి నాయకులు, మరికొందరు కాంగ్రెసు వారి వాదననే బలపరిచినారు. పొందూరు, బారువ, మాచర్ల కాల్పులకు నిరసన తెలిపినారు. సోడా గ్యాస్ సిలిండర్లు ప్రభుత్వం స్వాధీనపరచుకోటాన్ని ఖండించినారు. ప్రభుత్వ ఉద్యోగుల సహాయంకోసం, బ్యాంకులు సహకరించనందువల్ల, ప్రత్యేకంగా ఫైనాన్షియల్ కార్పొరేషన్ ఏర్పాటు చేసే నిమిత్తం ఒక ఉపసంఘాన్ని వేయవలెనన్నారు. బ్యాంకులు, జీవిత భీమా సంస్థలు సోమ, మంగళ, శుక్ర వారాలలో పనిచేయవచ్చునన్నారు. ఫిబవరి 19 న బంద్ ఆంధ్ర అంతా జరిగినా, వైద్య వాహనాలు, రిక్షాలు తిరగవచ్చును. పోలీసుస్టేషన్లపై జెండాలు ఎగరవేసి శాసనోల్లంఘనం చేయవలె. ప్రత్యేకాంధ్ర నిర్మాణ అవసరం, ఉద్యమ చరిత్రను ఆంధ్రులకు అందజేయడానికి ఒక చిన్న పుస్తకం తయారు చేసే నిమిత్తం శ్రీయుతులు ఎ. శ్రీరాములు, ఐ.బి. రామకృష్ణారావు, ఎం. వి. రామమూర్తి, కె రాజారావు ఒక ఉపసంఘంగా ఏర్పడినారు. సంయుక్త కార్యాచరణ సమితికి సమావేశ కర్తగా ఉంటామని శ్రీ తెన్నేటి విశ్వనాథం తమకు తామే నిశ్చయించుకున్నారు

ఆంధ్ర కేంద్ర కార్యాచరణ సమితి సారథ్య సంఘం గుంటూరులో 1973 ఫిబవరి 16 న అత్యవసరంగా సమావేశమయింది. శ్రీ నడింపల్లి నరసింహారావు ఇంటిలో సమావేశమైనారు. శ్రీ ఎ. శ్రీరాములు, శ్రీ ఐ.బి. రామకృష్ణారావు హాజరైనారు. మంత్రులు ఢిల్లీలో జరిపిన చర్చలతో తమకేమీ సంబంధం లేదని ప్రకటించవలెననుకొన్నారు. కాని దానికి ముందు ఆ మంత్రులను కలసి మాట్లాడ నిశ్చయించినారు. కారంచేడు సమావేశంలో ఆర్.టి.సి. బస్సులను తిరగ నివ్వవలెనని చేసిన తీర్మానంపట్ల విజయవాడ న్యాయవాదులు అసమ్మతి తెలిపినారు. డాక్టర్లు, మహిళలు కూడా న్యాయవాదులను అనుసరించినారు. వారంతా కారంచేడు తీర్మానాలు ఉద్యమానికి వెన్నుపోటు అని భావించినారు. ఫిబ్రవరి 18 నుంచి ఆర్.టి.సి. బస్సులను ఆప నిశ్చయించినారు. ప్రభుత్వం మహిళాపోలీసులను నియమించి స్త్రీ సత్యాగ్రహులను బాధించారు.

1973 ఫిబ్రవరి 19న జరగనున్న పార్లమెంట్ సమావేశానికి ముందు సోషలిస్టు నాయకుడు శ్రీ జార్జి ఫెర్నాండెజ్, స్వతంత్ర పార్టీ నాయకులు శ్రీ పీలూమోడీ విజయవాడ వచ్చి బహిరంగ సభలలో ఉపన్యాసాలిచ్చినారు ఆంధ్ర పార్లమెంట్ సభ్యులు పార్లమెంట్‌లో ప్రతిపక్షంగా వ్యవహరిస్తే ఉపయోగమని వారిరువురూ సలహాలిచ్చినారు. 1973, ఫిబ్రవరి 19న ఆంధ్ర అంతటా పోలీసు స్టేషన్లపై జెండాలు ఆవిష్కరించినందున వేలమంది అరెస్టు అయినారు.

శ్రీయుతులు గౌతులచ్చన్న, తెన్నేటి విశ్వనాథం బి.వి. సుబ్బారెడ్డితో చర్చలు జరిపినారు. 1973 ఫిబ్రవరి 22న కాంగ్రెసులో జరిగే సమావేశంలో అన్ని విషయాలు చర్చిద్దామన్నారు. శ్రీ తెన్నేటి విశ్వనాథం అసెంబ్లీని రద్దు చేసి మళ్ళా ఎన్నికలు జరిపితే ప్రత్యేకాంధ్ర గురించి ప్రజల అభిప్రాయం బాగా వెల్లడవుతుందన్నారు. కేంద్ర కార్యాచరణ సమితి సారథ్య సంఘం గుంటూరులో 20న సమావేశమై మూడు తీర్మానాలు చేసినారు. ఈ సమావేశానికి ఆంధ్ర మహాసభ నాయకులు రాలేదు. చేసిన తీర్మానాలు :-

ప్రత్యేక రాష్ట్రనిర్మాణాన్ని ఒప్పుకునేంతవరకూ ఉద్యమం కొనసాగవలె. ఆ అభిప్రాయంగల వారితోనే పొత్తు కుదురుతుంది. ముగ్గురు మంత్రులు ఢిల్లీలో చేసిన సంప్రదింపులు ఖండిస్తూ తీర్మానం ప్రకటించడం; ఆర్.టి.సి. బస్సులు తిరగనివ్వడం. కారంచేడులో తీసుకొన్న నిర్ణయం సంయుక్త తీర్మానం గనక, కాంగ్రెసువారు ఎంతవరకు సహకరిస్తారో తెలుసుకొని, తరవాత కార్యక్రమం నిర్ణయించడం; కాంగ్రెసువారితో పొత్తు కష్టమని భావించడం గూడా జరిగింది.

1973 ఫిబ్రవరి 19 న పార్లమెంట్ సంయుక్త సమావేశంలో రాష్ట్రపతి చేసిన ప్రసంగాన్ని 6 రాజకీయ పక్షాలు బహిష్కరించినాయి. ఆంధ్ర వేర్పాటువాద పార్లమెంట్ సభ్యులు తాము ప్రతి పక్షంలో కూర్చొనే విషయాన్ని వాయిదా వేసినామన్నారు. రాష్ట్రపతి ప్రసంగానికి సవరణ ప్రతిపాదన నోటీసు ఇచ్చికూడా తరవాత విరమించుకొన్నారు. ఆంధ్రలో ఉద్యమం సన్నగిల్లుతున్నట్లు కాంగ్రెసు వేర్పాటు వాదులు ఢిల్లీ నాయకులతో చెప్పినట్లు వార్తలు వచ్చినాయి. రాజమండ్రిలో, తెనాలిలో జరిపిన వేర్పాటు వాదుల ఊరేగింపుమీద కమ్యూనిస్టులూ, సమైక్యవాదులూ దాడి చేసినారు. ఫిబ్రవరి 21న విజయవాడలోని రైల్వే కార్మికులు తమ విధులకు హాజరు కావడానికి నిశ్చయించినారు 1973 ఫిబ్రవరి 21న శ్రీ చంద్రజిత్ యాదవ్ పార్లమెంట్‌లో ఆంధ్రోద్యమం వెనక విదేశీ హస్తం ఉన్నదన్నారు. అట్లాంటి రుజువేమీ లేదని ఆంతరంగిక శాఖామంత్రి పంత్ పార్లమెంట్‌లో ప్రకటించినారు.

1973 ఫిబ్రవరి 22న కాంగ్రెసు ఆంధ్ర కాంగ్రెసు కార్యాచరణసమితి కార్యవర్గం, మాజీ మంత్రులు సమావేశమైనారు. శ్రీ బి.వి. సుబ్బారెడ్డి మీద తీవ్ర విమర్శలు వచ్చినాయి. కాంగ్రెసువారు ప్రతిపక్షాలతో కూడిన ఆంధ్ర-కేంద్ర కార్యాచరణ సమితితో పొత్తు ఎందుకు పెట్టుకోవలె? అని కొందరు ప్రశ్నించినారు. ఫిబ్రవరి 27న విజయపురిలో సమావేశం కావలెనని ఆంధ్ర కాంగ్రెసు కార్యాచరణ సమితి నిర్ణయించింది. కేంద్ర కార్యాచరణ సమితివారు కాంగ్రెసు వారితో పొత్తు పెట్టుకోవటం, ఉద్యమ కార్యక్రమం సరిగా నిర్వర్తించటానికే తప్ప మరిదేనికి కాదనీ, శాసన సభ్యులు రాజీనామా చేయవలెనని అంటూ ఆంధ్ర న్యాయవాది కార్యాచరణ సమితి ప్రకటించింది.

1973 ఫిబ్రవరి 27 నాటికి తాము ఢిల్లీ వెళ్ళవలసివస్తే అనుసరించవలసిన షరతులూ, తీసుకోవలసిన నిర్ణయాలను బి.వి. సుబ్బారెడ్డి సూచించినారు :- ఉద్యమ ఖైదీలను విడుదల చేయవలె. కాల్పులపై న్యాయ విచారణ జరపవలె. కేంద్ర రిజర్వు పోలీసును, మిలిటరీని ఆంధ్ర నుంచి తరలించవలె. ప్రభుత్వ ఉద్యోగులపై డిస్మిసల్ ఆర్డర్ కేసుల ఉత్తరువులు ఎత్తివేయవలె. పై వాటిలో అన్నిటికంటె కీలకమైన విషయం 'ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం సూత్రప్రాయంగా అంగీకరించవలె' అనే షరతు లేకపోవడం చాలామందికి మిక్కిలి ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆంధ్ర రాష్ట్ర నిర్మాణ సమస్య లేకపోతే ఉద్యమమే లేదు. ఉద్యమం లేకపోతే పైన చెప్పిన షరతులన్నీ అర్థరహితమైనవేనని భావించినారు.

ఉద్యమంలో మార్పు వస్తున్నదని చాలామంది కార్యకర్తలు భావించినారు. 1973 ఫిబ్రవరి 26న గుంటూరులో శ్రీ నడింపల్లి నరసింహారావు ఇంట ఆంధ్ర కేంద్ర కార్యాచరణ సమితి ఇష్టాగోష్ఠి సమావేశం జరిగింది. కార్యకర్తలు తమ అభిప్రాయాలు చెప్పినారు. ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం సూత్రప్రాయంగా అంగీకరిస్తేనే కేంద్రంతో సంప్రదింపులు జరపవలెనని, అట్లాంటి అభిప్రాయం కలవారితోనే కలిసి పనిచేస్తామని తీర్మానించినారు.

1973 ఫిబ్రవరి 27 శ్రీమతి ఇందిరాగాంధీ పార్లమెంట్‌లో ఒక ప్రకటన చేసినారు. ప్రశాంత వాతావరణం నెలకొంటేనేగాని చర్చలు జరిపి, సమస్యా పరిష్కారం చేయలేమన్నారు. కేంద్రం ఆంధ్ర సమస్యను అన్ని కోణాలలో పరిశీలిస్తున్నదన్నారు. శ్రీ బి. వి. సుబ్బారెడ్డికి ఢిల్లీ సంప్రదింపులకు రావలసిందిగా ఆహ్వానం అందింది. ఫిబ్రవరి 27న జరిగిన విజయపురి సమావేశంలో శ్రీ బి.వి. సుబ్బారెడ్డి ఢిల్లీ వెళ్ళవలెనని తీర్మానం చేసినారు. ప్రధాని చేసిన ప్రకటన ఏమాత్రం అభివృద్ధి చూపేదిగా లేదని అభిప్రాయ పడినారు. శ్రీ తెన్నేటి విశ్వనాథం సంయుక్త కార్యాచరణ సమితి సమావేశ కర్తగా రాజీనామా చేసినట్లు శ్రీ బి.వి. సుబ్బారెడ్డికి తంతిద్వారా తెలిపినారు. నాటి తీర్మానాలు :

శాసన సభ్యులు రాజీనామాలుచేసి, శాసనసభ రద్దుకు తోడ్పడవలె. పికెటింగ్ వేర్వేరు కార్యాలయాలవద్ద వేర్వేరు రోజులలో చేయవలె. టెలిఫోన్, పరిపాలనా సంస్థల కార్యాలయాలవద్ద ప్రతిరోజూ పికెటింగ్ చేయవలె. ఆదాయపు పన్నుల కార్యాలయాలవద్ద, రాష్ట్ర ప్రభుత్వ కార్యాలయాలవద్ద ప్రతిరోజూ పికెటింగ్, బ్యాంకులు, జీవితభీమా కంపెనీలు, పోస్టాఫీసులవద్ద పికెటింగ్ బుధ, గురు, శనివారాలు మాత్రమే. మార్చి 2 నిరసన దినంగా పాటించడం, మార్చి 3న నిరాహారదీక్షలు, రాష్ట్ర సాధనకు ప్రతిజ్ఞ బూనడం, ఎకరానికి రూపాయి చొప్పున గ్రామోద్యోగులు వసూలుచేసి, ప్రభుత్వ ఉద్యోగులకు సాయపడటం, బస్సులు తిరిగే విషయంలో సలహాలిచ్చే నిమిత్తం ఒక ఉప సంఘం నిర్మాణం; వేర్పాటు ఎం.పి.ల పై ఖరిపట్ల నిరసన తెలిపినారు.సభ్యులు

తీసుకున్న ప్రతిజ్ఞలో "లంచగొండితనం, బంధుప్రీతి రూపుమాపి, ప్రబలుతున్న అసమానతలు తొలగించి, వెనకబడిన వర్గాలకూ, బలహీనవర్గాలకూ సాంఘిక న్యాయం చేకూర్చి, ఉన్నతికి దారితీసే నీతి నియమాలుగల ప్రజా ప్రభుత్వం నిర్మించడానికి అన్నివిధాలా పని చేస్తాం" అన్నారు. అక్కడే శ్రీ గౌతులచ్చన్న శాసనమండలిలో తమ సభ్యత్వానికి రాజీనామా పత్రం వ్రాసినారు. ఆంధ్ర మహాసభ రాజీనామాలు శాసన సభ్యులనుంచి కోరడం, అసెంబ్లీ రద్దుచేసినందు వల్ల ఉద్యమానికి నష్టమని తీర్మానించింది.

1973 ఫిబ్రవరి 28న ప్రధాని పార్లమెంట్‌లో ప్రసంగించినారు. జన సంఘంవారు రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ సంఘం ఏర్పరచవలెనన్నారు. ప్రధాని ఆ సూచనను త్రోసిపుచ్చినారు. 'ఆంధ్ర సమస్యకు సంబంధించిన విషయాల నేమీ అంగీకరించనూ లేదు, తిరస్కరించనూ లేదు' అన్నారామె. శ్రీ బి.వి. సుబ్బారెడ్డి ఢిల్లీ వెళుతూ శ్రీ లచ్చన్నను హైదరాబాద్ విమానాశ్రయంలో ఏమైనా సూచనలివ్వదలిస్తే కలవమని కబురు పంపినారు. శ్రీ సుబ్బారెడ్డి, ప్రత్యేకాంధ్ర ఏర్పడేవరకూ హైదరాబాద్‌లో కాలు పెట్టనని లోగడ ప్రతిజ్ఞ పూనినారు.

1973 మార్చి 2న పనులలో చేరమని గవర్నరు ఉద్యోగులకు విజ్ఞప్తి చేసినారు. ఆదేరోజు నిరసనదినం జరిపినారు. పత్రికా విలేఖరుల సమావేశంలో శ్రీ లచ్చన్న శ్రీ సుబ్బారెడ్డిని బాగా విమర్శించినారు. నరసరావుపేట తీర్మానాలను ఆయన ఉల్లఘించినారన్నారు. ప్రభుత్వోద్యోగులసంయుక్తకార్యాచరణ సంఘం సమ్మెను కొనసాగించటానికే తీర్మానించింది. శాసన సభ్యులకు తిరుపతిలో 6వ తేదీ జరగనున్న సమావేశానికి రాజీనామా పత్రాలతోసహా రావలసిందని ఆహ్వానాలు పంపించినారు. 1973 మార్చి 3వ తేదీన జరిగిన నిరాహారదీక్షలలో విద్యార్థులు పాల్గొన్నారు. కాంగ్రెసువారు పాల్గొనలేదు. శ్రీ బి.వి. సుబ్బారెడ్డి 1973 మార్చి 4వ రాష్ట్రపతి వి.వి. గిరిని కలిసినారు. 1973 మార్చి 6వ తేదీ తిరుపతిలో కేంద్ర కార్యాచరణ సమితి సమావేశ మయింది. శ్రీయుతులు. గౌతు లచ్చన్న, జూపూడి యజ్ఞనారాయణ రాజీ నామాలను శాసనమండలికి పంపవలెనని నిర్ణయం తీసుకొన్నారు. సమావేశా నికి స్వతంత్రపార్టీ శాసన సభ్యుడు శ్రీ బి. రత్నసభాపతి, జనసంఘానికి చెందిన ఎం.ఎల్.ఏ. శ్రీ వై.సి. రంగారెడ్డి వచ్చినారు. ఆంధ్ర మహాసభ అధ్యక్షుడు శ్రీ నిశ్శంకర వెంకటరత్నం తమ రాజీనామా లేఖను సమితికి పంపించినారు. శ్రీ రత్నసభాపతి తమ పార్టీవారితో సంప్రదించి రాజీనామా చేస్తామన్నారు. (ఏప్రిల్‌లో జరిగిన జై ఆంధ్ర మహాసభ (రాజమండ్రి)లో ఆయన రాజీనామా చేసినారు.) శ్రీ నిశ్శంకర వెంకటరత్నం చేసిన రాజీనామాను అంగీకరించి నారు. ఆర్.టి.సి. బస్సుల రాకపోకల విషయంలో ఉపసంఘ నివేదికను పరిశీలించి, బస్సులు సోమవారం తిరగకుండా పికెటింగ్ జరపవలెనన్నారు, బంద్,

48 గంటలపాటు నిరాహార దీక్షలు జరప నిశ్చయించినారు. వీటికి తేదీలు శ్రీ గౌతులచ్చన్నను నిర్ణయించమన్నారు. శాసన సభ్యులను రాజీనామాలు చేయమన్నారు. శ్రీ బి.వి. సుబ్బారెడ్డి కాంగ్రెసేతర పార్టీలు వేర్పాటు ఉద్యమాన్ని వాడుకుంటున్నాయిగనక వాటితో సంబంధం తెచ్చుకుంటున్నాము అన్నందున వారిని విమర్శించినారు. కాంగ్రెసువారే ఉద్యమాన్ని తమ ప్రయోజనాలకు వాడుకొంటున్నారన్నారు. శ్రీ బి.వి. సుబ్బారెడ్డి ప్రకటనల వల్ల ప్రజలిక మోసపోరన్నారు. తిరుపతి సమావేశంతో కాంగ్రెసువారికి, కేంద్ర కార్యాచరణ సమితికి అంతంత మాత్రంగా ఉన్న సంబంధం కాస్తా తెగిపోయింది.

శ్రీ బి.వి. సుబ్బారెడ్డి ఢిల్లీ వెళ్ళి 10 రోజులు ఉన్నారు. ప్రధానితో, కాంగ్రెసు అధ్యక్షుడు, కార్యదర్శులతో, హోంశాఖ మంత్రితో చర్చలతో గడిపినారు. చర్చలు సఫలమౌతాయని ఆయన అనుకోనందున ఆశాభంగం కలగలేదన్నారు. మిత్రుల ఒత్తిడివల్ల ఢిల్లీ వెళ్ళినట్లు చెప్పారు. తరవాత విశ్రాంతి కావాలంటూ తమ గ్రామం కోయిలకుంట్ల వెళ్ళినారు. 1973 మార్చి 18న ఆంధ్ర కాంగ్రెసు కార్యాచరణ సమితి చిత్తూరులో సమావేశం కావటానికి నిర్ణయమైంది.

ఉద్యమంలో వస్తున్న మార్పు కార్యకర్తలు బాగా అర్థం చేసుకొన్నారు. శ్రీ బి.వి. సుబ్బారెడ్డి ఢిల్లీలో సాధించిందేమీ లేదని తేలిపోయింది. ఆర్.టి.సి. బస్సుల పికెటింగ్ సఫలం కాలేదు. రైళ్ళు నడవసాగినాయి. ప్రభుత్వోద్యోగుల సహాయార్థం లక్షలు పోగయినా, 3 లక్షలమంది ఉద్యోగులకు అది సరిపోలేదు. ఉద్యోగులు తిరిగి పనిలోకివస్తే వారిమీద ఎట్లాంటి కక్ష సాధింపూ జరగదని గవర్నరు ప్రకటించినారు. ప్రశాంత వాతావరణం నెలకొంటే ప్రధాని ప్రత్యేకాంధ్ర నిర్మాణం కావిస్తారని కాంగ్రెసువాదులు ఆశపడ్డారు. రాష్ట్రంలో సమైక్యతావాదులు సభలు జరపవలెనని 1973 ఫిబ్రవరి 26న శ్రీ పి.వి. నరసింహారావు పిలుపు ఇచ్చినారు. ఇందువల్ల రాష్ట్రంలో అంతర్యుద్ధం జరిగే ప్రమాదం ఉందని కొందరు భావించినారు. ఉద్యమ ధోరణి సన్నగిల్ల సాగింది. వృత్తి సంఘాలలో సంచలనం బయలుదేరింది.

1973 మార్చి 31న నర్సులు పనిలో తిరిగి చేరటానికి నిర్ణయించినారు. అసిస్టెంటు సర్జన్‌లు, జూనియర్ ఇంజనీర్లు, 1973 మార్చి 14వ తేదీ సమ్మె విరమణకు నిశ్చయించినారు. 1973 మార్చి 15వ తేదీ ప్రభుత్వ ఉద్యోగుల ప్రతినిధులుగా శ్రీ ఐ.బి. రామకృష్ణారావు, ఇంకా ఆరుగురు సంయుక్త కార్యాచరణ సంఘ సభ్యులు ఢిల్లీ వెళ్ళి పంత్‌ను కలిసినారు. న్యాయవాది ప్రతినిధుల మహాసభ జరపడానికి నిర్ణయం జరిగింది. ఆంధ్ర కేంద్ర కార్యాచరణ సమితి 1973 మార్చి 6వ తేదీన గుంటూరులో సమావేశం జరిపి కొన్ని తీర్మానాలు ఆమోదించింది.

ప్రభుత్వ ఉద్యోగులకు మద్దతు ఇస్తామన్నారు. వారు సమ్మె విరమిస్తే రాగల పరిణామాలనుగురించి చర్చించవలెనని శ్రీ ఎం.వి. రామమూర్తికోరగా ఆ ప్రసక్తి తేవద్దన్నారు తెన్నేటి విశ్వనాథం సమైక్యవాదుల చర్యలను ఖండించినారు. సమైక్యవాదులు తెనాలిలో కాకాని వెంకటరత్నం గారి విగ్రహాన్ని ధ్వంసం చేసినారు. తెనాలి, బాపట్ల, అవనిగడ్డ, ఉరవకొండలతో ఇళ్ళలో ప్రవేశించి వ్యక్తులను చంపటం, బాధించడం, వస్తువులు విరగ్గొట్టడం చేసినారనీ, గుంటూరులో సి.ఆర్.పి. వారి సాయంతో శ్రీ కె. సత్యనారాయణ రాజును హత్య చేసినారని తీవ్రంగా నిరసించినారు ప్రభుత్వం ఉద్యమాన్ని అణగద్రొక్కడానికి కాంగ్రెసువారిని ఉపయోగిస్తున్నట్లు భావిస్తున్నారు. 1973 మార్చి 4న విజయవాడ న్యాయవాదుల సంఘం, వైద్యుల సంఘం సమావేశంలో జై ఆంధ్రపార్టీ పెట్టడానికి తీర్మానం చేసినారు. ఆంధ్ర కేంద్ర కార్యాచరణ సమితి పేరు జై ఆంధ్ర కార్యాచరణ సమితిగా మార్చినారు. జై ఆంధ్ర నినాదాన్ని ప్రజలు మెచ్చినారు. శ్రీ ప్రగడ కోటయ్య ప్రతిపాదనానుసారం, అవనిగడ్డ, బాపట్ల, విజయవాడ I & II, గుంటూరు-1,కూచిపూడి నియోజక వర్గాలలో రంగుపెట్టెల పద్ధతిపై ఎన్నికలు జరిపించవలెనని తీర్మానం చేసినారు. ఆంధ్రోద్యమ కార్యకర్తలు ఐక్యం కావలెనని పిలుపు ఇవ్వడం, పత్రికలవారికి విజ్ఞప్తి చేయడం, జై ఆంధ్ర ఫ్రంట్ ఏర్పాటుకు సబ్ కమిటీ నియమించడం, మొదలైన తీర్మానాలు చేసినారు. శ్రీ తెన్నేటి విశ్వనాథం ఉద్యమం దీర్ఘకాలిక పోరాటమని అర్థం వచ్చేటట్లు పత్రికా ప్రకటన చేసినారు. 1973 మార్చి 16న ఉపాధ్యాయులు పాఠశాలలకు హాజరు కావలెనని తీర్మానించగా 19న కళాశాలల అధ్యాపకులు సమ్మె విరమించినారు.

1973 మార్చి 18న తిరుపతిలో జరగవలసిన ఆంధ్ర కాంగ్రెసు కార్యాచరణ సమితి సమావేశం చిత్తూరులో జరపనిశ్చయించినారు. యువకులనుంచి దూరంగా పోవలెనని అక్కడ ఏర్పాటు చేసినట్లు తెలియ వచ్చింది కాని యువకులు చిత్తూరుకూడా వెళ్ళినారు. సమావేశానికి శ్రీ బి.వి. సుబ్బారెడ్డి అధ్యక్షత వహించినారు. శ్రీ సి. వి. కె. రావు ఆంధ్రకేసరి కార్యాచరణ సమితితో విభేదాలు వచ్చినాయని కాంగ్రెసువారి సభకు హాజరవుతూ ఉన్నారు. వారితోబాటు సినీనటుడు కొంగర జగ్గయ్యకూడా ఆ సమావేశాలకు వెళ్ళనారంభించినారు. 132 మంది శాసనసభ్యులు, 7 గురు పార్లమెంట్ సభ్యులు హాజరయినారు. విద్యార్థినాయకులు కూడా ఉన్నారు. వేరేపార్టీ పెట్టవలెనని తీర్మానించినారు. కొత్తపార్టీ నిబంధనావళి రూపొందించడానికి, డి. మునిస్వామి ఆధ్వర్యంలో ఒక సంఘం నియమించినారు. ఉపసంఘం ఆంధ్ర అంతా పర్యటించి ప్రజాభిప్రాయం సేకరించి నివేదిక సమర్పిస్తుందని సుబ్బారెడ్డి ప్రకటించినారు. సమావేశానికి వచ్చిన చాలామంది ప్రతినిధులు ఈ తీర్మానాలకు తమ అంగీకారం తెలపకుండానే వెళ్ళిపోయినారు. బహిరంగంగా ఎవరూ తీర్మానా

లమ వ్యతిరేకించలేదు. కాంగ్రెస్ వ్యతిరేకులు మాత్రం ప్రజలను మభ్యపెట్టడానికి ఇదొక ఎత్తు అని విమర్శించినారు.

ప్రభుత్వ ఉద్యోగుల తరపున ఢిల్లీలో సమాలోచనలుజరుగుతూఉన్నాయి. శ్రీ ఐ బి. రామకృష్ణారావుమీద ఉన్న డిస్‌మిసల్ ఆర్డరు ఎత్తివేయరుగాని, ఆయనకు ప్రభుత్వరంగంలో వేరే ఉద్యోగం ఇవ్వగలరని వదంతులు వ్యాపించినాయి. తెలంగాణా ప్రాంతీయ సంఘాధ్యక్షుడు శ్రీ రాజమల్లు ముల్కీ పోవలెనంటూ మార్చి 17న మాట్లాడినారు. మాజీమంత్రి ఎ. వాసుదేవరావు ప్రాంతీయకమిటీ రద్దుగావటమే ఉత్తమం అన్నారు. ఇట్లాటి ప్రకటనలు కేంద్రం చేస్తున్నదని భావించడం జరిగింది. 1973 మార్చి 19 న కడప ఎన్.జి.ఒ.ల భవనంలో జరిగిన సభలో శ్రీ బి. వి. సుబ్బారెడ్డి ప్రసంగిస్తుండగా రిజర్వుపోలీసులు కాల్పులు జరిపినారు. 8 మంది చనిపోయినారని అధికారవార్త. 50 మంది దాకా గాయపడినట్లు వార్తలు వచ్చినాయి. శ్రీ బి. వి. సుబ్బారెడ్డిని జనం కాపాడగలిగినారు. గవర్నరు సలహాదారు ఈ కాల్పులపై విచారణ జరపమని హైకోర్టు న్యాయమూర్తి శ్రీ మాధవరెడ్డిని ఏకసభ్య న్యాయస్థానంగా నియమించినారు. గాయపడిన వారికి 500 రూ. చనిపోయినవారి కుటుంబానికి 1000 రూ. నష్టపరిహారంగా ప్రభుత్వం ప్రకటించింది. 1973 మార్చి 22 న సమావేశమయి సమ్మె విరమణ గావించవలెనని ప్రభుత్వ ఉద్యోగుల సంయుక్త కార్యాచరణ సమితి తలపెట్టింది. ఈలోగా జరిగిన కడప కాల్పుల మూలంగా సమ్మె కొనసాగించవలెననే ధోరణిలో ఉన్నవారికి అవకాశం లభించింది. ఒక ఉపసంఘాన్ని వేసి 24 తేదీనాటికి నివేదిక సమర్పించవలసిందని చెప్పినారు. ప్రభుత్వం తీసుకోబోతున్న చర్యలు సంతృప్తికరంగా ఉన్నాయని 108 రోజుల అనంతరం ప్రభుత్వ ఉద్యోగుల కార్యాచరణ సమితి సమ్మెవిరమించినట్లు ప్రకటించింది. మరి హింసాకాండకు పూనుకొన్నట్లు ఆరోపణలున్న వారిమీద తప్ప మిగతావారందరిమీదా ప్రభుత్వం కేసులు రద్దు చేస్తున్నట్లు ప్రకటించింది. 2 నెలల జీతం అడ్వాన్సుగా ఇస్తామన్నారు.

1973 మార్చి 20న ఆంధ్రకేంద్ర కార్యాచరణ సమితి సారథ్యసంఘం సమావేశం విజయవాడలో నర్రాగోపాలకృష్ణయ్య ఇంటిలో జరిగింది. అందులో ఈ దిగువ తీర్మానాలు చేసినారు.

అవనిగడ్డ, ఉరవకొండ, కడపలలో జరిగిన పోలీసు కాల్పులను, అనేక చోట్ల పోలీసులు జరిపిన లాఠీచార్జిని ఖండించినారు. కాంగ్రెసువారు పార్టీకి రాజీనామాలను తప్పక ఇస్తారని నమ్మినారు. ఉద్యమం ఇకముందు ఏ రీతిలో ఉండవలెనో అనే విషయం నిర్ణయించటానికి ఉపసంఘాన్ని వేసినారు. ఉద్యమానికి బలాన్ని ఇచ్చిన డాక్టర్లను అభినందించినారు. జై ఆంధ్రఫ్రంట్ మహాసభ రాజమండ్రిలో జరపనిశ్చయించినారు.

సమావేశంలో శ్రీ ఎం. వి. రామమూర్తి ఉద్యమం గట్టిగా జరపగలమనుకుంటే చివరిసారిగా పిలుపు ఇద్దాము, లేకుంటే పోరాటస్వరూపాన్ని మార్చ

మని ఆంధ్రజైంధ్రకార్యాచరణ సమితిద్వారానే కోరదామని సలహా ఇవ్వగా చాలామందికి అది రుచించలేదు. అంతట రామమూర్తి తమ రాజీనామాలేఖను సమర్పించినారు.

1973 మార్చి 28న న్యాయవాది సంఘాలప్రతినిధులు సమావేశమయినారు. ఎన్నో తర్జనభర్జనల తరవాత ఏప్రిల్ 6 నుంచి కోర్టుల బహిష్కరణ విరమించ నిశ్చయించినారు. (136 రోజులపాటు కోర్టులనుబహిష్కరించినారు.)

ప్రభుత్వోద్యోగులను సంతృప్తిపరచే నిమిత్తం మార్చి 30 న ప్రభుత్వం కరువుభత్యాన్ని 7 నుంచి 10 రూ. వరకూ పెంచింది. ఆ ఉత్తరువు ఆగస్టు, 1972 నుంచి వర్తింపజేస్తున్నామన్నారు. రెండవ అఖిలాంధ్ర మహాసభ విజయవాడలో 1973 ఏప్రిల్ 1న జరిగింది. విద్యార్థులను సమ్మెవిరమించమని పలువులు ఉపన్యాసాల్లు చేసినారు. ఏప్రిల్ 5న విద్యార్థులు గుంటూరులో సమావేశమయినారు. శ్రీ బి. జె. ఆగస్టీన్ అధ్యక్షతన ఏప్రిల్ 9 నుంచి కళాశాలలకు హాజరుకావలెనని నిర్ణయించినారు. విద్యార్థుల సమ్మె 167 రోజులపాటు సాగింది. నెమ్మదినెమ్మదిగా ఉద్యమం వెనకబట్టసాగింది.

రాజమండ్రిలో 1973 ఏప్రిల్ 6 న జై ఆంధ్రకేంద్ర కార్యాచరణ సమితి సమావేశమైంది. జై ఆంధ్రఫ్రంట్ నిర్మాణానికి ఆమోదముద్రపడింది. 7, 8 తేదీలలో శ్రీ తెన్నేటి విశ్వనాథం అధ్యక్షతన మహాసభ జరిగింది. శ్రీ బి. రత్నసభాపతి పతాకాన్ని ఆవిష్కరించినారు. శ్రీ నడింపల్లి లక్ష్మినరసింహారావు ప్రారంభోపన్యాసం చేసినారు. స్త్రీలూ, పురుషులూ ఆరువందలదాక ప్రతినిధులు వచ్చినారు. జై ఆంధ్ర యువజన ఫ్రంట్‌కు శ్రీ జి. సి. కొండయ్య సాంఘిక, ఆర్థిక కార్యక్రమం రూపొందించినారు. జై ఆంధ్ర మహిళా విభాగం కూడా సమావేశమైంది. రాజమండ్రి సమావేశానికి తెలంగాణా ప్రజా సమితి నాయకులు శ్రీయుతులు పురుషోత్తమరావు, బి. సత్యనారాయణ రెడ్డి మొదలైనవారు హాజరైనారు. ఈ సభలో శ్రీ రత్నసభాపతి శాసన సభకు రాజీనామా చేస్తున్నట్లు ప్రకటించినారు. తరవాత హైదరాబాద్‌లో తమ రాజీనామా సమర్పించినారు. ప్రత్యేకాంధ్ర ఉద్యమం ప్రజాస్వామ్య రక్షణలో ఒక భాగమని సమావేశం తీర్మానం చేసింది. స్వతంత్ర, సోషలిస్టు, జనసంఘం, పాత కాంగ్రెసు పార్టీ, రిపబ్లికన్ పార్టీవారు జై ఆంధ్ర ఫ్రంట్‌లో ప్రధాన కార్యకర్తలుగా ఉన్నారు. అధ్యక్ష పీఠంలో శ్రీయుతులు లచ్చన్న తెన్నేటి విశ్వనాథం, జూపూడి యజ్ఞనారాయణ ఉండగా, కార్యదర్శులుగా శ్రీయుతులు బి. రత్నసభాపతి, తుమ్మల చౌదరి, ఎ. బి. నాగేశ్వరరావు, అరుణ్ కుమార్, కె. కృష్ణమోహన్‌రావు, వై.సి. రంగారెడ్డి, ఎన్. వీరాచారి ఉన్నారు. ఉపాధ్యక్ష పదవికి శ్రీయుతులు జి.సి. కొండయ్య, వసల సూర్యచంద్రరావు, కాతా జనార్దనరావు, జాఫర్ షరీఫ్, ఎస్. ఆర్. వి.జి. నరసింహారావు ఎన్నుకోబడినారు. సమావేశ తీర్మానాలు : 1973 ఏప్రిల్ 8న సార్వత్ర

సంఘ సమావేశం జరపవలె; 1973 మే 4వ తేదీ బంద్ జరపడం, తెలంగాణాకు చెందిన ప్రత్యేక వాదులతో సామరస్యం కుదుర్చుకోడానికి నిశ్చయించినారు. 1973 ఏప్రిల్ 27న సోషలిస్టుల ఏర్పాటుతో ఏలూరులో రాష్ట్ర మహాసభ జరిగింది. ఎం.వి. రామమూర్తి అధ్యక్షత వహించినారు విద్యార్థులు పూనుకొని 1973 మే 4న బంద్‌ను విజయవంతం చేసినారు. ఆనాటి బంద్ జరిగిన తీరులో ఆంధ్రోద్యమం ఇంకా చావలేదని ప్రజలు భావించినారు. జై ఆంధ్ర ఫ్రంట్ తెలంగాణా ప్రజాసమితితో చేతులు కలిపి జై ఆంధ్ర-తెలంగాణా ఫ్రంట్ ఏర్పరచినారు. 1973 జూన్ 17 నిరసన దినంగా పరిగణించినారు. 1973 జులై 31న జై ఆంధ్ర ఫ్రంట్ సర్వసభ్య సమావేశం జరిగింది. 1973 ఆగస్టు 15న అధిక ధరలకు వ్యతిరేకంగా నిరాహారదీక్షలు, సభలు జరపమని పిలుపు ఇవ్వగా కొన్నిచోట్ల జరిపినారు.

వేర్పాటు కాంగ్రెసువాదుల ఉపసంఘం ఆంధ్ర అంతా పర్యటించి, కొత్త పార్టీ నిర్మాణానికి ప్రజల అనుకూలత ఎంత ఉన్నదో తెలిసికొని, 1973 ఏప్రిల్ 16 నాటికి నివేదిక సమర్పించవలెనని లోగడ నిర్ణయమైనా దానిని వాయిదా వేసినారు. ఏప్రిల్ 28న ఆంధ్ర కాంగ్రెసు కార్యాచరణ సమితి సమావేశమైంది. వారు తెలంగాణా కాంగ్రెసు ఫోరంతో సంబంధాలు ఏర్పరచుకొన్నారు. తెలంగాణా ఫోరానికి చెన్నా రెడ్డి నాయకులు. చిత్తూరు సమావేశంలో వేరేపార్టీ పెట్టవలెనని నిర్ణయించినా, హైదరాబాద్ సమావేశంలో దానిని వాయిదా వేసినారు. ముల్కీ ఎత్తివేయవలెనని రాజమల్లు చేసిన ప్రతిపాదనను ప్రత్యేక తెలంగాణా వాదులంతా వ్యతిరేకించినారు. శ్రీ పి.వి. నరసింహారావు కూడా రక్షణలు పూర్తిగా ఎత్తివేయటానికి ఇష్టపడలేదు. శ్రీ బ్రహ్మానందరెడ్డి ఢిల్లీ చుట్టూ తిరుగుతూ వచ్చినారు ఆంధ్ర నాయకులతో సంభాషణలు సాగిస్తూనే ఉన్నారు. పలుచోట్ల ప్రాంతీయ మహాసభలు జరుగుతూ ఉన్నాయి. శ్రీ బ్రహ్మానందరెడ్డి వేర్పాటు కాంగ్రెసు వాదులతో జంటనగరాలను స్వేచ్ఛామండలంగా ప్రకటిస్తే ఒప్పుకొంటారా అని అడుగగా ఆ ప్రతిపాదనను వారు ప్రజల ముందు పెడతామన్నారు.

1973 ఆగస్టు 18న గుంటూరులో ప్రాంతీయ మహాసభ జరిగింది. ఢిల్లీలోని వేర్పాటు కాంగ్రెసు ఎం.పి. లను అంటరానివారుగా చూస్తున్నారని మద్ది సుదర్శనం విచారం వ్యక్త పరిచినారు. 1973 అక్టోబరు 2 నాటికి ఆంధ్ర రాష్ట్రం ప్రకటించకపోతే సత్యాగ్రహం చేస్తామని శ్రీ బి.వి. సుబ్బారెడ్డి చేసిన ప్రకటనను ప్రజలు అంతగా పట్టించుకోలేదు. ఆంధ్రోద్యమం సాకుగా ఢిల్లీలో మంత్రి పదవి సంపాదించిన కొత్త రఘురామయ్య 1973 జూన్ 8న విజయవాడ రాగా ఉద్యమకారులు నల్ల బేడ్జీలు పెట్టుకొని నిరసన తెలిపినారు. పోలీసులు వాళ్ళను అరెస్టుచేసి తరవాత విడుదల చేసినారు.

కారణాలేమైనా, ఆంధ్ర ఉద్యమం చివరలో చురుకుగా సాగలేదు. పలువురు పలుకారణాలు ఊహించినారు. ప్రజలు అధిక ధరల బాధలలో

మునిగి ఉన్నారని అన్నారు. విద్యార్థులు అంతవరకూ వదిలివేసిన చదువులపై శ్రద్ధ చూపి ఉద్యమంలో చురుకుగా పాల్గొనటం లేదన్నారు. ఉద్యమంలో ఏదో రకంగా పాల్గొన్న లక్షలాది ప్రజలు, డిటెన్యూలు, విద్యార్థులూ ఉద్యమాన్ని మరచిపోలేక పోయినారు. దాని ఫలితం కనిపించవచ్చుననే ఆశతో ఉన్నారు కాని అది జరగలేదు. క్రమేణా ఉద్యమం అడుగంటింది. రాష్ట్రపతిపాలన ఏర్పడటం, తరవాత శ్రీ జలగం వెంగళరావుగారి మంత్రి మండలి రావడంతో ప్రత్యేక ఆంధ్ర ప్రసక్తి పోయింది.

10

# రాష్ట్ర ఆర్థిక - సాంఘిక పరిస్థితి

రాష్ట్రం ఏర్పడినప్పటినుంచీ కాంగ్రెస్‌పార్టీ పరిపాలన చేస్తూండడం వల్ల రాజకీయంగా సుస్థిరత ఉంది. దీనికి తోడు ఆర్థిక, సాంఘిక రంగాలలో జరగవలసిన అభివృద్ధి తగినంతగా లేనందువల్ల రాష్ట్రం ఇంకా అనేకవిధాల వెనకబడి ఉంది. ఆర్థిక వనరులు బాగా ఉన్నప్పటికీ, ఆదాయం కొందరికే దక్కడంవల్ల, ఆర్థిక వ్యత్యాసాలు ఎక్కువగా ఉన్నాయి. కొద్దిమంది ధనికులు వ్యాపార, వాణిజ్య రంగాలలో పెంపొందుతుండగా, అధిక సంఖ్యాకులు నిత్యావసరాలు సంపాదించుకొనే స్థితిలోనే ఉన్నారు. రవాణా రంగం కూడా రాష్ట్రం యావత్తులోనూ ఇంకా జాతీయం చేయజాలకపోయినారు. కొన్ని జిల్లాలలో మాత్రమే బస్సులను జాతీయం చేసినారు. సినిమా పరిశ్రమ పూర్తిగా ప్రైవేట్ వ్యక్తుల హస్తగతమై ఉంది. రాష్ట్రంలో కొన్ని కేంద్ర ప్రభుత్వ ఉత్పత్తి సంస్థలు పనిచేస్తున్నాయి. రాష్ట్ర ప్రభుత్వం కొన్ని రంగాలలో పరిశ్రమలను చేపట్టింది. మరికొన్ని రంగాలలో ప్రైవేటు వ్యాపారస్థులతో కలిసి వ్యాపార, ఉత్పత్తి రంగాలలో కృషి చేస్తూంది. కేవలం ప్రైవేట్ రంగంలోనే ఎక్కువ వ్యాపార సంస్థలు ఉన్నాయి.

1969 లోనూ 1972లోనూ రాష్ట్రంలో వచ్చిన రెండు ఆందోళనలవల్ల ఆర్థిక రంగంలో కొంత ప్రతిష్ఠంభన ఏర్పడింది. కరువు కాటకాలు, తరచు వచ్చే తుఫానులవల్ల కోస్తా ప్రాంతాలలో పంటలు దెబ్బ తినడం, వ్యవసాయ రంగంలో రైతులు బాధలకు గురికావడం జరుగుతూంది. రాష్ట్రానికి ఏ విధమైన పంటలు ఏ మేరకు కావలెనో అనే విషయమై నిర్దుష్టమైన పథకం లేదు. రాష్ట్రంలో కొన్ని ప్రాంతాలను దుర్భిక్ష ప్రాంతాలుగా ప్రభుత్వం ప్రకటించి సహాయం చేస్తూంది.

రాష్ట్రంలో జనాభాను అదుపులో పెట్టవలసి ఉంది. 1971 జనాభా లెక్కలతో పోల్చి చూస్తే, 1981 నాటికి దాదాపు కోటిమంది జనాభా పెరిగింది. 1971లో 43, 502, 706 మంది ఉంటే, 1981 లో 53, 592, 605 మంది ఉన్నారు. కుటుంబ నియంత్రణ పథకాలను ప్రభుత్వం, ప్రజలు ఇంకా బాగా అమలు చేయవలసి ఉంది.

చిరకాలంగా సంఘంలోఉన్న కుల వ్యవస్థ రాష్ట్రంలో అట్లాగే పాతుకొని పోయింది. కులాంతర వివాహాలకు ప్రభుత్వ ప్రోత్సాహం కొద్దిగా

ఉన్నప్పటికీ, అంతగా కులాంతర వివాహాలు జరగడంలేదు. వివాహాలలో కులాల పట్టింపు పోవడమేగాక, వారి సంతానానికి కుల ప్రసక్తి లేకుండా చేసే విధానం చట్టరీత్యా రావలసి ఉంది.

ఆంధ్రప్రదేశ్‌లో 80% పైగా ప్రజలు వ్యవసాయంపైనా, తత్సంబంధమైన పరిశ్రమలపైన ఆధారపడి ఉంటున్నారు. రాష్ట్ర ఆదాయంలో సగానికి పైగా వ్యవసాయంనుంచే లభిస్తూంది. 1956లో రాష్ట్రం ఏర్పడినప్పుడు 50.88 లక్షల ఎకరాలకు నీటి సౌకర్యం ఉంది. ఆనాడు 59.16 లక్షల టన్నుల ఆహార ధాన్యాల ఉత్పత్తి జరిగింది. తరవాత క్రమంగా నాగార్జునసాగర్, శ్రీశైలం, పోచంపాడు తుంగభద్రవంటి భారీ నీటిపారుదల ప్రాజెక్టులు, ఇంకా అనేక నీటి వనరులు ఏర్పాటు చేసుకొన్న ఫలితంగా 1981 నాటికి సాలీనా 104లక్షల ఆహార ధాన్యాన్ని పండించగలిగినారు. ఒక్క నాగార్జునసాగర్ ప్రాజెక్టువలన 18.78 లక్షల ఎకరాలకు నీటి సౌకర్యం లభిస్తూంది. మొత్తం 11 పెద్దతరహా నీటిపారుదల పథకాలు, 70 మధ్యతరహా నీటిపారుదల పథకాలు అమలులో ఉన్నాయి. వీటివల్ల 15.75 మిలియన్ హెక్టార్ల భూమి సాగు అవుతున్నది.

రాష్ట్రంలో 1678 మెగావాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి అవుతున్నది. మాచ్‌ఖండ్, తుంగభద్ర, నిజాంసాగర్ జలవిద్యుత్ కేంద్రాలు, కొత్తగూడెం, రామగుండం థర్మల్ విద్యుత్ కేంద్రాలూ పనిచేస్తున్నాయి. విజయవాడలో సూపర్ థర్మల్ కేంద్రం ఇప్పుడే ఆరంభమయింది. మొత్తం రాష్ట్రంలో 12,695 గ్రామాలకు విద్యుత్ సరఫరా ఉంది. రాష్ట్రంలో 27, 445 గ్రామాలు ఉన్నాయి.

రాష్ట్రంలో 304 భారీ, మధ్యతరహా పరిశ్రమలు 896.85 కోట్ల పెట్టుబడితో పని చేస్తున్నాయి. వీటివల్ల 2.31 లక్షల మందికి ఉపాధి కలిగింది. అయినప్పటికీ, పారిశ్రామిక రంగంలో రాష్ట్రం ఇంకా వెనకబడే ఉంది. బొగ్గు, ఇనుము, బారైట్స్, అభ్రకం, ఆస్‌బెస్టాస్, సున్నపురాయి రాష్ట్రంలో బాగా లభిస్తూంది. వీటిని పూర్తిగా వినియోగించుకోవలసిన అవసరం ఉంది. తిరుపతిలో రైలుపెట్టెల కర్మాగారం, కాకినాడలో ఎరువుల కర్మాగారం, విశాఖలో ఉక్కు కర్మాగారం పనిచేయ మొదలుపెట్టిన తరవాత పారిశ్రామిక రంగంలో చాలా ప్రగతిని సాధించే అవకాశం ఉంది.

రాష్ట్రంలో భూసంస్కరణలు అమలు పరచటంవల్ల 2, 18,000 ఎకరాల భూమి ప్రభుత్వానికి లభించింది. ఈ మిగులు భూమిని 2, 16, 000 మందికి పంచినట్లు ప్రభుత్వం లెక్కలు ఇచ్చింది. రాష్ట్రం మొత్తంమీద పేదలకు 51, 650 ఇళ్లు నిర్మించి ఇచ్చినట్లు కూడా ప్రభుత్వ లెక్కలు సూచిస్తున్నాయి.

1981 జనాభా లెక్కలనుబట్టి రాష్ట్రంలో 53,592, 605 మంది ఉన్నారు. ఇందులో 41, 134, 896 మంది గ్రామాలలో ఉండగా 12, 457,709 మంది నగరాలలో ఉన్నారు. అంటే 76.75 శాతం గ్రామీణ జనాభా అనీ, 23.25 శాతం నగరాల జనాభా అనీ స్పష్టపడింది. రాష్ట్రంలో 23

జిల్లాలున్నాయి. ఇందులో హైదరాబాద్ జిల్లా నూటికి నూరుశాతం నగరానికి చెందింది. రాష్ట్రంలో మొత్తం 252 చిన్న, పెద్ద నగరాలున్నట్లు వర్గీకరించి నారు. ఇవి 5 వేల జనాభా మొదలు లక్షకు పైబడిన జనాభావరకు ఉన్నాయి. సేకరించిన వివరాలనుబట్టి 1981 నాటికి 25.55 శాతం కార్మికులు పెరిగినట్లు తేలింది. ఇందులో వ్యవసాయ కార్మికులు పశ్చిమగోదావరి, కర్నూలు గుంటూరుజిల్లాలలో అత్యధికంగా ఉండగా, హైదరాబాద్ జిల్లాలో అతిస్వల్పంగా ఉన్నారు. రాష్ట్ర జనాభానుబట్టి చదరపు కిలోమీటరుకు జనసాంద్రత 195 మంది ఉన్నట్లు లెక్కలు చూపుతున్నాయి. మొత్తం 15, 925, 661 మంది రాష్ట్రంలో అక్షరాస్యులు ఉన్నారు. అంటే 29.72 శాతం అన్నమాట. వీరిలో పురుషులు 10,582, 245 ఉండగా, స్త్రీలు 5, 343, 416 ఉన్నారు. ఈవిధంగా విద్యారంగంలో అఖిలభారత స్థాయికంటె మనది తక్కువ స్థాయి లోనే ఉన్నట్టు తేలింది.

రాష్ట్రంలో ప్రధానంగా కార్మికులుగా నివసిస్తున్న వారిసంఖ్య 22,606, 439. అంటే జనాభాలో 42.18శాతం. వీరిలో సాగు వృత్తిలో వున్న వారు 7, 570, 893. వ్యవసాయ కార్మికులు 8, 291, 642. వీరుగాక గృహ పరిశ్రమలలో, చేతి వృత్తులలో పని చేసుకొంటూ జీవనం గడిపే వారి సంఖ్య చూస్తే 1, 227, 285 మంది ఉన్నారు. వర్గీకరించని అనేకవిధాలైన పనులలో ఉన్న వారు 5, 716, 619 అయితే, చిల్లర వృత్తులలో 4, 122, 800 మంది ఉన్నారు. కార్మికేతరుల సంఖ్య 26, 863, 366.

ఈ వివరాలనుబట్టి కార్మికరంగంలో ఉన్న జనాభాశాతం మొత్తం జనాభాలో 42.73 శాతం ఉందనీ, అందులో పురుషులు 54.16 శాతం అయితే, స్త్రీలు 31.24 శాతం అనీ స్పష్టపడింది.

రాష్ట్రంలో హరిజనులసంఖ్య 13.27 శాతం అయితే, గిరిజనులశాతం 3.81 ఉంది. ఈ ఉభయవర్గాల నిమిత్తం ప్రభుత్వం కార్పొరేషన్‌లు స్థాపించింది. ప్రత్యేకంగా మంత్రులను ఏర్పరచింది. అనేక సంక్షేమ కార్యక్రమాలు రూపొందించింది. విద్య, వైద్యం, ఆరోగ్యం, గృహావసతి, ఉద్యోగాలలో కేటాయింపులు, విద్యారంగంలోనూ స్థానిక సంస్థలలోనూ, శాసన సభలలోనూ రిజర్వేషన్‌లు ఏర్పాటు చేసింది. అట్లాగే వెనకబడిన తరగతుల సంక్షేమంకోసం ప్రభుత్వం ప్రత్యేక కృషి తలపెట్టింది. కొన్ని కులాలను వెనకబడిన వారుగా నిర్ణయించింది. అయితే జనాభా లెక్కలలో వీరి వివరాలు సేకరించనందువల్ల రాష్ట్రంలో వెనకబడిన కులాలవారి జనాభా ఎంతో స్పష్టంగా తెలియదు. 46 శాతం వరకూ ఉన్నట్లు అంచనా. వెనకబడిన తరగతులకు, హరిజన గిరిజనులకు, ఆర్థికంగా వెనకబడినవారికి సహాయపడే నిమిత్తం, వారి పిల్లలకు హాస్టళ్ళలో ఉచితభోజనవసతి సౌకర్యాలు పుస్తకాలు ప్రభుత్వం అందిస్తున్నది.

రాష్ట్రంలో సహజవనరులను పరిశీలిస్తే, గనులకు సంబంధించి ఇంకా

ఎంతో సంపద వెలికి తీయవలసిఉంది. కడప బేసిన్‌లో జరగవలసిన కృషి అనన్య సామాన్యమని స్పష్టమైంది.

రాష్ట్రంలో అటవీ సంపద ఉండవలసినంతగా లేదు. మొత్తం విస్తీర్ణంలో 33 శాతం అడవులకింద ప్రత్యేకించవలసి ఉంది. కాని రాష్ట్రంలో 64,154 చదరపు కిలోమీటర్లు అంటే 23 శాతం మాత్రమే అడవి ఉంది. ఇందులోకూడా చాలాభాగం పేపరు మిల్లుల నిమిత్తం కొట్టివేసినారు. ప్రత్యామ్నాయంగా మొక్కలు పెంచడం అనేది చురుకుగా సాగడంలేదు. దీనివల్ల వాతావరణ స్థితి గతులలో మార్పులు బాగా వచ్చినాయి.

ఆంధ్రప్రదేశ్‌కు 970 కిలోమీటర్ల సముద్రతీరం ఉంది. సముద్రగర్భంలో నిక్షిప్తాలను ఇంకా బాగా వాడుకోవలసి ఉంది. నరసాపురంవద్ద సముద్రతీరాన ఆయిల్ లభిస్తుందని ఇటీవలే కనుగొన్నారు. చేపల పరిశ్రమను బాగా పెంపొందించే అవకాశం ఉంది. సముద్రతీరాన్ని టూరిస్టు ఆకర్షణ కేంద్రాలుగా పెంపొందించవలసి ఉంది.

గోదావరి, కృష్ణ, తుంగభద్ర, పెన్న, నాగావళి, వంశధార, మంజీర, మూసీవంటి నదులు రాష్ట్రంలో ప్రవహిస్తున్నాయి. అంతర్‌రాష్ట్రీయ నదీ సమస్యలు కొంతవరకు పరిష్కారం అయినందువల్ల జల సంపదను సద్వినియోగం చేసుకోవలసి ఉంది. డెల్టా ప్రాంతాల అభివృద్ధికి ఇప్పుడిప్పుడే తీవ్రకృషి జరుగుతూంది.

అట్లాగే సగం గ్రామాలకు రవాణా, రాకపోకల సౌకర్యాలు అమర్చవలసి ఉంది. రక్షిత మంచినీటి పథకం అమలుపరచవలసిన గ్రామాలు 8,206 ఉన్నాయి. నల్గొండ, ప్రకాశం, గుంటూరు, కృష్ణా జిల్లాలలోని 171 గ్రామాలు ఫ్లోరైడ్ ప్రభావంవల్ల అక్కడి ప్రజలకు ఎముకలు వంకరలు తిరిగిపోతున్నాయి. దీని నివారణకుగాను నెదర్‌లాండ్స్ సహాయంతో 11.55 కోట్ల రూ॥లతో ఒక పథకాన్ని అమలుపరుస్తున్నారు.

కనీస వేతనాల పథకాన్ని అన్ని రంగాలకు విస్తరించి, అమలుపరచవలసి ఉంది. 18 సంవత్సరాలలోపు వయస్సుగల బాలబాలికలు గృహాలలో హోటళ్ళలో, పొలాలలో, కర్మాగారాలలో, తదితరచోట్ల పనిచేస్తున్న వారెందరో వివరాలు లేవు. అట్లాగే ప్రభుత్వం వెట్టిచాకిరీని నిషేధించినప్పటికీ, ఇంకా ఈ బానిసత్వంలో ఎందరు మగ్గుతున్నారో అంచనా లేదు. భిక్షాటన వృత్తిని కూడా ప్రభుత్వం నిషేధించింది. కాని దీనికి సంబంధించి వివరాలు సేకరించ లేదు.

రాజ్యాంగరీత్యా అంటరానితనాన్ని నిషేధించి, అది పాటిస్తే నేరంగా పరిగణిస్తున్నప్పటికీ, గ్రామాలలో మాల, మాదిగవాడలు ఊరికి దూరంగానే ఉన్నాయి. ఇది ఎట్లా రూపుమాపవలెనో ఇంకా ఒక పథకం లేదు.

రాజ్యాంగరీత్యా 14 సంవత్సరాలలోపు పిల్లలందరికీ ఉచిత నిర్బంధ విద్య అందించవలసి ఉంది. ఈ రంగంలోకూడా ప్రభుత్వం విఫలమైంది. 5వ ప్రణాళికా

కాలంలో 24 శాతం పిల్లలను చేర్చుకోవాలనుకొన్నా, 18.5 శాతంమాత్రమే చేర్చగలిగినారు. ఆరవప్రణాళికలో 30 శాతం పిల్లలను చేర్చుకోవలెనని తలపెట్టి వారు. అదీగాక చేరిన వారంతా చివరిదాకా చదువు కొనసాగించడంలేదు. ఇట్లా మధ్యలో మానివేసే వారి సమస్య కూడా ఎదుర్కోవలసి ఉంది. విద్యా రంగంలో సంపన్నులకు బాగా అవకాశాలున్నాయి. ఇందువల్ల తారతమ్యాలు హెచ్చు కావడానికి దారి తీస్తున్నది.

దారిద్ర్యరేఖకంటె ఇంకా అట్టడుగుస్థాయిలో 42.3% ప్రజలు ఉన్నారు. అంటే 17.9 మిలియన్లు. (అక్టోబరు 1969 నాటికి) తరవాత లెక్కలు సేకరించవలసిఉంది. అట్లాగే నిరుద్యోగుల సంఖ్య కచ్చితంగా తెలియదు. ఇంతవరకు తెలిసిన వివరాలనుబట్టి 13.75 లక్షలమంది ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్చేంజ్‌లలో నమోదై ఉన్నారు. అట్లా నమోదు కానివారు, గ్రామాలకుచెందిన వారెందరో లెక్కలు లేవు. కాని ప్రతియేటా నిరుద్యోగుల సంఖ్య పెరుగుతున్నట్లుమాత్రం సేకరించినమేరకు వివరాలు తెలుపుతున్నాయి.

రాష్ట్రంలో పొగాకు, పత్తి, పసుపు, వేరుశనగ, మిరపవంటి వాణిజ్య పంటలు పండిస్తున్నారు. అయితే ఇందుకు సంబంధించిన రైతులను దళారీలు దోపిడీ చేస్తున్నారు. ప్రభుత్వం ఈరంగంలో అదుపు పెట్టవలసి ఉంది. అట్లాగే వ్యవసాయరంగంలో కూడా ధాన్యానికి గిట్టుబాటు ధరను, పంటలకు భీమా పద్ధతి ఏర్పరచి, రైతుకు రక్షణ కల్పించవలసి ఉంది.

తప్పొప్పుల పట్టిక

30 వ పేజీలో శ్రీ కె. విజయభాస్కరరెడ్డి మంత్రి వర్గానికి ముందుగా కింద పేర్కొన్నది చదవవలె.

## భవనం వెంకట్రామ్‌గారి మంత్రి మండలి

ఫిబ్రవరి 9, 1982న ప్రారంభమైన ఉభయ శాసన సభల సమావేశాలు 15 వ తేదీతో పూర్తి అయినాయి. బడ్జెట్ సమావేశాలకుగాను ఉద్దేశించిన శాసన సభలు ఇట్లా హఠాత్తుగా వాయిదా వేయటానికి, రాష్ట్ర నాయకత్వంలో మార్పులు తేవాలని కేంద్రం భావించటమే కారణం. ముఖ్య మంత్రిగా ఉన్న శ్రీ టి. అంజయ్యను మార్చటానికి కాంగ్రెస్ (ఐ) పార్టీ అధిష్ఠానవర్గం నిర్ణయించింది. అయితే పైకి మాత్రం, శాసనసభ సమావేశాలు ఎందుకు వాయిదా వేయమన్నారో, ముఖ్యమంత్రిని ఎందుకు మార్చదలిచినారో కారణాలు చెప్పలేదు. కేంద్రంనుంచి శ్రీ మూపనార్, కాంగ్రెస్ (ఐ) కార్యదర్శి, శ్రీ ఎన్.డి. తివారి, కేంద్రమంత్రి రాష్ట్ర రాజధానికి వచ్చి కాంగ్రెసు (ఐ) శాసన సభ్యులు తదితరుల అభిప్రాయాలు సేకరించి ఒక రహస్య నివేదికను కేంద్ర పార్టీకి సమర్పించినారు. మరొక పర్యాయం వీరిరువురు రాష్ట్రానికి వచ్చి ఉభయ శాసన సభల కాంగ్రెసు (ఐ) సభ్యులలోనుంచి నాయకుని ఎన్నుకోవటానికి ప్రతిపాదన చేసినారు. కాని భిన్నాభిప్రాయాలవల్ల అటువంటి ఎన్నిక జరగలేదు. అయితే శాసన సభల కాంగ్రెసు (ఐ) పక్షం ఏకగ్రీవంగా ఒక తీర్మానం చేస్తూ కాంగ్రెసు (ఐ) రాష్ట్ర నాయకత్వం నిర్ణయించటానికి ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీకి అధికారాన్ని ఇస్తూ తీర్మానించింది. తదనుగుణంగా శ్రీ భవనం వెంకట్రామ్ ముఖ్యమంత్రిగా ఉండవలెనని, శ్రీ సి. జగన్నాథరావు ఉప ముఖ్యమంత్రిగా ఉండవలెనని కేంద్రపార్టీ నిర్ణయించింది.

రాష్ట్ర గవర్నర్ శ్రీ కె.సి. అబ్రహాం ముఖ్యమంత్రిగా శ్రీ భవనం వెంకట్రామ్‌చేత 1982, ఫిబ్రవరి 24న ప్రమాణస్వీకారం చేయించినారు. పెద్ద మనుష్యుల ఒప్పందం ప్రకారం ఆంధ్రప్రాంతానికి ముఖ్యమంత్రి పదవి లభిస్తే, తెలంగాణా ప్రాంతానికి ఉపముఖ్యమంత్రి పదవి ఇవ్వవలెననే ఒప్పందం ఉంది. శ్రీ సి. జగన్నాథరావు ఉప ముఖ్యమంత్రిగా ఫిబ్రవరి, 24న ప్రమాణస్వీకారం చేసినారు. తరవాత ముఖ్యమంత్రి ఢిల్లీ వెళ్ళి ప్రధానితోనూ, కేంద్రపార్టీ నాయకులతోనూ సంప్రదించి తన మంత్రిమండలి సభ్యుల జాబితాను గవర్నర్‌కు సమర్పించినారు. 22 మంది కేబినెట్ హోదామంత్రులు, 10 మంది స్టేట్ మంత్రులు ఫిబ్రవరి 28న ప్రమాణ స్వీకారం చేసినారు. ఇందులో 28 మంది శ్రీ అంజయ్యగారి మంత్రి వర్గంలోనివారే. ఈ మంత్రుల శాఖలు మార్చి 1 న ప్రకటించినారు.

మంత్రులూ, వారి శాఖల వివరాలు :

| పేరు | శాఖ |
|---|---|
| 1. శ్రీ బి. వెంకట్రామ్ ముఖ్యమంత్రి | భారీ నీటిపారుదల, వాణిజ్య పన్నులు, శాంతి భద్రతలు, సాధారణ పరిపాలన, 20 సూత్రాల పథకం, ఫిలిం అభివృద్ధిసంస్థ, స్త్రీ శిశు సంక్షేమశాఖ, మంత్రులకు ఇవ్వగా మిగిలిన అన్ని శాఖలు. |
| 2. శ్రీ సి. జగన్నాథరావు ఉప ముఖ్యమంత్రి | హోంశాఖ, రవాణాశాఖ, పోలీసు, జైళ్ళు |
| 3. శ్రీ ఎస్. జనార్ధనరెడ్డి | రెవెన్యూ, విద్యుత్ శాఖ |
| 4. శ్రీ కోన ప్రభాకరరావు | ఆర్థికశాఖ, ప్రణాళికా, సమాచారశాఖలు |
| 5. శ్రీ ఎన్. అమరనాథరెడ్డి | సహకారశాఖ |
| 6. శ్రీ ఎం.ఎ. అజీజ్ | అడవులు, వక్ఫ్ శాఖలు |
| 7. శ్రీ ఎం. బాగారెడ్డి | భారీ పరిశ్రమల శాఖ |
| 8. శ్రీ టి. బాలాగౌడ్ | చక్కెర పరిశ్రమలు |
| 9. శ్రీ పి. వి. చౌదరి | దేవాదాయశాఖ |
| 10. శ్రీ టి. హయగ్రీవాచారి | సాంకేతిక విద్యాశాఖ, దేశీయ వైద్యం. |
| 11. శ్రీ కె. కేశవరావు | విద్య |
| 12. శ్రీ ఎ. మదన్‌మోహన్ | న్యాయ, ఆరోగ్య, వైద్యశాఖలు |
| 13. శ్రీ ఎం. మాణిక్యరావు | రోడ్లు, భవనాలశాఖ, ఖాదీ గ్రామ పరిశ్రమ బోర్డు |
| 14. శ్రీ వై.ఎస్. రాజశేఖర రెడ్డి | ఎక్సైజు |
| 15. శ్రీ సి. రామ్‌భూపాల్ రెడ్డి | పంచాయితీరాజ్ |
| 16. శ్రీ బి. రామ్‌దేవ్ | పశు సంవర్ధకశాఖ |
| 17. శ్రీ కె. రంగారావు | సాంఘిక సంక్షేమం, హరిజన సంక్షేమం |
| 18. శ్రీమతి సరోజినీ పుల్లారెడ్డి | మునిసిపల్ పరిపాలన |
| 19. శ్రీ మజ్జి తులసీదాస్ | మధ్యతరహా నీటిపారుదల |
| 20. శ్రీ అగిశం వీరప్ప | చేనేత, జవుళి పరిశ్రమలు |
| 21. శ్రీ చనుమోలు వెంకటరావు | వ్యవసాయశాఖ |
| 22. శ్రీ పాలడుగు వెంకటరావు | మార్కెటింగ్ శాఖ |

| | |
|---|---|
| 23. శ్రీ జి. వెంకటస్వామి | పౌర సరఫరాలు, కార్మికశాఖ |
| 24. శ్రీ వి. వెంకటేశ్వర రావు | లఘుపరిశ్రమలు |
| సహాయ మంత్రులు : | |
| 25. శ్రీ ఎస్. ఆళ్వార్ దాస్ | విద్యాశాఖ |
| 26. శ్రీ ఎన్. చంద్రబాబు నాయుడు | చిన్నతరహా నీటిపారుదల |
| 27. శ్రీ పి. గోవర్ధనరెడ్డి | యువజన సర్వీసులు, గ్రామీణ నీటిసరఫరా శాఖ |
| 28. శ్రీ పి. జనార్ధనరెడ్డి | ఉపాధికల్పన, శిక్షణ, పురావస్తు శాఖలు |
| 29. శ్రీ జి. నాగేశ్వరరావు | వాణిజ్యం, రేవుల శాఖలు |
| 30. శ్రీ ఐ. రామకృష్ణం రాజు | టూరిజం, క్రీడలు |
| 31. శ్రీ డి. రవీంద్రనాయక్ | భూగర్భజల వనరులు |
| 32. శ్రీ బి. సమ్మయ్య | మత్స్య, పట్టుపరిశ్రమ శాఖలు |
| 33. శ్రీ బి. శేషశయనారెడ్డి | గృహనిర్మాణం |
| 34. శ్రీ సి.హెచ్. శ్యామల రావు | గిరిజన సంక్షేమశాఖ |

ముఖ్యమంత్రి, ఉప ముఖ్యమంత్రి ఇరువురూ విధాన పరిషత్తు సభ్యులు కావటంవల్ల విధాన సభకు నాయకులుగా వీరిరువురూ ఉండటానికి వీలులేక పోయింది.

# పరిశీలక గ్రంథాలు, వ్యాసాలు, పత్రికలు

*పదవ అధ్యాయానికి పరిశీలక గ్రంథాలు*

1. పాతికేళ్ళ ఆంధ్రప్రదేశ్ 1956-1980
2. A. P. Year Book 1981, a data news feature Publication.
3. 1981 Census report-Series-2
4. ఆంధ్రప్రదేశ్ మాస పత్రిక ఏప్రిల్ 1981 ఉగాది ప్రత్యేక సంచిక, నవంబరు 1981 సిల్వర్ జూబ్లి ప్రత్యేక సంచిక, ఆంధ్రప్రదేశ్ సమాచారశాఖ ప్రచురణ
5. Planning for Results 1972 PP 44, Federation of Indian Chamber of Commerce and Industry
6. Prabhu, P.S.R.C. Management of rural water supply Projects in A. P.
   Institute of Public Enterprise, Hyderabad-1980-81.

**Books**

1. Bondurant, Joan V.—Regionalism Vs. Provincialism : A study in the Prcblems of Indian National Unity 1958 Berkeley, University of California Press.
2. Harrison, S. Selig - Some notes on the study of State Politics in India – The Andhra Case, Chicago Committee on State Politics in India of the Association for Asian Studies 1961.
3. Weiner, Myron : State Politics in India 1968. Princeton University Press, New Jersey.
4. Rama Murthy M. V.— Prathyeka Andhra Udyamamu, State Book Club, Hyderabad1973

Journals

1. Berustorff, Dagmar : Eclipse of Reddi Raj Asian Survey Oct 1973 Vol. XIII No 10.
2. -do- : Political leadership in A. P. 1956-1973 in Leadership in South Asia; Vikas, New Delhi.
3. Elliott, Carolyn M. Caste and faction among the dominant Caste : The Reddis and Kammas of Andhra in Caste in Indian Politics (Ed) Orient Longmans, New Delhi.

4. Forrester, B. Duncan: Sub-regionalism in India, the Case of Telengana, Pacific affairs, Spring 1970-P-5-21
5. Hugh Gray : Andhra Pradesh in State Politics in India: (Ed) Myron weiner; Princeton University Press 1968
6. ,, : Failure of demand for a separate Andhra State, Asian Survey 1974 Apr. pp. 338-49
7. George T.J.S. Politics of Division Far Eastern Economic Review, Hong Kong 1973, 12 March.
8. James Walch : One Party Dominance in Andhra Pradesh in Faction and Front party systems in South India; Young Asia Publications, New Delhi-1976
9. Leonard, John C.: Politics and Social Change in South India, A study of the Andhra Movement Journal of Constitutional and Parliamentary Studies, 1967 March.
10. Windmiller, Marshall : Linguistic Regionalism in India, Pacific affairs XXVII 1954 December.
11. Ram Reddy G., & B. A. V. Sharma, (Ed) : State Government and Politics (Sterling)
12. Ram Reddy G & B.A. V. Sharma (Ed); Regionalism in India.

Periodicals in Telugu :

1. Prasaritha - a Quarterly Journal of Social Sciences in Telugu
2. Andhra Patrika daily
3. Andhra Prabha daily
4 Andhra Jyothi daily
5. Andhra Bhoomi daily
6. Visalandhra daily
7. Proceedings of Legislative Assembly and Council.

| జిల్లావారీ | మొత్తం ఓటర్లు | పోలైన చెల్లదగిన ఓట్లు | కాంగ్రెస్ 'ఐ' | తెలుగుదేశం | సి.పి.ఐ. |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| శ్రీకాకుళం | 11, 09,490 | 7,73,667 (69.73) | 2,40,049 (36.04) | 3,98,240 (51.47) | 6,575 (0.85) |
| విజయనగరం | 11,27,650 | 7,99,329 (70.88) | 2,50,025 (31.28) | 4,35,206 (54.45) | 4,209 (0.53) |
| విశాఖపట్నం | 14,36,011 | 8,46,408 (58.94) | 2,28,362 (26.98) | 4,89,225 (57.80) | 19,063 (2.25) |
| తూర్పు గోదావరి | 21,83,325 | 15,56,545 (71.29) | 4,42,755 (28.44) | 9,61,792 (61.80) | 13,690 (0.88) |
| పశ్చిమ గోదావరి | 17, 04, 148 | 12,12,162 (71.13) | 2,85,384 (23.55) | 7,80,666 (64.41) | 28,534 (2.36) |
| కృష్ణా | 18,05,990 | 12,93,058 (71.60) | 4,55,365 (35.22) | 5,49,864 (42.52) | 63,873 (4.94) |
| గుంటూరు | 21, 82,295 | 14,69,051 (67.32) | 4,56,151 (31.05) | 8,55,649 (58.25) | 20,820 (1.42) |
| ప్రకాశం | 16, 55,852 | 9,90,689 (59.83) | 3,49,082 (35.24) | 5,14,812 (51.97) | 31,935 (3.22) |
| నెల్లూరు | 12, 80,458 | 8,39,253 (65.54) | 3,04,629 (36.30) | 4,39,507 (52.37) | 5,096 (0.61) |
| కోస్తా ఆంధ్ర | 1,44,85, 240 | 97,79,162 (67.51) | 30,11,802 (30.80) | 54,24,961 (55.46) | 1,93,795 (1.98) |

## ఎన్నికల ఫలితాలు 1983 - రాష్ట

| జిల్లావారీ | మొత్తం ఓటర్లు | పోలైన చెల్లదగిన ఓట్లు | కాంగ్రెస్ 'ఐ' | తెలుగుదేశం | సి.పి.ఐ. | సి.పి.(ఎం) | జనతా |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| శ్రీకాకుళం | 11,09,490 | 7,73,667 (69.73) | 2,40,049 (36.04) | 3,98,240 (51.47) | 6,575 (0.85) | — | 2,262 (0.29) |
| విజయనగరం | 11,27,650 | 7,99,329 (70.88) | 2,50,025 (31.28) | 4,35,206 (54.45) | 4,209 (0.53) | 3,533 (0.44) | — |
| విశాఖపట్నం | 14,36,011 | 8,46,408 (58.94) | 2,28,362 (26.98) | 4,89,225 (57.80) | 19,063 (2.25) | 10,342 (1.22) | 533 (0.06) |
| తూర్పు గోదావరి | 21,83,325 | 15,56,545 (71.29) | 4,42,755 (28.44) | 9,61,792 (61.80) | 13,690 (0.88) | — | 2,009 (0.13) |
| పశ్చిమ గోదావరి | 17,04,148 | 12,12,162 (71.13) | 2,85,384 (23.55) | 7,80,666 (64.41) | 28,534 (2.36) | 11,439 (0.95) | 10,99 (0.92) |
| కృష్ణా | 18,05,990 | 12,93,058 (71.60) | 4,55,365 (35.22) | 5,49,864 (42.52) | 63,873 (4.94) | 48,962 (3.79) | 20,67 (1.60) |
| గుంటూరు | 21,82,295 | 14,69,051 (67.32) | 4,56,151 (31.05) | 8,55,649 (58.25) | 20,820 (1.42) | 36,392 (2.48) | 831 (0.06) |
| ప్రకాశం | 16,55,852 | 9,90,689 (59.83) | 3,49,082 (35.24) | 5,14,812 (51.97) | 31,935 (3.22) | 14,924 (1.51) | 13,74 (1.39) |
| నెల్లూరు | 12,80,458 | 8,39,253 (65.54) | 3,04,629 (36.30) | 4,39,507 (52.37) | 5,096 (0.61) | 25,680 (3.06) | 2,294 (0.27) |
| కోస్తా ఆంధ్ర | 1,44,85. 240 | 97,79,162 (67.51) | 30,11,802 (30.80) | 54,24,961 (55.46) | 1,93,795 (1.98) | 1,51,272 (1.55) | 53,346 (0.55) |

## 1983 - రాష్ట్ర వ్యాప్తంగా.

| ం) | జనతా | లోక్‌దళ్ | కాంగ్రెస్ (ఎస్) | కాంగ్రెస్(జె) | బిజెపి | ఇండిపెండెంట్లు | గెలిచిన సీట్లు |
|---|---|---|---|---|---|---|---|
| | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 |
| | 2,262<br>(0.29) | 50,092<br>(6.49) | — | — | 11,548<br>(1.49) | 64,901<br>(8.39) | తె. దేశం-11<br>కాం. (ఐ)-2 |
| 3<br>) | — | — | 26,267<br>(3.30) | — | 8,783<br>(1.10) | 71,306<br>(8.92) | తె. దేశం-10<br>కాం. (ఐ)-2 |
| 42<br>2) | 533<br>(0.06) | 2,266<br>(0.27) | — | 3,396<br>(0.40) | 31,377<br>(3.71) | 61,844<br>(7.31) | తె. దేశం-12<br>కాం. (ఐ)-1 |
| - | 2,009<br>(0.13) | 3,751<br>(0.24) | 304<br>(0.02) | 2,355<br>(0.15) | 1,914<br>(0.12) | 1,27,975<br>(8.22) | 21సీట్లూ తె. దేశానికే వచ్చాయి. |
| 39<br>5) | 10,993<br>(0.92) | 1,098<br>(0.10) | — | 3,772<br>(0.32) | 1,834<br>(0.16) | 87,442<br>(7.21) | తె. దేశం-15<br>ఇండిపెం-1 |
| 62<br>9) | 20,678<br>(1.60) | 35,995<br>(2.78) | 271<br>(0.02) | 7,195<br>(0.56) | 3,899<br>(0.30) | 1,06,956<br>(8.27) | తె. దేశం-12<br>కాం. (ఐ)-4<br>ఇండిపెం-1 |
| 392<br>3) | 831<br>(0.06) | 3,958<br>(0.27) | 144<br>(0.01) | 11,751<br>(0.80) | 21,140<br>(1.44) | 62,215<br>(4.23) | తె. దేశం-18<br>ఇండిపెం-1<br>(సిపిఐ) |
| 24<br>1) | 13,746<br>(1.39) | 691<br>(0.07) | 15,653<br>(1.58) | 2,573<br>(0.26) | 4,565<br>(0.46) | 42,708<br>(4.31) | తె. దేశం-11<br>కాం. (ఐ)-1<br>ఇండిపెం-1 |
| 80<br>3) | 2,294<br>(0.27) | 896<br>(0.10) | — | 6,328<br>(0.75) | 42,694<br>(5.09) | 12,129<br>(1.45) | తె. దేశం-10<br>బిజెపి-1 |
| 372<br>) | 53,346<br>(0.55) | 98,747<br>(1.01) | 42,639<br>(0.44) | 37,370<br>(0.38) | 1,27,754<br>(1.31) | 6,37,476<br>(6.52) | |

| జిల్లా | మొత్తం ఓటర్లు | పోలైన చెల్లదగిన ఓట్లు | కాం.ఐ | తె.దే. | సి. పి. ఐ. | సి. పి. ఎం. |
|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| చిత్తూరు | 15,04,240 | 11,05,497 (73.49) | 3,73,843 (33.82) | 6,48,958 (58.70) | — | — |
| కడప | 12,42,212 | 9,15,005 (73.67) | 3,42,876 (37.47) | 4,13,098 (45.14) | 3,133 (0.34) | — |
| అనంతపురం | 14,81,375 | 9,92,310 (66.99) | 3,06,828 (30.92) | 5,58,488 (56.28) | 21,126 (2.13) | 1,255 (0.13) |
| కర్నూలు | 13,55,079 | 9,31,747 (68.77) | 3,73,482 (40.08) | 4,78,021 (51.31) | — | 8.250 (0.89) |
| రాయలసీమ | 55,82,906 | 39,44,559 (70.65) | 13,97,029 (35.42) | 20,98,515 (53.20) | 24,256 (0.60) | 9,505 (0.24) |
| మహబూబ్ నగర్ | 13,78,006 | 8,90,742 (64.64) | 3,83,087 (43.01) | 3,25,303 (36.52) | 8,066 (0.98) | — |
| రంగారెడ్డి | 6,46,467 | 4,32,034 (66.83) | 1,83,958 (42.58) | 91,308 (21.13) | 4,234 (0.90) | 10,988 (2.54) |
| హైదరాబాద్ | 15, 93,886 | 9,08 559 (57.00) | 1,73,526 (19.10) | 2,29,483 (25.26) | 5,937 (0.65) | 4,037 (0.44) |
| మెదక్ | 9,82,468 | 7,19,035 (73.19) | 3,23,706 (45.00) | 1,13,607 (30.13) | 32.536 (4.52) | — |
| నిజామాబాద్ | 8,88,925 | 5,91,158 (66.50) | 2,18,120 (36.90) | 2,81,399 (47.60) | — | — |

| ...ఎం. | జనతా | లోక్ దళ్ | కాం.(ఎస్) | కాం.[జె] | బి.జె.పి. | ఇం.పెం. | గెలిచినసీట్లు |
|---|---|---|---|---|---|---|---|
| | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 |
| — | 1,036<br>(0.09) | 2,600<br>(0.24) | — | 216<br>(0.08) | 5,021<br>(0.45) | 73,753<br>(6.67) | తె. దేశం-14<br>ఇం. పెం-1 |
| — | — | 12,169<br>(1.33) | — | 43,969<br>(4 83) | 966<br>(0.11) | 98,797<br>(10.78) | తె. దేశం-6<br>కాం.[ఐ]-3<br>కాం.జె-1<br>ఇం. పెం-1 |
| 55<br>3) | — | 31,318<br>(0.13) | — | — | 3,273<br>(0.33) | 1,00,067<br>(10.08) | తె దేశం-12<br>కాం.[ఐ]-1<br>ఇం. పెం-1 |
| 50<br>9) | 790<br>(0.08) | — | — | 2,504<br>(0.27) | 4,397<br>(0.47) | 64,303<br>(6.90) | తె. దేశం-9<br>కాం.[ఐ]-3<br>ఇం. పెం-1 |
| 05<br>4) | 1, 826<br>(0.05) | 16,087<br>(0.41) | — | 46,759<br>(1.19) | 13,662<br>(0.35) | 3,36,920<br>(8.54) | |
| — | 84,259<br>(9.46) | 16,792<br>(1.89) | — | 2,502<br>(3.14) | 29,948<br>(3.14) | 42,785<br>(4.80) | తె. దేశం-6<br>కాం.[ఐ]-6<br>జె.ఎన్.పి-1 |
| 38<br>5) | 15,075<br>(3.50) | 30,089<br>(6.96) | — | 1,519<br>(0.35) | 9,873<br>(2.29) | 84,990<br>(19.67) | 6 సీట్లూ<br>కాం[ఐ]<br>గెలుచుకుంది |
| 37<br>4) | 30,518<br>(3.36) | — | — | 4,561<br>(0.50) | 1,93,214<br>(21.27) | 2,67,238<br>(29.42) | తె.దేశం-7<br>బి.జె.పి-1<br>మజ్లీస్-5 |
| — | — | 322*<br>(0.04) | — | — | 36,546<br>(5.08) | 1,21,318<br>(15.27) | తె.దేశం-3<br>కాం.[ఐ]-6<br>ఇం. పెం-1 |
| — | 2,010<br>(0.34) | — | — | 20,35<br>(0.34) | 6,154<br>(1.04) | 81,490<br>(13.78) | తె.దేశం-7<br>కాం.[ఐ]-1<br>ఎన్.వి.ఎం.-1 |

| జిల్లా | మొత్తం ఓటర్లు | పోలైన చెల్లదగిన ఓట్లు | కాం.ఐ | తె.దే. | సి. పి. ఐ. | సి. పి. ఎం. |
|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| ఆదిలాబాద్ | 8,74,278 | 5,43 642 (62.18) | 1, 98,736 (36.56) | 1,74,221 (32.05) | 30,866 (5.68) | — |
| కరీంనగర్ | 17,89,141 | 8,34.528 (46.64) | 2,87,720 (34.48) | 3,21,495 (38.53) | 51,334 (6.15) | — |
| వరంగల్ | 11,63, 581 | 8,59,526 (73.87) | 3,54,639, (41.25) | 2,57,064 (29.91) | 36,164 (4.21) | 45,314 (5.27) |
| ఖమ్మం | 9,31,786 | 6,48,255 (69.57) | 2,16,585 (33.41) | 1,67,366 (25.82) | 1,02,115 (15.75) | 1,02,831 (15.86) |
| నల్గొండ | 13,03, 745 | 8,83,658 (67.78) | 3,10,764 (35.17) | 2,48,460 (28.12) | 1,01,067 (11.44) | 1,01,717 (11.50) |
| తెలంగాణా | 1,15,52, 233 | 73, 11, 137 (63.29) | 26,50,741 (36.26) | 23, 09, 706 (31.59) | 3,72,319 (5.09) | 2,64,887 (3.62) |
| గ్రాండ్ టోటల్ | 3,16,20, 358 | 2,10,34, 858 (66.52) | 70, 59,572 (33.56) | 98,33,182 (46.75) | 5,90,370 (2.81) | 4,25,664 (2.02) |

నోట్ : హైదరాబాద్ జిల్లాలో ఇండిపెండెంటు ఓట్లు మజ్లీస్‌కు వచ్చిన 2.02 లక్షలతో కలిపి.

| జనత | లోక్‌దళ్ | కాం.(ఎస్) | కాం. జె) | బి.జె.పి. | ఇం. పెం. | గెలిచిన సీట్లు |
|---|---|---|---|---|---|---|
| 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 |
| 4,204 (0.77) | 1,769 (0.33) | — | — | 16,323 (3.00) | 1,17,523 (21.61) | తె.దేశం-3 కాం.[ఐ]-3 ఇం. పెం-1 ఎస్.వి.ఎం-1 సి.పి.ఐ-1 |
| 531 (0.06) | 24,419 (2.93) | — | 1,930 (0.23) | 22,227 (3.26) | 1,19,872 (14,36) | తె. దేశం-6 కాం.[ఐ]-5 ఎస్.వి.ఎం-2 |
| 9,666 (1.12) | 4,297 (0.50) | — | 1 621 (0.19) | 1,00,625 (11.71) | 50,236 (5.84) | తె. దేశం-4 కాం. [ఐ]-7 సి.పి.ఎం - 1 బిజెపి-1 |
| — | — | — | 3,172 (0.49) | 1,268 (0.20) | 54,918 (8.47) | సిపిఐ-3 సి.పి.ఎం-2 కాం.[ఐ]-2 తె. దేశం-1 సిపిఎం.ఎల్ 1 |
| 518 (0.06) | — | 457 (0.05) | 6,609 (0.75) | 20,586 (2.33) | 93,480 (10.58) | తె. దేశం-4 కాం. ఐ.-5 సి.పి.ఎం-2 ఇం. పెం.-1 |
| 1,46,776 (1.06) | 77,688 (1.06) | 457 (0.01) | 23,949 (0.33) | 4,39,764 (6.01) | 10,24,850 (14.02) | |
| 2,01,948 (0.96) | 1,92,522 (0.92) | 43,096 (0.21) | 1,03,078 (0.51) | 5,81,130 (2.76) | 19,99,246 (9.50) | |